

1962 అక్టోబరు 23 వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో సైనిక గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న మలయా ప్రధాన మంత్రి శ్రీ తుంకూ అబ్దుల్ రహమాన్



వాల్తేరు బీచ్:— రోడు అభివృద్ధి మొదటిదశ పనిని చేపట్టారు:

సంపుటి : 7 సంచిక : 2

# ఆంధ్రప్రదేశ్

(సచిత్ర మాస పత్రిక)

డిశంబరు, 1962

మార్గశిర-పుష్య 1884 శకం

సంవత్సర చందా:

3 రూపాయలు

విడి ప్రతి వెల

25 నయాపైసలు

# విషయసూచిక



ముఖచిత్రం:— "రేపటి మీ భవిష్యత్తుకై, నేడు మేం పోరాడుతున్నాం"

వెనుక అట్టమీది చిత్రం.— యువకులకు పిలుపు: చైనా దురాక్రమణను ఖండిస్తూ 1962 నవంబరు 2వ తేదీన హైదరాబాదులో ఊరేగింపు అనంతరం నిజాం కళాశాల మైదానంలో జరిగిన విద్యార్థుల బహిరంగసభలో ప్రసంగిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి.

# విస్మయాత్మకమైన చైనా దురాక్రమణ చర్య మనలను ఉత్తేజితులను చేసింది



# ప్రధాని నెహ్రూ ఉద్ఘాటన

1962 నవంబరు 4వ తేదీన జరిగిన జాతీయాభివృద్ధి మండలి సమావేశంలో ప్రధానమంత్రి నెహ్రూ ప్రారంభోపన్యాసం యిస్తూ యిలా అన్నారు:

మిత్రులారా! అతిముఖ్యమైన పరిస్థితి ఏర్పడింది కాబట్టి ఈవేళ మనం ప్రత్యేకంగా సమావేశమవుతున్నాము ఇటీవలి సంఘటనలను గురించీ, నిజానిజాలను గురించీ మీకందరికీ తెలుసు. అయినప్పటికీ ఈ సంఘటనలనుగురించి మీకు వివరించదలిచాను. చైనీయులు భారతదేశంపైకి దండెత్తివచ్చారు. ఇది కేవలం ఒక ప్రత్యేక ప్రదేశంలో సరిహద్దు ప్రాంతంపై దాడి చేయడం మాత్రమే కాదు. అంతకంటే పెద్దది.

గత నాలుగైదు సంవత్సరాల నుంచీ లఢక్‌లో చైనీయులు దాడులు జరుపుతూనే వున్నారు. వారి ఆక్రమణలో అధిక విస్తీర్ణమే వుంది కాని అప్పుడు కొద్దిపాటి దళాలు వెళ్ళి కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకోవడం జరిగేది కాబట్టి అవి కొద్దిఎత్తుననే జరిగాయనవచ్చు.

కాగా సెప్టెంబరు, అక్టోబరు నెలలో ముఖ్యంగా అక్టోబరు 20 వ తేదీనుంచి నేఫాలో జరిగిన సంఘటనలు పైవాటి కంటే పరిమాణంలోనూ, ప్రమాణంలోనూ పూర్తిగా భిన్నమైనవి. ఇవి కేవలం స్వల్ప సరిహద్దు సంఘటనలు కావు. ఇది భారతదేశంపై దండయాత్ర జరపడమే. చైనీయుల ఉద్దేశమేమిటో ఎవ్వరైనా ఊహించుకోవలసిందే. మనందరమూ దీనిని గురించి ఆలోచించగలం. ఏమైనప్పటికీ ఇప్పటి వరకూ జరిగిన సంఘటనలకంటే ముఖ్యంగా మన స్వాతంత్ర్యానంతర సంఘటనలన్నిటికంటే ఇది చాలా ముఖ్యమైనది చైనీయుల దాడి. దానికి మనం చూపిన ప్రతిఘటన భారత చరిత్రలో ఒక ప్రధానఘట్టమనవచ్చు.

ఈనాడు మనం చరిత్ర యొక్క ముఖ్యదశలోవున్నాం. బ్రహ్మాండమైన చారిత్రక సమస్యలను ఎదుర్కొంటున్నాం. వీటిపై మనభవిష్యత్తు ఆధారపడివుంది. కాబట్టి మనం పెద్దవాళ్ళమైనా, చిన్నవాళ్ళమైనా దానితో ప్రమేయంలేకుండా బృహత్కార్యాన్నే చేపట్టాలి. పెద్దవాళ్ళు మాత్రమే పెద్దపెద్ద సమస్యలను ఎదుర్కొన గలుగుతారు. ఇక్కడ "పెద్ద" అంటే పరిమాణంలో గాక మేధస్సులోనూ, దృష్టిలోనూ, కృతనిశ్చయంలోనూ "మిన్న" అని భావించాలి.

ఇప్పటికి జరిగిన సంఘటనల అసాధారణమైన ప్రభావాన్ని గమనించవలసిందిగా మొట్టమొదట మీకునొక్కి చెప్పదలుచుకున్నాను.

ఇవి మన చరిత్రగతినీ, మన జాతీయ దృక్పథాన్నీ మార్చాయి. లేదా మారుస్తాయి. ఈ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కోడానికి మనం మనసారాకోరుతున్నాము. కనుక దీనిని సమర్థంగా ఎదుర్కోడానికి పెద్ద ఎత్తున ఆలోచన చేయాలి. మన ఇతర సమస్యల సంగతి మరిచిపోయి మనందరికీ సంబంధించిన ఈ బృహత్తర సమస్యపై దృష్టిని సారించాలి.

బృహత్తర సమస్యల పరిష్కారంలో చిన్నచిన్న సమస్యలు, వివాదాలు, విభేదాలు మొదలైనవి వాటికవే పరిష్కారమవుతాయని నా నమ్మకం. అలా జరుగుతుంది కూడా. ఈ బృహత్తర సమస్యకు, జాతియొక్క బ్రహ్మాండమైనతోడ్పాటు, కృషి అవసరమవుతుందనేది కూడా సుస్పష్టం. కాగా కేంద్రంలో కానీ, రాష్ట్రాలలో కానీ ప్రభుత్వాధికారం కలిగియున్న వారిపై గురుతరమైన బాధ్యత వుంది. ఈ బాధ్యతా నిర్వహణ కొందరికే గురుతరమైనది కావచ్చు కాని మనందరమూ ఆ బాధ్యత వహించగలము. వహించాలి కూడా. కాబట్టి ఈ సమస్యను ఈ దృష్టితో పరిశీలించి ఇప్పటి వరకు జరిగిన, జరుగనున్న సంఘటనల పరిణామాలను గుర్తించడం అవసరం.

చైనీయుల దాడి నేను మొదటే చెప్పినట్లు పరిమాణంలోనూ ప్రమాణంలోనూ మొదటివాటి కంటే భిన్నంగా వుంది. పిడుగుపాటుగా వారు మనపై దాడిచేశారు. వాటిని ఎదుర్కోడానికి ఈనాడు దేశంలో ప్రజలు చూపుతున్న ధైర్యస్థైర్యాలు ఉత్సాహ ఉద్రేకాలు దానికి సమఉజ్జీగానే వున్నాయి. మన వార్తాపత్రికలలో ఇప్పటి వరకూ కానవచ్చిన విభిన్న సమస్యలు, వివాదాలు, ఇతర విషయాలు ఇప్పుడు గతంలోని విషయాలుగా పరిణతి నొందాయి. అయితే ఈపరిస్థితి ఎల్లకాలం కొనసాగకపోవచ్చు. మళ్ళీ సమస్యలు తలెత్తవచ్చు. కాని ప్రస్తుతానికి అవి సమసిపోయే వుంటాయి. వాటిని మనం ఆ స్థితిలోనే వుంచాలి. వాటి స్థితిలో మార్పు ఏమీ వుండబోదనడం నిస్సందేహం. దేశంలో ఎల్లెడలా యావన్మంది ప్రజలు చూపుతున్న ఉత్సాహోద్రేకాలే ఇందుకు ప్రత్యేక నిదర్శనాలు. మనలను అణచివేయడానికి గతంలో అనేక ప్రయత్నాలు జరిగాయి. కాని ప్రస్తుత సంఘటన నాకు బాధ కలిగించింది. మీ అందరికి కూడా ఇది బాధకలిగిందనడంలో సందేహం లేదు.

విస్మయాత్మకమైన ఈ చర్య, భారతీయులలో ఉత్తేజాన్ని రేకెత్తించింది. భారతీయాత్మ మేల్కొన్నది. ఆయా రాష్ట్రాలకు తద్వారా యావత్తు భారతదేశానికి సేవచేయడానికి అవకాశం లభించిన మనపై ఇప్పుడు ఒక బృహత్తరమైన బాధ్యత వుంది. దీని సక్రమనిర్వహణకు మనం శాయశక్తులా కృషి చేయాలి. వ్యక్తిగత విషయాలకు, సంకుచిత భావాలకు తావీయకూడదు. ఈ విషయంలో రాజ్యాంగాన్ని బట్టి చూస్తే కేంద్రప్రభుత్వమనీ, రాష్ట్రప్రభుత్వాలనీ వేరువేరుగా వుండవచ్చు. కాని నిజానికి మనందరమూ ఒకటే. ఏకోన్ముఖంగా ఈ ఉపద్రవాన్ని ఎదుర్కోవాలి.

మన ప్రణాళికా విషయాలను చర్చించడానికి సాధారణంగా జాతీయాభివృద్ధి మండలి సమావేశమవుతుంటుంది. అయితే ఈ ప్రణాళికలు మన జాతీయ జీవితంలో సంబంధం లేనివి కావు. ఇవి మన జాతీయ జీవితంలో అంతర్భాగాలు. మనదేశంలో కొనసాగుతున్న ప్రణాళికలు, ఆర్థిక సామాజిక ప్రగతిపై ఈ సంఘటన ప్రభావం ఏవిధంగా వుండేదీ మనం పరిశీలించాలి. ఈ సమావేశంలో పూర్తి వివరాలలోకి వెళ్ళడానికి సాధ్యం కాకపోవచ్చు. అయితే ఈ విషయంలో మనం కొంత చర్చ జరపగలమని ఆశిస్తున్నాను.

ఈ విపత్కర పరిస్థితిని ఎదుర్కోడానికీ, అంతిమంగా దురాక్రమణదారుని దేశం నుంచి తరిమివేయడానికీ అవసరమైనదంతా చేయడమే, నేటి మన ప్రథమ కర్తవ్యం. దీని తరువాతనే మిగతా అన్ని విషయాలు. అయినా ఇలా చేయడంలో మనలో ఎంత శక్తి వుందో తెలుసుకొని అందుకు సమాయత్తం కావడమే గాకుండా భవిష్యత్తు కొరకు కూడా గట్టి ప్రయత్నాలు చేయాలి. మనం అత్యవసరంగా ఎదుర్కొనవలసిన ఉపద్రవం మన ముందు వుంది. దురాక్రమణదారు కబందహస్తాల నుంచి మన దేశాన్ని విముక్తి చేయడానికి మనం సాగించే కృషి బహుశా ఎక్కువ కాలం సాగవలసిరావచ్చు. మన దేశాన్ని ఉన్నతికి తీసుకోవెళ్ళడానికి జరిపే మహాయజ్ఞంలో ఈ కృషి ఒక భాగమే.

అల్ప విషయాల నుంచి మన ఆలోచనలను మరల్చడానికీ, భవిష్యత్తులో ఘనకార్యాలకై మనల నుసమాయత్తం చేయడానికీ, ఈ కార్యసాధనలో మన శక్తి సామర్థ్యాలను పరీక్షించడానికే బహుశా విధి వశాత్తు ఈ పరిస్థితి ఏర్పడిందేమో.

యుద్ధ ప్రయత్నాలతో పాటుగా దేశ నిర్మాణాన్ని గురించి కూడా ఆలోచించాలి.

( మిగతా 73 వ పేజీలో )

# శంఖారావము

దురహంకార పరీతులై మనకు విద్రోహంబుఁ గావింపఁ జూ
నిరి చైనీయులు; దేశ మాతృఋణమున్ దీర్పంగ రండోయి! మీ
పరమాదర్శము వల్లెవేసికొను భావస్ఫూర్తితో సత్కవీం
ద్ర రసోదంచిత వాణి భావి జనతా త్యాగంబు దీర్ణంబుగన్!

ప్రళయాగ్నిప్రతి మానమై మనకు సంగ్రామంబు వాటిల్లె. ని
శ్చల దీక్ష పరిశుద్ధులై నడువుఁ డాశాపాశముల్ ద్రెంచి. శ
త్రులు మీనేలను ద్రొక్కి నిల్వగలరా! దోర్దర్పముప్పొంగి ది
క్కులు కన్నార్పక చూడఁ ద్రావుఁడు రణక్షోణిన్ సపత్నా ఒస్రముల్!

గీ॥ న్యాయహీన చైనా రాజకీయ విదులు
సామ సన్మార్గములతోడ చక్కఁబడరు;
దండనమ్మొక్కటే యింకఁ దగిన తెరువు;
వీరచందనమును దాల్చి వెడలుఁడనికి!

నాఁడెన్నఁడో కాదు నేఁడిదే కనుఁడంచు బాలచంద్రులు నేఁడు ప్రబలవలయు
నాఁడెన్నఁడో కాదు నేఁడు కన్గొనుఁడంచు తాంద్రపాపయ్యలు తరలవలయు
నాఁడెన్నఁడోకాదు నేఁడిదే కనుఁడంచు మహరాష్ట్రవీరులు మసలవలయు
నాఁడెన్నఁడోకాదు నేఁడు కన్గొనుఁడంచు రాణాప్రతాపులు రగులవలయు
నాఁటి యెందరో వీరులు మేటి మగలు
భారతావని బ్రతికియున్నారు నేఁడు!
నాఁడు నేఁడును నేఁడెయై వాడిసూప
భరత మాతను నేఁడు కాపాడవలయు!!

కలుగును జయంబు మన కు
జ్జ్వలముగ, సంశయములేదు, సరగునరండీ
పిలుపందుకొని మనోహర
ములు మీ యశములను బాడ పుణ్యాపురంధ్రుల్

—యస్. రాజన్న

# మాతృదేశ రక్షణకోసం దీక్ష



## ఇదే నేటి ముఖ్యకర్తవ్యమని మన ముఖ్యమంత్రి సందేశం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. నీలం సంజీవరెడ్డిగారు మొన్న నవంబరు 11 వ తేదీన విజయవాడ ఆకాశవాణి కేంద్రం నుండి ప్రసంగిస్తూ ఆంధ్రప్రజలకీ క్రింది సందేశం యిచ్చారు:

"ఈనాడు మనం చాలా క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొం టున్నాం. ఇప్పుడు మన సమస్య ఆత్మరక్షణ. స్వతంత్ర జాతిగా జీవించడం.

గడిచిన రెండు ప్రణాళికలలో మనం ఎన్నో నిర్మాణ కార్యక్రమాలు తలపెట్టాం. శాంతి సౌఖ్యాలతో విలసిల్లే నవ భారతాన్ని సృష్టించుకోవాలని కలలుగన్నాం. 15 సంవత్సరాలల్లో నిశ్చయంగా స్వయంసమృద్ధమయిన వ్యవస్థను నిర్మించుకునే వాళ్ళం. కాని ఆ అదృష్టం సరిగ్గా లేదు.

భస్మాసురజాతిని మనం విశ్వశించాం. ప్రపంచ సంస్థలలో వాళ్ళ హక్కుల కోసం పోరాడాం. మన సహోదరులని నమ్మి కౌగలించుకున్నాం. ఆత్మీయులనుకున్నాం. వాళ్ళింతకాలం మనతో స్నేహం నటించారు. మనల్ని మోసగించి వెన్నుపోటు పొడిచి మన మనుగడకే విఘాతం కలిగించారు. ఈ చైనా మూకల దండ యాత్రతో ఒక్కసారిగా మనం కంటున్న కలలన్నీ కరగి పోయాయి. మన అభివృద్ధికి అంతరాయం కలిగింది. అనేక శతాబ్దుల తర్వాత మొదటిసారిగా మన గడ్డపై దురాక్రమణ జరిపి మన స్వతంత్రాన్ని అపహరింప చూస్తున్న నీతి నియమాలు లేని నయవంచకుడైన శత్రువుని మనం ఎదుర్కొంటున్నాం. శత్రు బలగాలను మన పరగణాలనుంచి గెంటివేయడానికి మన ప్రియ తమ నాయకుడు ఏకైక నాయకుడు నెహ్రూ చేస్తున్న ప్రయత్నా లకు చేయూత నియ్యడానికి ఈనాడు జాతి జాతంతా ఒక వ్యక్తిగా ఒక్కకంఠంతో ఒకే దీక్షతో కంకణం కట్టుకుని సంసిద్ధ మయింది.

ఇందుకు మనం ఇప్పుడు ఏం చేయాలి? సరిహద్దుల్లో, అత్యంత క్లిష్ట పరిస్థితుల్లో నెత్తురు గడ్డకట్టే చలిలో ప్రమాదభరిత మైన కొండచరియల్లో ప్రాణాలకు తెగించి మన సైనిక సోదరులు పోరాటం సాగిస్తున్నారు. మనలో ప్రతి ఒక్కరూ వారికి అండగా నిలబడాలి. ఏ వృత్తిలో వున్నా— ఏ వర్గానికి చెందినా మన మందరం నిర్విరామ దీక్షతో ఈ మహాయజ్ఞంలో భాగస్వాములం కావాలి. ఆత్మవిశ్వాసంతో, క్రమశిక్షణతో, నిర్విరామ దీక్షతో పాల్గొనాలి. అన్ని రంగాలలో ఉత్పత్తిని అధికం చేసి తీరాలి.

ఇటువంటి పరిస్థితుల్ని స్వలాభానికి ఉపయోగించుకొనే స్వార్థపరులు కొందరుంటారు. వారిని కఠినంగా శిక్షించాలి. వారు ఎంతటి పలుకుబడి కలవారైనా సరే, ఎంతటి ధనవంతులైనాసరే- ప్రభుత్వోద్యోగులు ఏమాత్రం సంకోచం లేకుండా భయపడకుండా వారిపై చర్య తీసుకోవాలి. అట్టి ఉద్యోగులను ప్రభుత్వం బలపరుస్తుందని హామీ యిస్తున్నాను. ఈ విషయంలో ప్రభుత్వోద్యోగులు నిష్కళంకంగా ఉండాలి. అప్పుడే వారు తమ కర్తవ్యాన్ని గట్టిగా నిర్వహించగలరు.

మన విజయానికి దారితీసే మరొక విషయం- అది క్రమశిక్షణ. ఈ పరిస్థితుల్లో సాధారణంగా మనం ఉద్రేకాలకు లొంగిపోవడం జరుగుతుంది, కాని దానివల్ల ప్రయోజనం? మన శక్తిని మన ఉద్వేగాలను ఉద్రేకాలను క్రమశిక్షణతో క్రమపద్ధతిలో దేశానికి పనికి వచ్చే విధంగా ఉపయోగించుకోవాలి. ఈ జీవన్మరణ సమస్యలో మనకి విజయాన్ని సాధించేది ఒక్క మాటలో చెపుతాను. డిసిప్లిన్ క్రమశిక్షణ... అది లేకుంటా మన ప్రయత్నాలు ఫలించవు.

శుష్కమైన నినాదాలూ ఊరేగింపులూ మనకేమాత్రం ఉపకరించవు. ఇప్పుడు మన కర్తవ్యం మాతృదేశరక్షణ కోసం దీక్ష వహించడం. ఐకమత్యంతో ఆత్మవిశ్వాసంతో పనిచేయడం- ఎటువంటి త్యాగానికయినా సుసిద్ధులం కావడం. ఈ క్లిష్ట పరిస్థితుల్లో ఆంధ్రదేశం గర్వకారణంగా ప్రవర్తిస్తుందనే నమ్మకం నాకుంది. మన సర్వశక్తులూ సాధనసంపత్తీ జాతి రక్షణకు వినియోగిద్దాం. రుధిరోష్ణ ధారలతో మనల్ని రక్షించడానికి రణరంగంలో ప్రాణాలకు తెగించి ముందుకు సాగుతున్న మన వీరులకు మనం హామీ యివ్వాలి.

మా సర్వసంపదలూ, సాధనాలూ, శక్తీ మీకు అండగా ఉన్నాయి. మా సర్వస్వం మీ అధీనంలో ఉంది. మీ వెంట నడుస్తాం. మాతృదేశరక్షణకోసం ఎంతటి త్యాగాలనయినా చేస్తాం. మీతోపాటు మేము కూడా ప్రాణాలొడ్డి పోరాడుతాం- ఈ మాట మనం ముక్తకంఠంతో చెప్పాలి. తిరుగులేని నిశ్చయంతో చెప్పాలి. చైనా దురాక్రమణదారుని భస్మాసుర హస్తం అతన్నే దహించేటట్లు చేయాలి. అంతవరకూ మనకు రక్షణ లేదు. అంత వరకూ మనకు విశ్రాంతి లేదు." జైహింద్.

# మీ కృతజ్ఞతకు చిహ్నం

హిమాలయ సరిహద్దులలో అత్యున్నత శిఖరాలపై తమ విధిని తాము నిర్వహిస్తున్న సాహసికులైన మన సైనికులు ఆహార పదార్థాలు, ఇతర సౌకర్యాల కానుకలకు సహృదయంతో స్వాగతమిస్తారు.

ఈ క్రిందివాటిలో వేటినైనా పంపవచ్చు:

1. త్రాగే చాక్‌లేట్ బోర్న్-విటా, లేక ఇంకా అటువంటివి. 2. డబ్బాలలో నిల్వచేసిన కాఫీ, పాలు, 3. బాదం కాయలు, వాల్నట్లు, జీడిపప్పు. 4. బిస్కెట్లు, స్వీట్లు (వండినస్వీట్లు ఉదా: లోజాంజెస్, లెమన్, డ్రాప్స్ మొదలైనవి). 5. బ్యాటరీ రేడియోసెట్లు (ముఖ్యంగా 2 వేవ్ ట్రాన్సిస్టర్లు) 6. ఇండోర్ ఆటవస్తువులు. 7. స్పోర్ట్స్‌గేర్. 8. టాయిలెట్ వస్తువులు, 9. పిరియాడికల్స్, పత్రికలు, పుస్తకాలు.

ప్యాకెట్లలోపల వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలుపుతూ రవాణా చార్జీలను చెల్లించి ఈ క్రింది వారికి పంపవచ్చు.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్సు, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

లేక

3. శ్రీ యం. హెచ్. కె. ఘజ్నవీ, గవర్నరు సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# యుద్ధ విరమణ పన్నాగం

భారత ఉత్తర సరిహద్దు పొడవునా 1962 అక్టోబరు 20 వ తేదీన విద్రోహకరంగా దాడి జరిపిన చైనీయులు, నెలరోజుల పాటు పోరాటం సాగించిన తరువాత, నవంబరు 21 వ తేదీ అర్ధరాత్రి నుంచి తమ దళాలు యుద్ధ విరమణ చేయగలవని ప్రకటించారు. ఈ యుద్ధవిరమణ ప్రకటన చాలా దేశాలకు ఆశ్చర్యం కలిగించింది. తలవని తలంపుగా జరిగిన చైనా ప్రకటన అంతరార్థాన్ని గూర్చి అనేక వ్యాఖ్యానాలు జరిగాయి. అయితే తరువాత కొన్ని రోజులకు, శత్రుదాడిని ప్రతిఘటించడానికి భారతజాతి ఒక్కుమ్మడిగా ఉపక్రమించడం వల్లా, భారత దేశానికి రక్షణ విషయంలో పశ్చిమ రాజ్యాలు సహాయం చేయడంవల్లా, మీదు మిక్కిలి ప్రపంచాభిప్రాయం తమకు వ్యతిరేకంగా వుండటంవల్లా వారు తాము అనుకున్న ప్రకారం ముందుకు చొచ్చుకుని పోవడం అసాధ్యమనే సంగతిని గుర్తించారన్న విషయం ప్రపంచమంతటా అనేక మంది పరిశీలకులకు స్పష్టంగా తెలిసిపోయింది.

ఈ యుద్ధవిరమణ ప్రకటన ద్వారా, సైనిక దళాల ఉపసంహరణ ప్రతిపాదన ద్వారా చైనా ప్రభుత్వం భారత దేశానికి వ్యతిరేకంగా దుష్ప్రచారం సాగించింది. అమెరికాలోని భారత రాయబారి వ్యాఖ్యానించినట్లు ఈ ప్రకటన, ప్రతిపాదనలు, వారి సైనిక దాడి, శాంతి యుద్ధం వలెనే వారు వేసిన మరో ఎత్తుగడ. చైనా అభమూ, శుభమూ ఎరుగదనీ, భారతదేశమే దానిపై దురాక్రమణ జరిపినదనే తమ శుష్క వాదానికి తటస్థ దేశాలలో బలం సంపాదించుకొనడానికి వారు పన్నిన పన్నాగమే ఇది. తమ యుద్ధ విరమణ ప్రతిపాదన పెకింగ్ యొక్క శాంతికాముకత్వానికి నిదర్శనమనీ, సరిహద్దు వివాదాన్ని సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోవడంకంటే తమకు వేరే ఉద్దేశం లేదనీ చైనా ప్రచార యంత్రాంగం ఘోషిస్తున్నది. ప్రపంచాభిప్రాయాన్ని పెడత్రోవన పట్టించడానికి చైనా చేసిన ఈ విశ్వప్రయత్నం ఎంతవరకు ఫలప్రదమైందో చైనా దురాక్రమణను ఖండిస్తూనూ, ఇట్టి యుద్ధ విరమణ ప్రతిపాదనను చేయడంలో చైనా ఆంతర్యం పట్ల సంశయాంను ప్రకటిస్తూనూ విభిన్న దేశాలవారు చేస్తున్న వ్యాఖ్యానాలను బట్టి స్పష్టమవుతుంది.

తమ ప్రయత్నాలు నిష్ఫలమవుతున్నప్పటికీ యుద్ధోన్మాదులైన చైనా ప్రభువులు, భారత దేశాన్ని ఏకాకి చేయడానికీ, ఉత్తరోత్తరా జరిగే దాడులను అరికట్టడానికి తన సైనిక శక్తిని బలపరుచుకోడానికై భారతదేశం చేస్తున్న ప్రయత్నాలకు విఘ్నం కలిగించడానికీ భారతదేశంపై ఘోరమైన నిందారోపణలు చేయడానికీ, దుమ్మెత్తిపోయడానికీ సాధ్యమైన ప్రచారసాధనాలన్నింటినీ వినియోగించుకుంటున్నారు.

పెకింగ్ పదేపదే ప్రకటించిన చైనా మూడు అంశాల ప్రతిపాదనను పరిశీలించినట్లయితే నిజానికి ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో ప్రవర్తించే ఉద్దేశమే వారికి లేదనీ, దురాక్రమణ ద్వారా పొందినదాన్నంతటినీ గట్టి చేసుకోడానికి ఇదో ఎత్తుగడ అనీ తెలిసిపోతుంది. ఈ ప్రతిపాదనలపై భారత ప్రభుత్వం తొందరపాటు నిర్ణయాలేవీ గైకొనలేదు. ఓర్పు వహించి అనేక అంశాల విషయంలో దౌత్య ప్రతినిధుల ద్వారా వివరణ కోరింది. అయితే పెకింగ్ నుంచి అందిన వివరణలు మరింత తికమకగా, అయోమయంగా వున్నాయి. ఒక వ్యాఖ్యాత పేర్కొన్నట్లు ఈ వివరణలు అయోమయ స్థితిని మరింత అధ్వాన్నపరిచాయి. నవంబరు 26 వ తేదీన ఢిల్లీలో అందిన ఈ వివరణలు, చైనా తన మాటల గారడీ ద్వారా, లదక్‌లో తాము లోగడ ఎప్పుడూ ఆక్రమించుకోని 2000 చదరపు మైళ్ళకు మించిన అదనపు భూభాగంపై అధికారం వహించాలనే తమ ఉద్దేశాన్ని కప్పిపుచ్చజూస్తున్నదనే విషయాన్ని స్పష్టం చేశాయి. కాగా తూర్పు, మధ్య రంగాలలో కూడా వారు ఇటీవలి దాడులలో ఆక్రమించుకున్న అనేక గస్తీ కేంద్రాలను తమ స్వాధీనంలోనే వుంచుకోగోరుతున్నారని కూడా ఇవి తేటతెల్లం చేస్తున్నాయి. అంతేగాక భారత

( మిగతా 78 వ పేజీలో )

సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు జరప డానికి పంచాయతీరాజ్ అత్యుత్తమ సాధనం. ప్రణాళిక సంఘం నిర్ణయించిన ప్రకారం గ్రామీణ ప్రజల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులను మెరుగు పరచడమే ఈ సమాజాభి వృద్ధి కార్యక్రమ ప్రధానాశయం. మన దేశంలో నూటికి 85 మంది గ్రామీణ ప్రాంతాల్లోనే వున్నారు. కనుక ఆ గ్రామాలను అభివృద్ధి చేయకపోతే దేశంయొక్క శాశ్వతాభివృద్ధి లేదు. గ్రామాలలో వ్యవసాయం ప్రధాన జీవనం. అందువల్ల జాతీయ ప్రణాళికలో వ్యవసాయోత్పత్తికి అధిక ప్రాముఖ్యత ఇవ్వడం సమంజసమే. అంతేగాక తృతీయ ప్రణాళికాకాలంలో వ్యవసా యోత్పత్తులను 50 శాతం అధికం చేయడానికి నిర్ణయించారు. రాష్ట్రంలోని నాలుగు బ్లాకులలో 1952 నుంచి సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని ప్రవేశపెట్టినప్పటినుంచి—అంటే గత దశాబ్దం నుంచీ - భౌతికవిజయాల విషయంలో చెప్పుకోదగ్గ అభివృద్ధి జరిగింది.




“చదువుల”

ఇప్పుడీ కార్యక్రమం రాష్ట్రమంతటా అమలులో వుంది. భౌతికవిజయాల విషయంలో ప్రశంసనీయమైన అభివృద్ధి జరిగింది. ముఖ్యంగా వ్యవసాయోత్పత్తి విషయంలో విస్తృత పథకం ఫలితంగా దాదాపు రాష్ట్రం అంతటా జపాన్ వరిసాగు పద్ధతి వంటి మేలురకం సాగు పద్ధతులు భూసార రక్షణ, మేలు రకం విత్తనాలు, మేలురకం పనిముట్ల వినియోగం విస్తృతంగా అమలులోకి వచ్చాయి. తత్ఫలితంగా అన్ని రకాల పంటలలో ఎకరానికి పండేమొత్తం చెప్పుకోదగినంతగా పెరిగింది. అదే విధంగా గ్రామీణ ఆరోగ్య, పారిశుద్ధ్య కార్యక్రమం క్రింద టీకాలు ఇంజక్షన్లు వేయడం వంటి నిరోధక చర్యలు, మంచి నీటి సరఫరాలకు ప్రత్యేక ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. ప్రథమ, ద్వితీయ ప్రణాళికల కాలంలో వివిధ పథకాల క్రింద 15 వేల క్రొత్త మంచినీటి బావులు నిర్మించబడ్డాయి. పాఠశాలలలో పిల్ల లకు అంటువ్యాధులు సోకకుండా రక్షణ చర్యలు తీసుకున్నారు. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానం ప్రవేశపెట్టాక విద్యాకార్య క్రమం కూడా ఎంతో మెరుగైంది. పిల్లలను పాఠశాలలలోకి చేర్చుకునే సంఖ్య నూటికి 15 శాతం అధికమైంది. పాఠశాలలకు పిల్లల హాజరు, పాఠశాలల నిర్వహణ కూడా ఎంతో అభివృద్ధి జరిగింది.

పంచాయతీ రాజ్ ప్రవేశపెట్టిన తరువాత సమాజాభివృద్ధి కార్యక్రమం అమలుకు బ్లాకు స్థాయిలో పంచాయతీలదే బాధ్యత. బ్లాకు ఉద్యోగులు, రైతులు పంచాయతీ సమితుల క్రింద వుంటారు. పంచాయతీరాజ్ విధానం ఒక విశిష్ట పరిపాలనా సంస్కరణ. తత్ఫలితంగా ఆ కార్యక్రమ పరిపాలనా యంత్రాం గంలో ఒక పెద్ద మార్పు వచ్చింది. సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద ఫలితాలు ఇదివరకువలె అంత బాగాలేవు. దీనికితోడు రాష్ట్రం అంతటా ఆయా ఋతువులలో పరిస్థితులు విభిన్నంగా వుంటాయి.

ఏది ఏమైనా స్వయం సహాయక కార్యక్రమం క్రింద వ్యవసాయోత్పత్తులు, ఆరోగ్యం, విద్యా విషయాలలో పంచాయతీ సమితులు సత్ఫలితాలను పొంద గలవు. ముఖ్యంగా వ్యవసాయ పథకాల క్రింద పంటలకు పట్టే పురుగు నిరోధానికి విమానం నుంచి మందుచల్లే కార్యక్రమాన్ని గుంటూరు, కృష్ణా జిల్లాలలో నిర్వహించబడుతున్నది. అదే విధంగా అన్ని పంచాయతీలు, పంచాయతీ సమితులు మొక్కల రక్షణ సామగ్రిని కొని వాటిని వ్యవసాయదారులకు అద్దెకు ఇస్తున్నాయి. వ్యవసాయోత్పత్తి విషయంలో క్రమబద్ధమైన అభివృద్ధిని సాధించడానికై దాదాపు అన్ని పంచాయతీలు వ్యవసాయోత్పత్తి ప్రణాళికలను సిద్ధం చేశాయి. పంచాయతీ సమితులు తృతీయ ప్రణాళికకు బ్లాకు ప్రణా ళికలను, ప్రణాళికలో ప్రతి సంవత్సరం ప్రణాళికలను కూడా రూపొందించాయి. ఆ విధంగా ప్రజా సంస్థలు తమ బాధ్యతల పట్ల ఆత్మవిశ్వాసంతో వుండడమేగాక వీలైనంత త్వరలో వీలై నన్ని ఎక్కువ ఫలితాలను సాధించడానికి కంకణం కట్టుకున్నాయి.

భారత ప్రభుత్వ సమాజాభివృద్ధి, సహకార మంత్రిత్వ శాఖ జారీచేసిన 1961-62 వ సంవత్సరం సమాజాభివృద్ధి కార్య

క్రమాల వార్షికనివేదికలో పెక్కు ముఖ్యపథకాలలో ఆంధ్ర ప్రదేశ్ ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకుంది.

ఈ కార్యక్రమం ప్రస్తుత విధానాన్ని 1961 లో జరిగిన డెవలప్‌మెంట్ కమిషనర్ల సమావేశం సిఫార్సులను దృష్టిలో వుంచుకొని నవరించడం జరిగింది. ఆ మొత్తంలో 54 విభాగాలను నిర్ణయించారు. ప్రతి రాష్ట్రంలోని బ్లాకులో కార్యకలాపాలని ప్రయోజనాత్మకంగానూ, వాస్తవికంగానూ వుండేట్లు పరిశీలించడం అవసరం.

ప్రతి కార్యకలాపం క్రింద పరిశీలించిన విభాగాల సంఖ్య ఈ దిగువ తెలుపబడింది.

| కార్యరంగం | సూచికలు (ప్రధాన) | తత్సంబంధమైన సూచికలు |
|---|---|---|
| 1. వ్యవసాయం | 11 | 14 |
| 2. భూమి అభివృద్ధి | 3 | 4 |
| 3. పశుపోషణ | 6 | 6 |
| 4. సహకారం | 4 | 6 |
| 5. గ్రామీణ పరిశ్రమలు | 5 | 6 |
| 6. విద్య, సాంఘికవిద్య | 11 | 14 |
| 1. ఇతర సౌకర్యాలు | 4 | 4 |
| | 44 | 54 |

ప్రతి ముఖ్యమైన పనిక్రింద రెండు సూచికలను చేర్చారు. సమీక్షకు నిర్ణయించిన వాటిలో 54 కీలకసూచికలున్నాయి. ప్రస్తుత సంవత్సరం, ఇదివరకు సంవత్సరాలలో ఈ రాష్ట్రంలో సగటు పనిని, అఖిలభారత బ్లాకుల సగటును ప్రస్తుత సంవత్సరంలో 54 విభాగాలుగా లెక్కగట్టారు. ఈ రాష్ట్రంలో అభివృద్ధిని ఇతర రాష్ట్రాలతో పోల్చి చూచినపుడు అది చాలా తృప్తికరంగా వుంది. 54 సూచికలలో 24 విభాగాలలో మన రాష్ట్రం ఉన్నత ప్రమాణాలను పొందింది.

| | |
|---|---|
| 2 విభాగాలక్రింద | మొదటి శ్రేణి |
| 4 విభాగాలక్రింద | రెండవ శ్రేణి |
| 9 విభాగాలక్రింద | మూడవ శ్రేణి |
| 3 విభాగాలక్రింద | నాలుగవ శ్రేణి |
| 7 విభాగాలక్రింద | ఐదవ శ్రేణి |

మొత్తం విభాగాలు; 25

అదేవిధంగా బ్లాకుకు ఈ రాష్ట్రం సాధించిన ప్రగతి 20 విభాగాలలో ప్రస్తుత సంవత్సరంలో అఖిలభారత బ్లాకు స్థాయికన్నా ఎక్కువగా వుంది. భూమి అభివృద్ధితోసహా వ్యవసాయ కార్యక్రమాల విషయంలో సమీక్షకు నిర్దేశించిన 18 కీలక సూచికలలో పదింటిలో ఈ రాష్ట్రం ఉన్నత శ్రేణిని పొందింది. అఖిలభారత స్థాయితో పోల్చి చూస్తే మనరాష్ట్రం ఈ క్రింది లక్ష్యాల సాధనలో వెనుకబడి వున్నట్లు తెలుస్తుంది.

1) మేలురకం సామగ్రి పంపిణీ
2) నిర్మించిన కంపోస్టు గోతులు
3) సాగుక్రిందకు తెచ్చిన అదనపు భూమి
4) కృత్రిమంగా గర్భోత్పత్తి చేయబడిన జంతువులు
5) భూమికట్టలు
6) సహకార సంఘాలు
7) పాఠశాలలలో చేరిన బాలబాలికలు
8) ప్రారంభించిన వయోజన విద్యా కేంద్రాలు
9) నిర్వహించబడిన గ్రామసహాయకుల శిక్షణశిబిరాలు, శిక్షణ పొందిన వారి సంఖ్య
10) పనిచేస్తున్న బాలవాడీలు, వాటి సభ్యత్వం.

అయితే పైనిచ్చిన లక్ష్యాల విషయంలో కూడా ఇతోధికాభివృద్ధిని సాధించడానికి కృషి జరుగుతున్నది.



భానుదత్తుని

# రసమంజరి-తెలుగునాటి సంస్కృత వ్యాఖ్యలు

మిథిలాదేశము (బీహారు) శాస్త్రావతారము లనదగు మహా విద్వాంసులకు, సంస్కృత కవిశేఖరులకు పుట్టినిల్లు. క్రీ. శ. 16వ శతాబ్దమున మిథిలాదేశమున ఖ్యాతినందిన సంస్కృతకవి తల్లజులలో గణపతిమిశ్రు డొకడు. ఈయన కవితార్కిక చూడామణియై కీర్తి నందెను. ఈయన తనయుడు తన కవితాలతను వివిధ రాజాస్థానములందు ప్రాకించిన భానుదత్తుడు (=భానుకరుడు) భానుకరుని కవితాలతకు దోహదమొనరించిన మహారాజులు నలుగురు:

(1) విజయనగర సామ్రాజ్యాధీశ్వరుడు, విద్వాంసుడు, కవిశేఖరుడు, కవిపండితబాంధవుడు నగు కృష్ణదేవరాయలు.

(2) రీవారాజ్యాధినేతయగు వఘేల వీరభానునృపతి.

(3–4) మహమ్మదీయ ప్రభువులగు మొదటి నైజాంషా (Boorhan Nizam Shah I), షేర్‌షా (Sher Shah)

### భానుకరుని రచనలు

1. అలంకార తిలకము (ముద్రితము): Ed. by Dr. G. V. Devasthali: Journal of the Bombay Royal Asiatic Society– (New Series) Vols. 23–25 (1947–49)
2. కావ్యదీపిక: (ముద్రిత) New Imperial Press, Lahore (1885)
3. కుమార భార్గవీయచంపువు: (అముద్రిత). Ms. 1540. India Office Library, London.
4. గీతగౌరీపతి (=గీ గౌరీశము): [ముద్రిత]– Published in the **Grantharatnamala,** Vol, I & II. pp 1–92. Bombay. (1887; 1888)
5. చిత్రచంద్రిక (అలభ్యము, అలంకార తిలకమున నుదాహృతము)
6. (పారిజాతము: తిథివిచారకమగు ధర్మశాస్త్రగ్రంథము.— అముద్రితము. దీనికర్తృత్వ మింకను సందేహాస్పదము)
7. రసతరంగిణి (ముద్రిత): Visvasara Press, Calcutta (1838)
   గంగారమ జడికృత 'నౌకా' వ్యాఖ్య. (Kasi Samskrta Press, Benares. (1886)
8. రసపారిజాతము. (ముద్రితము) – (Lahore; 1939)
9. రసమంజరి: (ముద్రిత) (Benares; 1904; 1930)
10. శృంగార దీపిక: (అముద్రిత). Oudh Catalogue. III. 12

భానుదత్తుని పైరచనలలో పఠనపాఠన వ్యవహారము వలన విశేషవ్యాప్తి నందినవి రెండు గ్రంథములు: రసమంజరి, రసతరంగిణి. అందువల్లనే యీ రెండిటికిని చాల వ్యాఖ్యలు బయలుదేరినవి. రసమంజరిపై 14 వ్యాఖ్యలును, రసతరంగిణికి 10 వ్యాఖ్యలును కలవు. సాహిత్యశాస్త్ర ప్రపంచమున బహుళ వ్యాఖ్యా గౌరవమునందిన గ్రంథములలో మమ్మటుని కావ్యప్రకాశము ప్రప్రథమము. దీనికి 71 వ్యాఖ్యలు కలవు. 22 వ్యాఖ్యలు గల దండికావ్యదర్శము ద్వితీయ స్థానమునందును. తృతీయ స్థానము రసమంజరిది. రసమంజరికనేకాంధ్ర పరివర్తనములు, ఆంధ్రవ్యాఖ్యయు కలవు. బహుశః కృష్ణదేవరాయల ప్రోత్సాహమున భానుదత్తుడు రసమంజరిని నిర్మించియుండు నని తోచును. కృష్ణదేవరాయలు కూడ సంస్కృతమున రసమంజరి యను 'మధురకావ్యము'ను రచించెనేమో. ౧. రసమంజరిపై సంస్కృత వ్యాఖ్యలు:—

1. ఆమోదము (గుడిజాల రంగశాయి) అముద్రితము.
2. పరిమళము (శేష చింతామణి; అము.)

రచన:

ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు

3. ప్రకాశము (నాగేశభట్ట, ముద్రిత 1904)
4. భానుభావ ప్రకాశిని (మహాదేవ; అము.)
5. రసికరంజనము (వ్రజరాజదీక్షిత; అము.)
6. రసికరంజని (గోపాలభట్ట; అము.)
7. వికాసము లేక విలాసము (గోపాలాచార్య; అము.)
8. వ్యంగ్యార్థకౌముది (అనంతపండిత; ముద్రిత 1904)
9. వ్యంగ్యార్థకౌముది (=సమంజసార్థ)
(విశ్వేశ్వరపార్వతీయ: అము.)
10. వ్యాఖ్యా (అజ్ఞాత కర్తృక; అము.)
11. వ్యాఖ్య రమానాథవైద్య; అము.)
12. (అ) సమంజసార్థ= వ్యంగ్యార్థకౌముది (చూ. 9.)
(విశ్వేశ్వర పార్వతీయ; అము.)
12. (ఆ) సుధ (దత్తాత్రేయ; అము.)
13. సురభి (బదరీనాథశర్మ; ముద్రిత. 1930)
14. స్థూలతాత్పర్యార్థ (అజ్ఞాతకర్తృక. అము.)

ఇ. ఆంధ్రటీక: 15. వేదము వేంకటరాయశాస్త్రి (ముద్రిత.1909)

రసమంజరిపైఁగల వ్యాఖ్యలు పదునాఱింటిలో తెనుఁగు నాటి సంస్కృత విద్వాంసులు రచించిన వీక్రింది మూఁడును:

1. శేషచింతామణి: 'రసమంజరీ పరిమళము'
2. చిలకమర్తి (గురజాల)
రంగశాయికవి: 'ఆమోదము'
3. ప్రతివాదిభయంకరం
తిరువేంగళాచార్యులు: 'తాత్పర్యమంజరి'

పై వ్యాఖ్యలు మూఁడును ఇంకను సూర్యాలోక భాగ్యమునకు నోచుకొనక, అసూర్యంపశ్యలవలె తాళీదళ సంపుటములందు కొనయూపిరితో నెట్లో తల దాచుకొని యున్నవి. ఈ వ్యాఖ్యాత్రయమును గూర్చి తెలియవచ్చిన యంశములిట నివేదింపబడును.

## శేషచింతామణికవి: 'రసమంజరీ పరిమళము'

రెండున్నఱ శతాబ్దముల క్రిందట సంస్కృత కవితా వైదుష్యములకు ఖ్యాతి నందిన ఆంధ్ర దేశీయ విద్వత్కుటుంబములలో శేషమువారి వంశమొకటి. గోదావరీ తీరమునకుఁ జెందిన యీ వంశమువారిలో నొకకుటుంబము దక్షిణదేశమునకు, ఇంకొకటి మహారాష్ట్ర దేశమునకు, మఱియొకటి కాశీనగరమునకు వలసవెళ్లినట్లు తెలియుచున్నది. దక్షిణమున మధురానగరాధీశ్వరుఁడగు విజయరంగచొక్క భూపాలుని స్థానమున స్థిరపడిన శేషము వేంకటపతి ఒక్కఁడు మాత్రము ఆంధ్రమున మనోహర కవితానిర్మాణదక్షుఁడై 'తారాశశాంకవిజయ' మను ప్రసిద్ధ ప్రబంధమును రచించెను. తక్కిన కుటుంబములలోని వారెందఱో వివిధశాస్త్రవైదుషీభూషితులు, సంస్కృత కావ్య నిర్మాణ ప్రవీణులై వాసి కెక్కిరి.

ఇట్లు వివిధప్రాంతములకు వలసవెళ్లిన వారిలో శేశనరసింహ పండితుఁడొకఁడు (క్రీ. శ. 1700–50 ప్రాంతము) ఈయన కాశీసమీపమునఁ గల తాండవపురమున కధీశ్వరుఁడగు గోవిందచంద్రుని సమాదరణమున గోవిందార్ణవమను ధర్మశాస్త్రగ్రంథమును రచించెను. సకలశాస్త్ర పారంగతుఁడగునీయన వ్యాకరణశాస్త్రమును ప్రత్యేకాభిమానముతో వ్యాసంగ మొనర్చి, కాశీ నైయాకరణులకు కులపతిగా వన్నెకెక్కెను. ఈ గురుకులమునకు చెందినవారే భట్టోజీ–నాగోజీ పండితులు. నరసింహపండితునకు కృష్ణపండితుఁడు, చిన్తామణియను నిరువురు కుమారులు కలరు. కృష్ణపండితుఁడు గోవర్ధనధారియను ప్రభువున కాశ్రితుఁడు. ఈ ప్రభువు, అగ్బరు చక్రవర్తి కార్థికమంత్రియు, గిరిధారినాథుని శిష్యుఁడు అగు రాజాతోడరమల్లుని తనయుఁడు. గిరిధారినాథుడు వల్లభాచార్యుల మనుమడు. వల్లభాచార్యులు గోకులస్థగోస్వామి సంప్రదాయమునకు మూలపురుషుఁడు.

భట్టోజీ దీక్షితులకు వ్యాకరణ శాస్త్ర గురువగు పైశేష కృష్ణపండితుఁడు బహు గ్రంథకర్త. ఈయన రచనలు (అ) నాటకములు:

(1) కంసవధ. (2) ముక్తాచరితము. (3) మురారి విజయము. (4) సత్యభామా పరిణయము.

(ఆ) చంపువులు:

(5) ఉషాపరిణయము. (6) పారిజాతాపహరణము. (7) సత్యభామ విలాసము.

(ఇ) శాస్త్రగ్రంథములు:

(8) ప్రక్రియాప్రకాశము (వ్యాకరణము) (9) శూద్రాచార శిరోమణి (ధర్మశాస్త్రము) శేష చింతామణి. కృతులు: (అ) నాటకము: రుక్మిణీహరణము. (ఆ) ఛందః ప్రకాశము.

(ఇ) వ్యాఖ్యలు: (1) మేఘదూతవ్యాఖ్య. (2) రసమంజరీ పరిమళము (3) సుధ (=వృత్తరత్నాకరవ్యాఖ్య) ఈ వంశమునకు చెందినవారే శేష గోవిందపండితుఁడు, కమలాకర రత్నాకర పండితులు, రామచంద్ర పండితుడును.

గోవిందపండితుని రచనములు: (1) అమర శతకవ్యాఖ్య. (2) గోపాలలీలార్ణవభాణము (3) వినతానందవ్యాయోగము

కమలాకర–రత్నాకర పండితుల కృతి: గీతగోవిందవ్యాఖ్య

శేషరామచంద్ర పండితుని గ్రంథము: భావద్యోతనిక (లేక సర్వానవద్యకరణి) అను నైషధీయ చరిత వ్యాఖ్య

పై రామచంద్రపండితుడు శేష వీరేశ్వరుని తమ్ముడగు నారాయణ పండితుని శిష్యుడు. ఈ క్రింది పరిమళ వ్యాఖ్యావతారికా శ్లోకములు, ఉపసంహార శ్లోకములు, గద్యములవలన శేష చింతామణి వృత్తాంతము కొంత తెలియుచున్నది:

## పరిమళ వ్యాఖ్యావతారికా శ్లోకములు:

1. 'ప్రేమార్ద్రారనిరీక్షణా దనుదినం యచ్చుంబనాలింగనాద్
యో దంతక్షతసీత్కృతా న్నఖపదోల్లేఖా ద్వియోగా చ్ఛయః
యూనోః కోऽపి పరస్పరాగతసఖీసంభాషణా జ్జాయతే
శృంగారః స విభూతయే భవతు మే
లక్ష్మీనృసింహాఖ్యయోః' (1)

(Descrptive cata of Skt. Mss-Vol. V. P. 570-Adyar)

2. "అజ్ఞాన హిరణ్యకశిపో ర్దలనే సాక్షాన్నృసింహ ఏవ పరః
త మహం శేష ముపాసే
పితరం శ్రీమన్నృసింహాఖ్యమ్" (4)

3. "అతి విషమరసమంజర్యా
వ్యాఖ్యా మేతాం పరోపకారాయ,
తనుతే నృసింహతనయః
శ్రీమాన్ చింతామణిః శేషః" (5)

4. "యద్యపి దుర్జనతోషా
యైషా న స్యా న్మయా కృతా టీకా,
తర్హ్యపి మన్మతి శుద్ధిం
సజ్జనపాదార్పితా కరిష్యతి హి ?" (6)

## ఉపసంహార పద్యములు ★

5. "య న్మయా జల్పితం బాల్యాద్ వ్యక్త మవ్యక్త మేవ వా.
కృపయైత దనుగ్రాహ్యం, సాధుభి ర్దీనవత్సలైః" (1)

6. "శేషావతంస శ్రీశేష–నృసింహతనయః సుధీః,
యూనాం మనోవినోదాయ మంజరీ–వ్యాకృతిం వి
( ) ధాత్" (2)

## పుష్పిక

"ఇతి శ్రీ శ్రీసకలపండిత ఘటాగ్రణీయ శ్రీమచ్ఛేషవంశాలంకార భూత–
విద్వజ్జనవృంద చూడామణి మరీచిపింజరిత చరణయుగళ–కవి శేషావతార–శ్రీ మచ్ఛేషనృసింహతనయేన శ్రీ నృసింహ చరణోపాసినా, బ్రహ్మపురవాసినా, శ్రీ శేషచింతామణినా, నిర్మితో రసమంజరీ పరిమళః సమాప్తః" +

## చిలకమర్రి రంగశాయికవి

రంగశాయి సమస్త దాక్షిణాత్య మైథిలకవితాశ్లాఘాలంఘన జంఘాల–దృశ్యశ్రవ్యోభయ ప్రబంధ నిర్మాణ–మార్మికుఁడే కాక వాగ్గేయకార చక్రవర్తి కూడ నని వ్యాఖ్యాంత పుష్పికలను బట్టి తెలియుచున్నది. కాని, రసమంజరిపై యీయన రచించిన "ఆమోద" మనువ్యాఖ్యయు, ఈ వ్యాఖ్యయందు రెండు సారు ఉల్లేఖింపఁబడిన "శృంగారలహరి" యను గ్రంథమును మాత్రమే తద్రచనలలో మనకుఁ దెలియవచ్చినవి; కాని యీతఁడు సూచించిన యాదృశ్యశ్రవ్యోభయ ప్రబంధముల నామములు గాని, జాడ గాని మన కేమియు తెలియుటలేదు. క్షేత్రయ్య (=క్షేత్రజ్ఞ) వలె రంగశాయియు, తెలుఁగుననో, సంస్కృతముననో లేక రెండు భాషలయందుననో సిద్ధహస్తుఁడగు పదకారుఁడని యూహింపఁదగును. క్షేత్రయ్య (క్రీ. శ. 1620–72 ప్రమారము) రంగశాయియు ఇంచుమించుగా సమకాలికులే. రసమంజరిపై సంస్కృత వ్యాఖ్యానములు నిర్మించిన తెలుఁగునాటి పండితులు ముగ్గురును విజ్ఞకర్తలే.

రంగశాయికవి గురిజాల గ్రామవాస్తవ్యుఁడు (పల్నాడు తాలూకా గుంటూరు జిల్లా ఆంధ్రదేశము.) అందువలననే యితనికి గురిజాల రంగశాయి, గురిజాలశాయి అనునామాంతరములు ప్రవ

---

* D. C. Skt. Mss at the Govt. Oriental Mss. Library, Madras.
D. C. of Skt. Mss. Vol. V. pp. 570–71 (Adyar)— 1951

హారములోనికి వచ్చినవి. "శ్రీ మద్వాధూల మహాదేశిక—చరణ సరసిజోపాసనావాసనా సమధిగత సకల శాస్త్రసముదయేన"

అను వ్యాఖ్యాంతగద్యమును బట్టి రంగశాయి వాధూల మహాదేశికాంతేవాసి యనియు, తచ్చరణోపాంతమున సమస్త శాస్త్రములందును కాలంకషవ్యాసంగ మొనర్చిన మహా విద్వాంసుఁడనియుఁ దెలియుచున్నది. పైవాధూలమహాదేశికులు మహాచార్య— దొడ్డయాచార్యనామములఁ బ్రఖ్యాతి వహించిన శ్రీ వైష్ణవాచార్యులు (క్రీ. 16వ శతాబ్ది.) ఈయన ఘటికాచలవాసి ( ) ఈయన రచనలు:

(1) అద్వైత విద్యా విజయము, (2) పారాశర్యవిజయము (3) వేదాంత దేశిక వైభవ ప్రకాశిక, (4) అన్నిటి కంటెను విఖ్యాతమైనది—వేదాంత దేశికుల "శతదూషణి"పై 'చండమారుత' మను వ్యాఖ్యారత్నము.

రంగశాయి కవి పితామహుఁడు వేంకటాచార్యులు. ఈయన రచించిన "నాడీవివేక" మనువైద్య గ్రంథమును రంగశాయి కవియే రసమంజరీ వ్యాఖ్యయందుదహరించుకొనెను. వేంకటాచార్యులకు కుమారులు నలుగురు:

(1) అనంతాచార్యులు, (2) వరదాచార్యులు, (3) రంగాచార్యులు, (4) ధర్మాచార్యులు (లేక ధర్మసూరి)

పై ధర్మాచార్యుల కుమారుఁడే మనరంగశాయికవి. ఆమోదమునందలి అవతారికా పద్యములయందు వ్యాఖ్యాత వృత్తాంతము కొంత తెలియుచున్నది.

## గురువందనము

1. "మహతే మహితాత్మీయ పదప్రణతిశాలినామ్,
అనల్పసంకల్ప కల్పతరవే గురవే నమః"

## ఇష్టదేవతా నమస్కారము

2. "శ్రియ మాతనో త్వఘ విరోధిరాధికా—
యదునన్దనాచరితమన్మథోత్సవః.
రసమంజరీ చరమిలిన్ద బృన్దదృగ్
యమునాతపో (టోప) వన [ని] కుఞ్జసాక్షికః"

## వంశ వృత్తాంతము

3. "ఆసీద్యశ్శిల్క-మర్త్యన్వయజలధి శశీ
వేంకటాచార్యవర్యః,
స్వభ్యస్తామ్నాయ శాస్త్రాదిక సకలకలః
సోఽయ మాత్మోపమానాన్.
లేభే పుత్రాన్ నన న్త—ప్రథమణివరదా—
చార్యరంగార్య- ధర్మా
చార్యాఖ్యాన్, ధర్మసూరే రజని
కవిబుధశ్లాఘితో రంగశాయీ"

పై శ్లోకమును బట్టి రంగశాయిపితామహుఁ డగు వేంకటాచార్యులు అధీతామ్నాయశాస్త్రసకలకళుఁడనియు, తన పాండిత్యముతో తుల్యమగు పాండిత్యమును సంపాదించిన పుత్రచతుష్టయమును పడసిన భాగ్యశాలి యనియు తెలియుచున్నది.

## రంగశాయి—సర్వదర్శన శాస్త్రవైదుష్యము

4. "వ్యాకర్తుం వ్యాసశాస్త్రం, కణచరణమతం
పోషితుం, పాణినీయఁ,
సంస్కర్తుం, భాట్టతన్త్రం వివరితు మఖిలం,
యోగసర్వస్వ మాప్తుమ్,
సంఖ్యాతుం సాంఖ్యశాస్త్రం, రచయితు మమలం
కావ్య మవ్యాహతార్థం,
భర్తుం సాహిత్యసీమాం, ప్రభవతి నితరాం
శాయి—వాగ్గేయకారః"

పై పద్యమున సాంఖ్య—యోగములు, మీమాంసా వేదాంతములు (=పూర్వోత్తరమీమాంసాదర్శనములు) వైశేషిక వ్యాకరణములు, కావ్య సాహిత్యములయందును తాను నిష్ణాతుఁడ నని కవి చెప్పుకొనెను. న్యాయ దర్శనమును మాత్రము పేర్కొనలేదు. కాని వైశేషికము న్యాయశాస్త్రమును గూడ సూచించు ననదగును. మఱియుఁదాను వాగ్గేయకారుఁడననియు వక్కాణించి యున్నాడు.

## స్వకీయ కవితా వైభవ ప్రశంస

5. "ఉరస్థ్సకమలాకుచాంచిత (మృగీ) మదామోదిత
ప్రఫుల్లవనమాలికా పరిమలా యదీయోక్తయః,
జయన్తి మురభిన్ముఖశ్వసన చాతురీపూరిత
స్ఫురన్మురలికాకలస్వనవితానలీలాభృతః"

6. 'సోఽయం సహృదయహృదయ
భ్రమరకదంబానురంజనస్య కృతే,
సుమహితరసమంజర్యా
వితనోత్యామోద ముక్తపాకేన '

7. "మంజరీ భావనీయేయం శ్రీ గురీజాలశాయనః,
సూక్తిభి ర్జనితా ... కవిషట్పదైః"

8. "గురిజాలశాయిపండిత
విరచితరసమంజరీ శ్రితామోదమ్,
అవధారయత చ సతతం
మురహరనామా ద్విరేఫరాట్ కశ్చిత్"

—(D. C. Mss. –Vol. 22, P. 8685. –Ms. No. 12941 Govt. O. Mss. Library–Madras. –1918 A. D.)

9. 'గురుజాలపాదసరసీజ పూజనాత్,
గురుజాల భూతకవితామనోహరః
గురుజాలకాకృతియశః ప్రకాశితో
గురుజాలశాయికవి రేష రాజతే"

పై పద్యమున ఆంధ్రకవితా సాధారణ మగుప్రాసను గుర్తింపఁదగును.

10. "ఆమోదో రసమంజరీ గతలసత్-
స్వారస్య సన్సూచకః,
విద్వత్భృఙ్గ మనోవికాస కరణాద్
విద్యోతమానో భృశమ్,
స్వీయాన్యాపుర కామినీ ప్రముఖసత్-
కాన్తా స్వభావాదికా,
దర్థోదాహరణోల్లసత్ పరిమళ-
చ్ఛేదో ముదాపాదితః. +

ప్రకరణాంతమున వ్యాఖ్యాత పుష్పికలు

11. "ఇతి శ్రీ గురిజాలశాయి పండిత విరచితాయాం, రసమంజరీ-
వ్యాఖ్యాయామ్, ఆమోద సమాఖ్యాయాం,
స్వీయాది నాయికా విభాగ నిరూపణం నామ ప్రథమం
ప్రకరణమ్". ★

ద్వితీయ ప్రకరణాంత గద్యము :—

'ఇతి...ఆమోద సమాఖ్యాయాం. ప్రోషితభర్తృకాది-నాయికా విశేష నిరూపణం నామ ద్వితీయ ప్రకరణమ్'★

13. తృతీయ ప్రకరణాంత గద్యము :—

'ఇతి శ్రీమద్వాధూల మహాదేశిక-చరణసరసిజో పాసనా సమధిగత సకలశాస్త్ర హృదయేన, శ్రీ చిఱుకమర్రికుల-కలశజలధి కౌస్తుభ-ధర్మాచార్య తనయేన తదగ్రజాపన్నాదార్య వాత్సల్యవర్ధిత సమస్త దాక్షిణాత్య మైథిల కవితా శ్లాఘాలంఘన-జంఘాల-దృశ్య శ్రవ్యోభయవిధ ప్రబంధ నిర్మాణ మార్మికేణ. వాగ్గేయకార చక్రవర్తినా, శ్రీ మద్గురిజాలశాయిపండిత (తేన) విరచితాయామ్ ఆమోద సమాఖ్యాయాం. రసమంజరీ వ్యాఖ్యాయాం, సఖ్యాది నిరూపణం నామ తృతీయం ప్రకరణమ్" ★★★

రంగశాయి "ఆమోద" వ్యాఖ్య కింకను సూర్యాలోక భాగ్యము కలుగ లేదు. ఈ వ్యాఖ్యయందు పేర్కొనఁబడినట్టియు, ఉదాహరింపఁబడినట్టియు గ్రంథ-గ్రంథకర్తల సంఖ్య విపులముగా నున్నది. అందు రంగశాయి కాల నిర్ణయమునకు తోడ్పడు మూఁడు గ్రంథములను, తత్కర్తలను మాత్రము ఇట పేర్కొనఁదగును :

1. అప్పయ దీక్షితులు: కువల యానందము.
2. భట్టోజీ దీక్షితులు: ప్రౌఢ మనోరమ[3].
3. శేష చింతామణి: ప రి మ ళ ము (=రసమంజరిపై వ్యాఖ్య).

1. అప్పయ దీక్షితులు, కువలయానందమును వేంకటపతిరాయల (క్రీ. 1584-1614) ప్రోత్సాహమున రచించెను.
2. మనోరమ (=ప్రౌఢ మనోరమ) భట్టోజీ దీక్షితులు రచించిన వ్యాకరణ గ్రంథము. భట్టోజీ కాశీ నివాసి యగు శేషకృష్ణ పండితునకును, దాక్షిణాత్య పండితాగ్రణియగు అప్పయ దీక్షితులకును శిష్యుఁడగుటచే క్రీ. శ. 16 వ శకమున మొదటి పాదమునకుఁ జెంది యుండును. (1500-1525 క్రీ.)

+ పై పద్యములలో 9, 10 రెండును మద్రాసు-అడయార్-ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందలి "ఆమోద" వ్యాఖ్య వ్రాఁతప్రతియందలివి.

**Descriptive Catalogue of Sanskrit Manuscripts** in the Adyar Library–Vol. V. page 569 (1951)

★ Vol. II–Part I–Sanskrit: A–Ref. No. 802, P. 1079 of the **Triennial Catalogue of Manuscripts**, at the Govt. Oriantal Mss. Library-Madras. (1917)

★★ R. No. 802.-**Tr. C. Mss**. Vol. II-Part 1 P. 1079. (1917)

★★★ Ms. No. 1811.-**D. C. of Sanskrit Mss**-Vol. V. P. 569. (Adyar Library-Madras)-1951

3. పరిమళము—(శేష చింతామణి కృత మగు రసమంజరీ వ్యాఖ్య) పై వ్యాఖ్యను రంగశాయి కవి ఆమోదమున తీవ్రముగా విమర్శించి యున్నాడు. మచ్చునకు రంగశాయి తీవ్ర వాగ్బాణములు కొన్ని యిట చూపఁబడును : +

(1) "అనాఘ్రాతవ్యుత్పత్తిగంధస్యాపి శ్రోత్రియ వేతాలస్య కథ మతి విదగ్ధజనైకసాధ్వీ రసమంజరీ వ్యాఖ్యానే ప్రవృత్తి రితి విస్మయామహే" (8 పు.)

(2) "పరిమలకారస్య దుర్లేఖనమ్" (86 పు.)

(3) "పరిమలకారః...బభ్రామ" (298, 318, 337 పుటలు)

(4) "పరిమలకారస్య లేఖనం ప్రచుర ప్రయోగాదర్శన దోష విజృమ్భితమ్"

(412 పు. అడయార్ గ్రంథాలయము నందలి వ్రాత ప్రతి.)

## రంగశాయి యితర కృతులు

ఆమోద వ్యాఖ్య కాక రంగశాయి శృంగారలహరి యను కృతిని గూడ రచించెనని ఆమోదము నందలి యుల్లేఖనముల వలన తెలియు చున్నది.* ఆమోదమున గ్రంథాంత పుష్పిక యందు తాను వాగ్గేయకార చక్రవర్తి ననియు, దృశ్య శ్రవ్యోభయ విధ ప్రబంధ నిర్మాణ మార్మికుఁడ ననియు చెప్పుకొని యున్నాడు. ఈతఁడు ఆలోచనామృత మగు సాహిత్యముననే కాక, ఆపాత మధుర మగు సంగీతమునను కృతహస్తుఁ డని చెప్ప నగును. నృత్య ప్రబంధముల నిర్మించి, నాయికా భేద విచార వ్యాసంగమున నుత్సాహము గల యీతడు పద (= గేయ) రూపమున (బహుశః ఆంధ్ర గేయ రూపమున) సంగీతశాస్త్ర సేవ యొనరించి, క్షేత్రయ్య వలెనే ఉత్తమ పదకారు డని కీర్తి నంది యుండును. రంగశాయియు క్షేత్రజ్ఞుడును (= క్షేత్రయ్యయు) సమకాలికులు. క్షేత్రయ్య గోల్కొండ సంస్థానమునకుఁ జెందిన పద కర్త. ఈ సంస్థానమున నాయక నాయికా భేద విచారము, చర్చ విశేషముగా నాకాలమున జరుగుచుండెడివి. ఆ కాలమునకే చెందిన నృత్య ప్రబంధ ప్రణయన ప్రవీణుఁడై నాయక నాయికా భేద విచారమున ఆసక్తుఁడు రంగశాయి కవికి గోల్కొండ సంస్థాన సంబంధ ముండియుండునని తోఁచును. ఏమన, గోల్కొండ సంస్థానమునకుఁ జెందిన శృంగార మంజరిలో అక్బర్ షా నాయికా భేద విచారక మగు రసమంజరిని నిర్మించిన భానుదత్తుని ఏకవచనముననే పేర్కొని, దీనిపై ఆమోద వ్యాఖ్యను రచించిన రంగశాయిని "ఆమోదకారాః" అను బహువచనముననే పేర్కొనుట వలన ఆమోదకారునికి అక్బరుషాకు గాఢ పరిచయ ముండవలెననియు, శృంగారమంజరీ కర్తకు ఆమోదకారుని యెడ విశేష గౌరవ ప్రపత్తులుండి యుండవలెననియు, అందుచే నీ యిరువురును గోల్కొండ సంస్థానమునకుఁ జెంది యుందురనియు ఊహింపఁ జనును.

## తిరువేంగళాచార్యులు: తాత్పర్య మంజరి

భానుదత్తుని రసమంజరిపై సంస్కృతమున వ్యాఖ్య రచించిన తెనుఁగునాటి సంస్కృత పండితులలో మూడవవాడు ప్రతివాదిభయంకరం తిరువేంగళాచార్యులు. ఈయన నేఁటి తూర్పు గోదావరి జిల్లా యందలి చామర్లకోట వాస్తవ్యుఁడు. ఈయన జననము (అంగిరస) క్రీ. శ. 1812 వ వత్సరమున, నిర్యాణము 1865 వ వత్సరమున. ఈయన వ్యాఖ్య తాత్పర్య మంజరి అముద్రితము. దీని వ్రాత ప్రతి వ్యాఖ్యాత వంశమునకుఁ జెందిన శ్రీ భయంకరాచార్యులుగారి యింట, చామర్లకోట యందు కలదు. వ్యాఖ్యావతారికా శ్లోకములు రెండిటనుల్లేఖింపఁబడును :

1. "యత్పాదాంభోజ ముద్యత్ కిసలయ సదృశం
వజ్రకల్పం మురారేః,
యుద్ధే రాధేభకుంభ ప్రతిభటకుచయోర్
మూర్తి మత్సేఖ్య మాసీత్,
పాషాణ ప్రాణదాన త్రిభువన విజయ-
ఖ్యాతి గోపీవధూటీ-
భాగ్యం తత్పాదయుగ్మం మమ హృది సుహృదః
సన్నిధత్తాం మురారేః".

2. "వాత్సల్ శ్రీ వేంగళార్యేన వ్యాఖ్యా తాత్పర్య మంజరీ,
క్రియతే రసమంజర్యా బాల వైశద్యహేతనే."

తిరువేంగళాచార్యులు కూర నారాయణస్వామి రచించిన సుదర్శన శతకమునకు వ్రాసిన లఘుటిప్పణియు ఇంకను అముద్రిత స్థితిలోనే యున్నది.

తిరువేంగళాచార్య కవి ప్రజ్ఞా ప్రాభవము, కవితాకౌశలము ఈ క్రింది ముక్తకమున విశదీకరింపఁబడినవి :

"ఐశ్వర్యం చతురాననే, సరసతా శ్రీ కాళిదాసే కవే,
భోగః స్వర్గగరీయతే, మధురిమా వాక్యే తరుణ్యాః పృథక్,
ఏవం సంతి గుణా వసంతి మిళితాః చిత్రం త్రిలోకాధిపే
శ్రీ మద్వాదిభయంకరే నివసిది శ్రీ వేంగళార్యే గురౌ."

ఆంధ్ర దేశ సంస్కృత కవికోవిదులు రచించిన పై మూఁడు రసమంజరీ వ్యాఖ్యలును అచిర కాలమున సూర్యాలోక భాగ్యము నందుఁ గాక.

---

+ మహావిద్వాంసుడు, బహుగ్రంథకర్త యగు శేషచింతామణిని పై విట్లు దుమ్మెత్తిపోయుట కేవల మసమంజసము.

* "నవభూషణే సమీహా మదీయశృంగారలహర్యామ్" (49 పు) 77 వ పుటయందు కూడ నీగ్రంథముల్లేఖించు కొనఁబడెను.

## శేషంవారి వంశవృక్షము - గురు శిష్య పరంపర

- 1. శేషం రామచంద్రసూరి
  - 2. (తనయుడు) నృసింహ పండితుడు (తనయులు 2)
    - 3 కృష్ణ పండితుడు
      - 5 (కుమారుడు) వీరేశ్వర సూరి
        - (శిష్యులు)
          - i పేరుభట్టు (పండితరాయల జనకుడు)
          - ii అన్నం భట్టు
          - iii భట్టోజీ దీక్షితులు
          - iv పండిత రాయలు
      - 6 (కుమారుడు) నారాయణ పండితుడు
      - (1) (శిష్యుడు) I భట్టోజీ దీక్షితులు
        - (కుమారుడు) II వీరేశ్వర దీక్షితులు (=భానుజీ; రామాశ్రమ)
          - (కొడుకు) III హరి దీక్షితులు
            - (శిష్య) (5) నాగేశభట్టు (=నాగోజీ)
              - (శిష్య) (6) వైద్యనాథపాయగుండ పండితుడు
          - (శిష్య) (4) వత్సరాజు
        - (శిష్య) (2) వరదరాజు
        - (శిష్య) (3) నీలకంఠ శుక్ల కవి
    - 4 చింతామణి పండితుడు

## Bibliography ఉపజీవ్యగ్రంథములు


1 **A Critical Study of Sri Harsa's Naisadhiyacarita** By Dr. A. N. Jani (1957)
2 **History of Classical Sanskrit Literature** By Dr M Krishnamacharya (1937)
3 **History of Sanskrit Poetics** (2nd Revised ed) By Dr S K De (1960)
4 **Jagannatha Pandita** By Prof V A Ramaswamisastri (1942)
5 **'On the Sesas of Benares'** (Indian Antiquary- Vol 41, pp 245-53) By S P V Ranganatha swami (191)
6. **Padyamrta tarangini of Haribhaskara** Intro by Dr G B. Chaudhuri (1941)
7 **Sringara manjari of Saint Akbar Shah** Intro by Dr V Raghavan (1951)
8 **Descriptive Catalogue of Sanskrit Manuscripts**-Vol. 5 (Adyar - 1951)
9 **D C of Skt Mss** - Vol 22 (Govt O Mss Library, Madras- 1918)
10. **Triennial Cata of Skt Mss** (Govt O. Mss Library, Madras- 1917)
11 **Tr C of Skt. Mss** - Vol. 4 (Govt O Mss Library, Madras- 1927)
12. శేష వంశ పండితులు (శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి భారతి-మార్చి,1950)
13. సంస్కృత కవి జీవితము. (శ్రీ మ సూ. నా శాస్త్రి 1950)

# పంచాయతీరాజ్య పురోగమనం

### చింతపల్లి పంచాయతీ సమితి

నల్గొండ జిల్లా చింతపల్లి పంచాయతీ సమితిలోని గ్రామ పంచాయతీ సభ్యుల సభను అక్టోబరు 24 వ తేదీన జిల్లా పరిషత్తు కార్యదర్శి చింతపల్లిలో ప్రారంభించారు. పంచాయతీ రాజ్యం ఏర్పడినప్పటినుంచి ఈ సమితి ప్రాంతంలో 7005 మణుగుల రసాయనిక ఎరువులను, 4012 మణుగుల మేలురకం విత్తనాలను, 115 ఆధునిక వ్యవసాయపనిముట్లను పంపిణీచేసినట్లు ఈ సభలో సమితి అధ్యక్షుడు వెల్లడించారు

### ఇతోధికంగా పాఠశాలలు

విద్యారంగంలో జరిగిన అభివృద్ధి 37 ప్రాథమిక పాఠశాలలను కొత్తగా తెరిచారు. 8 పాఠశాల భవనాలను నిర్మించారు. 28 మధ్యాహ్న భోజన కేంద్రాలను ప్రారంభించారు.

### ప్రజల విరాళం

సాంఘిక విద్యా కార్యక్రమం క్రింద, 54 యువజన క్లబ్బులను, 21 వయోజన విద్యా కేంద్రాలను, 26 గ్రంథాలయాలను, 14 సామూదాయక రేడియో సెట్టులను నెలకొల్పారు. 22 మహిళా మండలులను స్థాపించారు అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం ప్రజలు రూ 18,412 లు విరాళంగా ఇచ్చారు.

### నూతన పాఠశాలాభవనం

అనంతపురం జిల్లా చెన్న కొత్తపల్లి పంచాయతీ సమితిలోని మల్లకలవలో అనంతపురం జిల్లా పరిషత్తు మాజీ అధ్యక్షుడు అక్టోబరు 22వ తేదీన నూతన పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. రూ 3 000 లు విలువచేసే ఈ భవనాన్ని పూర్తిగా గ్రామస్థులే నిర్మించారు.

### సమితికి ప్రారంభోత్సవం

నల్గొండ జిల్లా మోతుకూరు పంచాయతీ సమితికి అక్టోబరు 19వ తేదీన ప్రణాళికా పంచాయతీరాజ్య శాఖల మంత్రి ప్రారంభోత్సవం చేశారు ఈ సందర్భంలో సమితి అధ్యక్షుడు మాట్లాడుతూ, మోతుకూరువద్ద బిక్కేరుకు అడ్డంగా ఆనకట్టను నిర్మించవచ్చనీ, అందుకు అయ్యే రూ 1 20 లక్షల వ్యయాన్ని సమితిలోని 15 గ్రామాలవారు భరించాలనీ సూచించారు.

### బ్లాకు సిబ్బందిచే శ్రమదానం

వరంగల్ జిల్లా ములుగు పంచాయతీ సమితి విస్తరణ సిబ్బంది, అక్టోబరు 2వ తేదీన జాతిపిత జయంత్యుత్సవం సందర్భంగా వివిధ పేటలను శుభ్రం చేశారు ఈ సందర్భంలో బడిపిల్లలకు అన్నంపెట్టారు.

### వయోజన విద్యా తరగతులు

నిజామాబాదు జిల్లా బాన్సువాడ పంచాయతీ సమితిలో అక్టోబరు 2వ తేదీన 16 వయోజన విద్యా తరగతులను ప్రారంభించారు జాతీయ పారిశుద్ధ్య దినోత్సవం సందర్భంగా హరిజనవాడలను, బజార్లను శుభ్రం చేయడానికి శ్రమదానం చేశారు. విస్తృతీకృత బలవర్ధకాహార పథకం క్రింద ఈ నెలలో గ్రుడ్ల పంపిణీ కార్యక్రమం సంతృప్తికరంగా అమలు జరిగింది.

### పంటలపోటీ పథకం

విశాఖపట్నం జిల్లా కోటవురట్ల పంచాయతీ సమితిలోని 15 గ్రామాలలో "సాంద్రవ్యవసాయ" పథకాన్ని అమలు పరుస్తున్న రైతులు అధికాహారోత్పత్తిని సాధించడానికీ, మరుసటి సంవత్సరం జరిగే గ్రామస్థాయి పంటలపోటీలో పాల్గొనటానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు అత్యధికంగా దిగుబడిని సాధించిన రైతుకు బహుమతులు ఇస్తారు

### పారుడువ్యాధి నిర్మూలనకృషి

నవంబరు నెలలో సమితిలోని నాలుగు గ్రామాలలో పశువులకు వచ్చే పారుడువ్యాధి నిర్మూలన కృషి కొనసాగించారు. 556 పశువులకు ఈ వ్యాధినిరోధక టీకాలు వేశారు

### గ్రామస్థుల విరాళం

అనంతపురం జిల్లా ముదిగుబ్బ బ్లాకులోని రాఘవపల్లి గ్రామ ప్రజలు ఎలిమెంటరీ పాఠశాల నిమిత్తం అక్టోబరులో రూ 240 ల విరాళం సేకరించారు. గండ్లవండ్లపల్లిలో అక్టోబరు 30వ తేదీన బ్లాకు సిబ్బంది పారిశుద్ధ్య ఉద్యమాన్ని చేపట్టారు.

### రోడ్ల నిర్మాణం

నిజామాబాదు జిల్లా బాన్సువాడ పంచాయతీ సమితి గ్రామాలన్నింటిలోనూ ఆంధ్రప్రదేశ్ అవతరణ ఆరవ వార్షికోత్సవం సందర్భంగా అంతర్గత రోడ్లు నిర్మించడానికి శ్రమదానం చేశారు.

### ప్రజల విరాళం

చిన్నతరహా సేద్యపు నీటి వనరులు, మంచినీటి బావులు మొదలైన వాటికి సంబంధించిన పనులను సమితి మంజూరు చేసింది వీటికి రూ 1,45,537 లు ఖర్చవుతాయి. ఈ మొత్తంలో రూ 52,727ల మేరకు ప్రజలనుంచి విరాళాలు లభించవచ్చు

### పారిశుద్ధ్య ఉద్యమం

గుంటూరు జిల్లా రాజుపాలెం పంచాయతీ సమితిలోని గ్రామాలలో గ్రామసేవకులు అక్టోబరు 2వ తేదీన జాతీయ పారిశుద్ధ్య దినోత్సవం సందర్భంగా పారిశుద్ధ్య కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంలో వారు ఈ దినోత్సవ ప్రాముఖ్యతను గ్రామస్థులకు వివరించారు.

* * *

# అమర నిస్సాణము

జొన్నలగడ్డ వీరవెంకటేశ్వరరావు

శాంతి ఇఁకేటి శాంతి విలసద్ఘన
సారపటీర సార ని
ర్వాంత నితాంత శాంతి సముపాసన
దుష్టనికృష్ట భావనా
ప్రాంత నివాస మానసుల క్రౌర్య
సముద్భటి నార్పు టెట్టులా
శాంత నిశాంత భేరి రవ
జాలము యుద్ధసమృద్ధిఁ దెల్పుతన్.

ఆశల పాశమందొదిగి
యారెడువారికి సూనవాసనా
పేశల శాంతివాయు మృదు
సౌరభ సంపద సోకు టెట్లు; ఘో
రాశని రాశి. మృత్యు పరిరంభ
సుఖమ్ములు, వారి కోర్కెలా
వేశ పటిష్ట చేష్టితులు
వే యెదురొడ్డుడు శౌర్యధుర్యతల్

సరళసమార్ద్రి శాంతి సరసమ్మయి
దేశములున్ననాళ్ళు వి
స్తరణముఁ బొందెఁ గాక మన
శాంతి నినాదము, నేఁడు దగ్ర సం
గరకరణోత్సుకత్వ ముఖ
గహ్వర సంస్థితులైన వారిపై
కురియుత క్రాంతి విస్ఫుర
దకుంఠిత శౌర్యగుణ స్ఫులింగముల్

సురుచిరకాంతి దంభపరి
శోభితమై ప్రకటప్రమోద సం
భరితులఁ జేయుఁ గాక వర
వజ్రము, స్నేహగుణమ్ము మాని, ని
ష్ఠురమగు వైర మూని విరసుల్
దురహంకృతి డాసి ఈసుతో
నొరసిన ఎంతవారయిన
నొక్కెడ రంపపుఁ గోతపెట్టదే.

తెలియమి భారతీయ
సముదీర్ణబలప్లుతి తద్విపక్షక
జ్వలన గుణప్రసక్తి గతి
వారరు దెంతురుగాక వచ్చుచో.
కలిగెడిదేమి మృత్యుముఖ
గహ్వరగేహనివాస సౌఖ్య సం
కలనము గాక దేశమున
క్రౌర్య కరాళఖలారి పంక్తికిన్

ధీరత ధర్మ మేవ జయతే
యని దుర్వినయ ప్రకార సం
హారక ధర్మ సంస్థితికినై
యని చేసెడి వారికే జయా
పారసుధాపయోనిధి
నివాస తరంగ విగాహ నమ్మృత
దుర్భరిభుజాబలప్రగతి
పొంత వసించును కీర్తికామ్యముల్

పొడమిన యార్తిఁ జిక్కి
యరిపుంఖ విశృంఖల దౌష్ట్యశక్తులన్
గడపు ప్రభుత్వ పద్ధతి
కఖండ సహాయ మొసంగి సాధన
మ్మడఁచుడి ఆత్మశక్తి
వదనంత సముజ్జ్వలిత ప్రజామతుల్
బడసినచో ప్రభుత్వము
దివమ్మను నైతముముట్టడింపదే

ధనమో ధాన్యమొ కాంచనంబొ
హృదయత్యాగంబొ దేశార్థమై
యొనరింపంజను దెందు. త్యాగులు
మహా యోధాగ్రగణ్యుల్ శ్రమ
మ్మున స్వాతంత్ర్య సమృద్ధి సిద్ధి
విలసన్మోదమ్ము కన్నారమీ
ఘన సంపత్తును కాచికొం
డిపుడు తత్కాంక్షాసమాశ్లిష్టులై



# పారిశ్రామిక విశేషాలు

[రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధిపథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షక క్రింద యివ్వబడుతున్నవి]

## కేంద్ర ప్రభుత్వ సంస్థలు

రెండు కేంద్ర ప్రభుత్వ ప్రాజెక్టులైన భారీ విద్యుత్పరికరాల ప్రాజెక్టు, సింథటిక్ డ్రగ్స్ ప్రాజెక్టుల [హైదరాబాద్] తాలూకు సిబ్బంది గృహాలు, ఇతర భవనాల నిర్మాణానికి సంబంధించిన సివిల్ పనులు చురుగ్గా కొనసాగుతున్నాయి.

## ప్రైవేటు రంగం

ఏటా 360 టన్నుల గ్లిసెరిన్ ఉత్పత్తిని చేపట్టటానికి భారత ప్రభుత్వం కర్నూలులోని తుంగభద్ర ఇండస్ట్రీస్‌కు లైసెన్సు ఇచ్చింది. ప్రస్తుత సంస్థలోనే ఈ ఉత్పత్తి జరపటానికి అనుమతించబడినది.

స్పెక్ట్రోఫోటోమీటర్, ఎలక్ట్రోకాలోరీ మీటర్, ఇన్క్యుబేటర్స్ మొదలైన లేబొరేటరీ పరికరాలు, శాస్త్రీయమైన పరికరాలను ఉత్పత్తిచేయడానికి హైదరాబాదులో విదేశీయుల సహకారంతో ఫ్యాక్టరీని నెలకొల్పడానికై పెట్టుకున్న దరఖాస్తులను రాష్ట్ర ప్రభుత్వం ఇటీవలనే సిఫార్సు చేసింది. అల్యూమినియం కడ్డీలు, వైర్ వాల్వులు, ఇంజన్ వాల్వులు మొదలైనవాటిని ఉత్పత్తి చేయడానికి యూనిట్లను నెలకొల్పేందుకై పెట్టుకున్న దరఖాస్తులను కూడా రాష్ట్ర ప్రభుత్వం సిఫార్సు చేసింది.

రాష్ట్రంలో సున్నపురాళ్లు లభించే వివిధ ప్రదేశాలలో సిమెంటు ఫ్యాక్టరీలను స్థాపించడానికై పెట్టుకున్న దరఖాస్తులను ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నది.

## ప్రభుత్వ రంగం

సింగరేణి బొగ్గు గనులన్నింటిలో కలిపి 1962 సెప్టెంబరులో మొత్తం 2,78,808.1 టన్నుల బొగ్గు త్రవ్వి తీశారు. కాగా 1962 ఆగష్టులో 2,71,946.9 టన్నులు, 1961 సెప్టెంబరులో 2,49,195.5 టన్నుల బొగ్గును ఈ గనుల నుంచి త్రవ్వి తీయడం జరిగింది.

1962 సెప్టెంబరు నెలాఖరు వరకు 22,50,155.9 టన్నుల బొగ్గు తీశారు. క్రిందటి సంవత్సరం ఇదే మాసాంతంనాటికి 20,00,023.3 టన్నుల బొగ్గు తీయడం జరిగింది.

ఈ కంపెనీ 1961–62 వ సంవత్సరంలో 2.85 మిలియన్ టన్నుల బొగ్గు లభింపజేసింది. తృతీయ పంచవర్ష ప్రణాళిక క్రింద 1965–66 నాటికి 6.1 మిలియన్ టన్నుల ఉత్పాదక లక్ష్యాన్ని ఇది సాధించవలసి వుంది.

సోమగుండం ప్రాంతంలో 1962 సెప్టెంబరు 6 వ తేదీన కొత్త గనులను ప్రారంభించారు. ఈ ప్రాంతంలో సుమారు 20 మిలియన్ టన్నుల బొగ్గు లభిస్తుంది. డ్రిల్లింగ్ పనులు కొనసాగుతున్నాయి. ఇచ్చట 3, 4 ఇన్‌క్లైన్స్‌ను తెరవడానికి ప్రతిపాదించారు. దీనిని పూర్తిగా అభివృద్ధి పరచినప్పుడు ఇచ్చట ఏటా 5 లక్షల టన్నుల బొగ్గు లభిస్తుంది.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

నిజాం చక్కెర ఫ్యాక్టరీ [లిమిటెడ్] మానేజిమెంటు ఆ సంస్థలో పని చేసే ఉద్యోగుల కొడుకులకు ఇద్దరికి, నిజామాబాదులోని ప్రభుత్వ పాలీటెక్నిక్‌లో సాంకేతిక శిక్షణ పొందటానికై ఒక్కొక్కరికి నెలకు రూ. 75/– ల చొప్పున స్కాలర్‌షిప్పులు బహూకరిస్తున్నది. ఇవి 1962 ఆగష్టు ఒకటవ తేదీనుంచి ఒక సంవత్సరం వరకు లభింపజేయబడతాయి. * * *

నేనెరిగిన

# తత్వవేత్త, మహారచయిత శ్రీ "గోపీచంద్"

కాలం ఎంత బలవత్తరమైన వస్తువునైనా లయింపు చేస్తుంది. మళ్ళీ ఆ కాలమే ఊరడింపు నిస్తుంది. మన మధ్యన ఉన్న మనిషి హఠాత్తుగా మాయమై పోయినప్పుడు తరంగాల మీద కర్రతో కొట్టినట్లు మన హృదయం విహ్వాలించుతుంది. మళ్ళీ మనం కొంత సేపటికి కలరూపుకు తేరుకుంటాము. కాలం ఈ ధర్మాన్ని పాటించే మనలను ఉత్తేజ పరుస్తుంది, శాంత పరుస్తుంది. కాలం ఘటనను రూపుమాప జేస్తుంది గాని భావాన్ని రూపుమాపలేదు. మనుష్యుడు ఒక పెద్ద ఘటన. అతనిని అది అంతం చేస్తుంది. అతనిలో మెదిలే భావం ఘటనాతీతం, అమాన వీయం. దాన్ని ఏ కాలమూ అంతంచేయలేదు. అందువల్లే రచయితలు, కవులు నిత్య జీవద్విదేహాలు. భక్తితో, జ్ఞానంతో, కర్మతో మనుష్యుల సంబంధాలు నెలకొనిఉంటవి. కర్మ చేసి మెప్పించిన మనుష్యులు కర్మ ఫలితం సిద్ధించగానే మరుగున పడిపోతారు. కర్మ సంబంధం తాత్కాలికం. భక్తి, పిన్నలు పెద్దలు అన్న తారతమ్యంలో జీవించుతుంది. తారతమ్యం పోగానే భక్తి కూడా పోతుంది. కాన భక్తి కర్మలతో భగవంతుణ్ణి సేవించడం స్థూలమైన పద్ధతి అయింది. జ్ఞానమార్గం చాల సూక్ష్మమైంది. ఒకరినొకరు అర్థం చేసుకొనడం జ్ఞానం. అదే ఎరుక. ఈ స్థితిలో జీవుడు పరమాత్మతో నీవూ నేనూ ఒకటే నంటాడు. అంటే ఒకరినొకరు తెలుసుకున్న తరువాత తరతమ భేదాలు ఉండవు. జ్ఞాన ప్రధానుడైన గోపీచంద్‌కు జ్ఞానమార్గంతోనే నేను దగ్గరకు వచ్చాను.

గోపీచంద్ వంటి మానవులు మన మధ్యన జీవించ గలరు అంటే జ్ఞానమాధ్యమంతోనే జీవించగలరు. జ్ఞానమయులు గ్రంథ రూపంలోను, భక్తిమయులు పాఠకుల రూపంలోను ఉన్నారు. గోపీచంద్ ప్రపంచంలో ఉన్నంత వరకు ఆయన గ్రంథరూపం, వ్యక్తి రూపం ఒకదానినొకటి అనుస్యూతమై ఉండేవి. అంటే ఆయన తన నిజ జీవితంలో వ్యక్తిని గ్రంథంగా చేసుకున్నారు, గ్రంథాన్ని వ్యక్తిగా చేసుకున్నారు. ఆయన మాటల్లో ఆయన రచన, నడక అన్నీ తొణికిసలాడుతూ ఉండేవి. అవి శస్త్రతుల్యాలు. వాటికి చికిత్స లేదు. ఆయన ఎంత హఠాత్తుగా మాట అని ఎదుటి మనిషిని డిల్ల చేస్తారు అంటే ఆ నడిమ సమయంలో ఆ మనిషికి జవాబు అందక పెనగులాడుతుంటే మళ్ళీ ఆయనే మాట అందించి లజ్జ పరుస్తారు. నేను ఓడిపోయాను అని పూర్తిగా ఒప్పుకున్నా మళ్ళీ దులిపి నిలబెట్టి శక్తి పుంజుకోవడానికి తానే అతనికి శక్తినిచ్చి యుద్ధానికి తయారుకమ్మంటారు. ఈ కవ్వించట మంతా తన మనసెక్కిన మనుషులతోనే. ఆయన నుంచి గౌరవం పొంది బయటికి వచ్చామా ఆయన నుంచి ఏమీ సాధించ లేదన్న మాటే. ఆయన మనవంక చూడలేదా ఇక చూడనట్టే. ఆయన ఎదుట నిలవ గలిగిన వ్యక్తిలో సాత్విక గుణాలు ఏమీ ఉండ గూడదు. భక్తి వినయ ప్రపత్తులు ఏమీ ఉండగూడదు. ఆయన పోటరిగాబట్టి పోరాడే శక్తి ఉండాలి. జిజ్ఞాసువు గాబట్టి జిజ్ఞాస ఉండాలి. రచయితలు ఆయనకు వత్సలు.

గోపీచంద్ "పలుకుబడి" రచనల్లోనూ, వ్యక్తి జీవితం లోను కూడా అక్షుణ్ణంగా కనిపించుతుంది. కథలో తయారు చేసే బరువైన భాషను హఠాత్తుగా సంభాషణలోకి కూడా దింపివేస్తారు. "గులాబి కాంతి నవ్వేను" అన్న పదం కలిగిన ఒక కవిత్వం నేను వినిపించాను. "కాంతి నవ్వటం" ఏమిటి అన్నారు మొదట. ఇలాంటి ప్రయోగాలు ఇంగ్లీషును చూచి చేసినవి అన్నారు తరువాత. కాని ఆ ప్రయోగం మీద ఆయన లోలోపల ఆలోచించు తూనే ఉన్నారు. నాతో మాట్లాడుతూనే ఉన్నారు. హఠాత్తుగా ఆయనకు ఒక సందర్భం దొరికింది. "ఆ అర్థం ఇక్కడ

రచన: "దుర్గానంద్"

చావదు" అన్నారు. "అర్థం చావదు" అన్నచోట నొక్కిన ఆ నొక్కుడు చూస్తే నా కవిత్వంలో ప్రయోగాన్ని మాటల్లో నాకంటే బాగా వాడి ఎంత గట్టి కసి నానుండి తీర్చుకున్నారో నేను విస్తుపోయాను. ఆయన బలంగా ఒక మాట అని పడవేస్తే ఇక దాన్ని మనం ఎత్తలేము.

గోపీచంద్ నిర్భీకమైన వచస్వి. ఆయన ఆఫీసు ఎప్పుడూ శబ్దాయమానంగా ఉండేది. కండ గలిగిన మాటలు గుండెదూసుకు పోగలిగిన మాటలు అనగలిగిన వారిలో ఆయనే బహుశా చివరి తరం వాడేమో. ఇక ఇప్పుడు మనలో అలాంటి మాటకారులు పుట్టరు. ఇది బధిర పంగ్వంధ యుగము. ఎవడికీ గట్టినోరు లేదు. గట్టి దవడలు లేవు. అచి తూచి మాట పొల్లుపోకుండా మాట్లాడే మూగితనం నేర్పుతుంది ఈ సభ్యత. మానసిక హింసలు, ఉద్యోగ హింసలు చేయవచ్చు గాని వచన హింసలు చేయకూడదు. ఆఫీసులో పిన్ను డ్రాపు సైలెన్సుతో కూర్చోవాలి. ఎవరైనా మాట్లాడించినా పెదవి విప్పీ విప్పకుండా తుంపురులులా మాట్లాడు కోవాలి. ఉపన్యాసం ఇవ్వాలంటే కాగితం మీద వ్రాసుక వచ్చి అక్కడ చదివాలి. దాంట్లో ఉపన్యాసకుని హావభావాలు, భావ విన్యాసాలు, భాషా సౌమనస్యాలు, ప్రతిభలు, పాండిత్యాలు ఏమీ లేని నాలుగు ఎండుగడ్డి పరకలు అవీ ఏ పుస్తకాలనుంచో కోట్ చేసుకవచ్చి అమృత శకలాలులా చదివి వినిపించాలి. ఇలాంటి మూగి సభ్యతలో బుద్ధితోను, హృదయంతోను వాక్కుతోను నిరంతరం సందడులు, చప్పుడులు చేసే గోపీచంద్ వంటి మనీషులు ఎలా పుట్టగలరు? ఆయన బహుశా తుది అస్తంగత కిరణమేమో వెనుకటి మాటకారి వ్యక్తిత్వాలకు.

గోపీచంద్ సత్యాన్వేషి. సత్యాన్ని గురించిన జిజ్ఞాస ఆయనలో ఎప్పుడూ ఉండేది. ఒకప్పుడు నేను సత్యం కూడా మారేదేను, శాశ్వతమైంది కాదన్నాను. అప్పటినుంచీ ఆయన నామీద వార్ డిక్లేరు చేశారు. భౌతిక వాదం నుండి మరలి ఆధ్యాత్మికం వైపుకు ప్రయాణం సాగించిన గోపీచంద్ నాకు నిత్య ప్రయాణీకుడుగా, ఆ బాటపొడవుగా, చుక్కలను చేరుకునేదిగా ఆగకుండా అందకుండా పోతూ పోతూ ఉంటే, ఆగి, అందుకుని ఆయన ప్రక్కన నిలబడి నేనూ ఒక చిన్న ప్రయాణీకునిగా ఫీలయ్యేవాణ్ణి. భౌతికవాదాన్ని ఇంకా ఆయన పూర్తిగా నిరసించలేదు. కాని ఆత్మ మీద ప్రగాఢమైన విశ్వాసం ఏర్పడింది. ఆరెంటితోను పడ్డ ఘర్షణ రచనలో "సమన్వయ"మై వ్యవహారం "కసి"యై చివరకు మొత్తం అన్నింటినీ కలుపుకుని "కళ" అయేది.

వెనుక కొన్ని కథల్లో ఆయన కవుల్ని దుయ్యబట్టారు. కాని ఇటీవల కవిత్వమంటే ఆయనకు విశేషమైన ఆసక్తి కలిగింది. చైతన్య వాదంలోకి ప్రవేశించగానే దాని శాఖోపశాఖలైన భావుకత నీతి, విశ్వాసం మొదలైన గుణాలకు కూడా చూచి హర్షించ మనసవుతుంది. కవి, భావనాశీలి, బుద్ధి, భావుకతల పెనుగులాటలో చివరి గెలుపు భావుకతదే అని ఆయన గ్రహించారు. మనం ఎన్ని యుక్తి ప్రయుక్తులు చూపెట్టినా ఎంత తర్కంతో విషయాన్ని సమర్థించినా చివరకు హృదయం నివసించే తావుల్లోనే వచ్చి శాస్త్రం కూడా నివసించుతుంది. ఆర్తనాదాన్ని కాపాడటానికే గదా న్యాయశాస్త్రాలు పోలీసు శాఖలున్నూ.

గోపీచంద్ సూటి అయిన మనిషి. ఆయనకు మనుషులు సూటిగా అద్దంలో బింబాలులాగా కనిపించే వారు. ఎంత శుభ్రంగా, శుద్ధంగా ఆయన చూడ గలిగేవారంటే ఇదిగో ఈ రంగు నాకు ఇంత తెల్లగాను, స్వచ్ఛంగాను కనిపించుతుంది నీకు కనిపించడం లేదేం అని ప్రక్కవాణ్ణి పొడిచి అడిగి నట్లుండేది ఆయన చూపు. మాట్లాడటానికి తగిన మనిషి దొరికినప్పుడు వయస్సు, పదవి, ప్రతిష్ఠల మాట కూడా మరచిపోయేవారు. ఆయనకు ఏ రకమైన పట్టింపులూ లేవు. అన్ని అవరోధాలు తొలగించుకొని వ్యక్తిలోని వైశిష్ట్యాన్ని పరిశీలించడం ఆయనకు ఒక తృష్ణగా మిగిలి పోయింది. ఆయనకు నచ్చిన మనిషిని ఆయన కవ్వించే వారు. వాదులాడేవారు, కసురుకునేవారు, మెచ్చుకునేవారు. ఇలా మనిషిని పొర్లించి పొర్లించి ఎక్కడ 'జ్ఞేయం' ఉందో అక్కడ చిక్కుక పోయేవారు. మనిషిని శాశ్వతంగా జీవింపజేసేది జిజ్ఞాస అని ఆయన నమ్మకం. ఒక రచయిత ముందుకువస్తే అతణ్ణి అతని రచన ద్వారా చూచేవారు గాని ఒంటరిగా ఏకాకిగా చేసి ఎప్పుడూ చూచేవారు కాదు. కొందరు, వ్యక్తిని రచన నుండి చూడకుండా వ్యక్తి నుండి చూడటం మొదలుపెడతారు దాంతో వ్యవహారమంతా తల్లక్రిందులవుతుంది. ఇంకా అసభ్యకరమైన విషయమేమంటే ఆ వ్యక్తి చేసిన పనులన్నీ మరచిపోయి చూస్తారు. ఇలా చూడటం సాంస్కృతికాపరాధం.

గోపీచంద్ బుద్ధి సాత్వికమైంది అయినా ప్రవృత్తి రాజసమైందే. ఆయనది ఎదుటి చూపు. కాని అతిప్రేమలోను అతి

క్రోధంలోను క్రీగంటి చూపుతో కూడ చూచేవారు. మనిషిలో ఉన్నమనిషిని మనిషిలో ఉన్నకవిని ఆయన పసికట్టినంత తొందరలో ఎవరూ పసికట్టలేరు. మనం మన సంపర్కంలోకివచ్చిన మనుషుల్ని కుటుంబీకుడనో ఉద్యోగిఅనో, ఇంత విల్వలో ఉన్నాడనో లేక అప్పులో ఉన్నాడనో జ్ఞాపకముంచుకుంటాము. కాని ఈ అంకెలతో గోపీచంద్ ఎప్పుడూ మనుష్యులను జ్ఞాపకం పెట్టుకోలేదు.

రచనలు రచయితల్ని క్షోభపెట్టడమే కాదు చంపికూడా వేస్తవి. గోపీచందే దానికి నిదర్శన. పల్లెవాడు పడవలో చనిపోతాడు. రచయిత రచనల్లో చనిపోతాడు. ఈ నడుమ పుంఖాను పుంఖాలుగా వెలువడే ఉత్తమ రచనలు చూచి మీరు ఒకే దఫా ఇన్ని మంచి పుస్తకాలు రాయకండి అన్నాను. "ఏం నీకు అసూయగా ఉందా" అన్నారు. ఒక మంచి పుస్తకం వ్రాస్తే ఆరు నెలల వరకు మళ్ళీ ఏమీ వ్రాయ బుద్ధి పుట్టదు. కాని ఆయన నిర్విరామంగా వ్రాస్తూనే ఉన్నారు. రెండు నెలల నుంచీ ఆయన శరీరం మీద ఆయన రచనా భారం పడుతూ వచ్చింది. కొన్ని రోజులు ఆఫీసుకు సెలవుపెట్టారు. యువలో చీకటి గదులు కనిపించలేదు, శాయన్న కనిపించలేదు. కాని గోపీచంద్ మనుషుల కంటికి కనిపించుతూనే ఉన్నారు. ఇది ఆయన శరీరం తప్పుగాని ఆయన తప్పుగాదు. ఆయన శరీరం మృత్యువుతో పెనగులాడుతూ కూడా మృత్యుం జయంగానే ఉంది. మృత్యువంటే ఆయనకు లెక్కా జమా లేదు.

చివరి దశలో ఆయన ఎంతో మార్పుచెందారు. అందరిలో ఆయనకు మంచితనమే, గొప్పతనమే కనిపించినవి. ఆత్మీయతతో నిండి అమృతమూర్తి అయినారు. దాదాపు నెలరోజుల నాటి సంగతి. "దుర్గానంద్, రేపు ఇంటికి భోజనానికి రా. సరిగ్గా 9 గంటలకు" అన్నారు. 'ఏమైనా వ్రతమా' అన్నాను. "నాకు ఏమీ తోచడం లేదు దుర్గానంద్. నీవు బొత్తిగా రావడం లేదేం. నీవు కూడా రాకపోతే ఎలాగు. లైఫ్ అంతా యాత్రికంగా ఉంది దుర్గానంద్" ఆ మాటలు జీవితంతోనే దస్సిపోయి అన్న మాటలుగా నాకు వినిపించినవి. ఆదివారం అది. భోజనం అయింది. బజారులోకి ఇద్దరమూ వచ్చాము. ఆయన సిగరెట్టు కొనుక్కున్నారు. నాకు బలవంతం చేసి పాను కొనిపెట్టారు. లోగడ కూడా బలవంతం చేసి ఏదో కొనిపెడుతూ ఉండేవారు. ఒకసారి చ్యూయింగ్‌గం కొనిపెట్టి ఇదేమిటి అంటే 'నీలాగానే సాగే ఒక బిళ్ళ' అన్నారు. ఇలాంటి మాటలు నాకు ఎప్పుడూ జ్ఞాపకముండేవి. కాని ఆ ఆదివారంనాడు మాత్రం ఆయన చేసిన బలవంతం ఏదో అన్నిటికంటే విలక్షణమైందిగా కనిపించింది. ఒక అర్ద్రభావం నా హృదయాన్నంతా క్రమ్మి నా సర్వశక్తుల్ని గద్గదింపజేసినై. ఇక వెళ్లు దుర్గానంద్ అంటూ గిరుక్కున తిరిగి ఇంటికి వెళ్లిపోయారు. నేను నా రూముకు రాలేకపోయాను. మళ్లీ ఆయన ఇంటికే వెళ్లాను. పసిపిల్లవానిలా వరండాలో పడుకుని ఉన్నారు. ఏమిటి దుర్గానంద్ మళ్ళీ వచ్చావు అన్నారు. ఏమీ లేదు అన్నాను.

ఆ తరువాత మళ్ళీ వారం రోజులకు రేడియో స్టేషనులో కలుసుకున్నాము. అప్పటికి ఆయన ఇంకా డస్సిపోయి ఉన్నారు అది చివరి కలయిక. నెత్తిమీదనుంచి ఒక పెద్ద బరువును దించుకున్న భార వాహకునిలాగా అలసటతోను, ఆనందంతోను ఇలా అన్నారు; "ఒక పెద్ద కథ వ్రాశాను దుర్గానంద్! డాక్టరు ఏమీ వ్రాయవద్దన్నాడు. డాక్టరుతో చెప్పాను నాలుగు రోజుల వరకు నేను నీ మాట వినను. చచ్చినా బ్రతికినా నేను ఆ కథ వ్రాయవలసిందే. వ్రాసి ఇచ్చివేశాను ఇవ్వాళ" అన్నారు మళ్ళీ కొంచెం సేపు ఆగి అన్నారు. "వ్రాయడం ఎంత కష్టమనుకున్నావు. మనం ఏదో వ్రాసి ఇచ్చివేయము మరి. చాలా శ్రమపడవలసి వచ్చింది దుర్గానంద్." రచన కష్టమైంది అనే మాట ఆనాడే ఆయన నోటినుంచి విన్నాను. నేను ఎప్పుడైనా వ్రాయడం కష్టమైన పని అంటే వెక్కిరించేవారు. నే నన్నాను "అయితే మీరు ఇప్పుడు తప్పనిసరిగా విశ్రాంతి తీసుకోండి." దానికి ఆయన ఒక్క క్షణం ఆగి అటు ఇటూ చూచి రిక్షాను పిలిచి ఇక 'విశ్రాంతే దుర్గానంద్' అంటూ రిక్షా యెక్కి వేగంగా వెళ్ళిపోయారు. నావెంట వచ్చిన మిత్రుడు 'గోపీచంద్‌గారు మనతో మాట్లాడుతున్నంత సేపు గుండె చేత్తో పట్టుకునే ఉన్నారండీ' అన్నాడు. అంతే మేము ఇంటికి వచ్చాము. మళ్ళీ నేను పదిహేను రోజుల వరకు ఆయన్ను చూడలేదు. ఆయనతో సంబంధమున్న విషాదపూరితమైన రెండవ తారీఖు నాకు కనిపించకుండానే జారిపోయింది. మూడవ తారీఖున ఆయన ముఖం కనిపించింది. అది ఎలాంటి ముఖం! లౌకిక మమకార బంధనాలను త్రెంచుకుని దారుఖండాల మధ్య మునిగిపోయి, చలనరహితమై నన్ను పలకరించలేని, నన్ను చూడలేని ఈ సంపూర్ణ ప్రపంచం నుంచి విగతి బొంది నిశ్శబ్దమైన నోరు, ముక్కు, పెదవులు గలిగిన చల్లని ముఖం! అబ్బా ఎంత చల్లని ముఖం! ఎంత శైత్యం గడ్డకట్టుకుపోయింది ఆ ముఖంలో. ఆ ముఖాన్ని నా కళ్లు చూచి భరించలేకపోయినై. మరుక్షణంలోనే అది అదృశ్యమై పోయింది. అప్పటికే ఆకాశంలో పొగలు క్రమ్ముకున్నై. జోరున కుంభవృష్టి కురిసింది. అంతే ఆ వెలుగు వానల్లో ఇక ఆయనేమైపోయారో మరి. కృత్రిమ దీపకాంతులతో వెలిగి ఆరిపోయే క్షణభంగురమైన దీపకమహలు చేరువ విడిదీని వదలి ఏ అనంతమైన తారకమాలాలంకృతమైన జ్యోతిర్మయ దీపికా మహలును చేరుకున్నావో గోపీచంద్! ధన్యుడవు. మే మిప్పుడు నీ క్షణభంగురమైన దీపకామహలు సమీపానికి కూడా చేరుకోలేము గదా! **

# తెలుపు నలుపు

జి. బాలకృష్ణ మూర్తి

సస్య శ్యామలమైన డెల్టా ప్రాంతాల్లో కృష్ణా జిల్లాలోని దివి తాలూకా ఒకటి. అందులోనూ కూచిపూడి బ్లాకు వివిధ రంగాలలో ముందంజ వేసిన ప్రాంతం సాంఘిక, ఆర్థిక, రాజకీయ చైతన్యానికి కృష్ణా జిల్లాలోనే కాక ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఈ బ్లాకులోని గ్రామాలు వాసికెక్కాయి.

ఈ బ్లాకులోని 31 రివెన్యూ గ్రామాలు 32 పంచాయితీలుగా ఏర్పాటు చేయబడినాయి. ఈ 32 పంచాయితీలలో 7 పంచాయితీలు పూర్తికాలం పని చేసే కార్యనిర్వహణ అధికార్లు గల నోటిఫైడ్ పంచాయితీలు వీటిలో ఒక్కొక్క పంచాయితీ సగటు ఆదాయం సంవత్సరానికి రూ. 25,000 పైన ఉంటుంది. 8 పంచాయితీల సాలుసరి ఆదాయం రూ. 10,000 – 5,000 ల మధ్య ఉండగా, 15 పంచాయితీల ఆదాయం రూ 5,000–3,000 మధ్య, రెండు పంచాయితీల ఆదాయం రూ 2,000–1,000 మధ్య ఉండి ఆర్థిక సౌష్టవం కలిగి ప్రజలకు కావలసిన సౌకర్యాలు స్వతస్సిద్ధంగా ఒనగూర్చగల స్థితిలో ఉన్నాయి.

ఈ బ్లాకు పంచాయితీ అధ్యక్షులందరూ విద్యావంతులు. పంచాయితీ సభ్యులలో అధిక సంఖ్యాకులు విద్యావంతులై పంచాయితీ విధి నిర్వహణ, పరిపాలనా వ్యవహారాలు అర్థం చేసికొనగలవారు

ఈ బ్లాకులో 8 పంచాయితీలు మాత్రం 1950 సంవత్సరానికి పూర్వం నుంచివున్న పాత పంచాయితీలు. మిగిలిన 24 పంచాయితీలు 1957–58 సంవత్సరంలో ఏర్పాటు చేయబడినవి ఈ పంచాయితీలు అన్నింటిలోను యింటి పన్ను, వృత్తి పన్ను విధిగా విధించుతున్నారు. 20 పంచాయితీలలో బండ్ల పన్ను విధించ బడుతున్నది పచ్చ గడ్డి, చేపల వేలం పాటల మూలంగా మంచి ఆదాయం వస్తుంది స్టాంపు డ్యూటీమీద సర్ఛార్జి వల్ల కూడా కొంత ఆదాయం లభిస్తున్నది నూటికి నూరు పాళ్ళు పన్నులు వసూళ్ళు చేయడంలో ఈ బ్లాకు పంచాయితీల కార్య నిర్వాహక అధికార్లు ప్రథమం నుంచి ప్రశంసించతగిన కృషి చేస్తున్నారు. 1958–59 సంవత్సరంలో 19 పంచాయితీలలో, 1960–61 సంవత్సరంలో 22 పంచాయితీలలో, 1961–62 సంవత్సరంలో 32 పంచాయితీలలో నూటికి నూరు పాళ్ళు పన్నులు వసూలు కావడంద్వారా ఆంధ్రప్రదేశ్‌లో అగ్రగామిగా నిలచాయి. గర్వించదగిన ఈ స్థానాన్ని ఇక ముందు గూడా ఈ బ్లాకు పంచాయితీలు నిలుపుకొనగలవనే ఆశిస్తున్నాము.

ఈ పంచాయితీలు ఆయా గ్రామాలకు సమకూర్చే అభివృద్ధికర కార్యక్రమాలలో ప్రధానంగా పేర్కొనతగినవి రోడ్లనిర్మాణం, మంచినీటి సరఫరా, ప్రజారోగ్య పరిరక్షణ, వీధి దీపములు. ఇది డెల్టా ప్రాంతం అవ్వటం వల్ల యిక్కడ కంకర రోడ్లు వేయడం కొద్ది వ్యయంతో కూడినపని ప్రతి పంచాయితీ తన ఆదాయంలో సుమారు నూటికి 25 వంతులు, రోడ్ల నిర్మాణానికి అభివృద్ధి కార్యక్రమాలకు ఖర్చు చేస్తారు భట్లపెనుమర్రు, మొవ్వ గ్రామాలలో పూర్తిగా కంకర రోడ్లు వేయబడ్డాయి

ఘంటసాలపాలెం, పెదకళ్ళేపల్లి, అయ్యంకి గ్రామ పంచాయితీలు ఓవర్ హెడ్ ట్యాంకు రిజర్వాయర్లు నిర్మించి కుళాయిల ద్వారా గ్రామాలలోని అన్ని ప్రాంతాలకు మంచినీటి సరఫరా చేస్తున్నారు. ఘంటసాల, తాడేపల్లి గ్రామాలలో ఈ సంవత్సరం ఈ పథకం అమలు జరిచడానికి ప్రయత్నిస్తున్నారు. మిగిలిన గ్రామాలలో సిమెంటు వరల బావులు, గొట్టపు బావుల ద్వారా మంచినీటి సౌకర్యం కలిగిస్తున్నారు ఈ బ్లాకు గ్రామాలలో మంచినీరు పుష్కలంగా లభిస్తుంది 22 పంచాయితీలలో విద్యుద్దీపములు [వీధి దీపములు] యేర్పరచడం జరిగింది మిగిలిన పది గ్రామాలలో అనతికాలంలోనే వీధులలో విద్యుద్దీపాలు వేసే అవకాశం యేర్పడగలదు 8 గ్రామాలలో ప్రయివేటు స్కావెంజింగు స్కీము అమలులో ఉండగా 15 గ్రామములలో పంచాయితీలు సెప్టిక్, ఓపెన్ సైపు పబ్లిక్ లెట్రిన్లను ఏర్పాటు చేశాయి.

ఈ బ్లాకులో 12 ఉన్నత పాఠశాలలున్నాయి. ప్రాథమిక పాఠశాల లేని గ్రామమంటూ లేదు 8 పంచాయితీలు స్వంత గ్రంథాలయాలు నిర్వహిస్తున్నాయి. 10 గ్రామాలలో రిజిస్టరైన లైబ్రరీలు వున్నాయి అన్ని పంచాయితీలు పఠన మందిరాలను నిర్వహిస్తున్నాయి. 27 పంచాయితీలు సమిష్టి రేడియో కేంద్రాలను నిర్వహిస్తున్నాయి 5 పంచాయితీలకు స్వంత కార్యాలయ భవనాలున్నాయి.

ప్రభుత్వమూ, జిల్లా పరిషత్తూ యిచ్చే గ్రాంటుల్ని వినియోగించుకొనడంలో ఈ బ్లాకు పంచాయితీలు ప్రధానంగా పేర్కొన దగినవి అదేవిధంగా ప్రజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి వివిధాలైన పథకాలకు తమ వంతు ధనాన్ని యివ్వడం ద్వారా నూ, శ్రమదాన రూపంగాను సహకరిస్తారు. పంచాయితీలు తమ భాగం విరాళం జతపరచి సాధన సంపత్తిని వినియోగించి ఆయా కార్యక్రమాలు, పనులు జయప్రదంగా కట్టుదిట్టంగా సకాలంలో పూర్తి చేయిస్తున్నవి ఈ విధంగా చేయించబడే పనుల్లో గ్రామ చెరువులు బాగుచేయించడం, గ్రామానికి గ్రామానికి మధ్య రోడ్లు వేయడం, మంచినీటి బావులు త్రవ్వించడం, పాఠశాలలు, పంచాయితీ కార్యాలయాలు, సాముదాయకపు భవనాలు కట్టించడం వగైరా పేర్కొన తగినవి కొత్తపల్లి గ్రామ పంచాయితీ భవనం, ప్రాథమిక పాఠశాలాభవనం, గ్రంథాలయ భవనం సుమారు రూ 50,000 ల వ్యయంతో స్వయంగా కట్టించి ఆయా సంస్థలకు బహూకరించిన గ్రామ పంచాయితీ అధ్యక్షురాలు శ్రీమతి తుమ్మల బసవ పూర్ణమ్మ, వారి భర్త గ్రామ మునసబు శ్రీ తుమ్మల గోపాల కృష్ణయ్యగార్ల వదాన్యత ప్రశంసించ తగినది

రివెన్యూ పోరంబోకులు స్వాధీనం చేసికొని వన మహోత్సవ పథకాల క్రింద ఫలసాయాన్నిచ్చే చెట్లు నాటి పెంచబడుతున్నవి. ఘంటసాల గ్రామ పంచాయితీవారు 8 ఎకరాలలో అరటి తోట పెంచుతున్నారు. దీనిమీద రూ. 15,000 ల ఆదాయం రాగలదని అంచనా. అధికాహారోత్పత్తి పథకం క్రింద 20 పంచాయితీలు స్ప్రేయర్లు, డస్టర్లు ఖరీదుచేసి రైతులకు సహాయపడుతున్నాయి. పైరు తెగుళ్ళకు మందులు విల్వచేసి రైతులకు సరఫరా చేసే ఆలోచన ఉన్నది.

1961-62 సంవత్సరానికి ఈ బ్లాకులో మొవ్వ గ్రామ పంచాయితీ ఉత్తమ పంచాయితీగా ఎన్నిక చేయబడి రూ.1,000లు నగదు రూపంగా ప్రైజు యివ్వబడింది. ఈ పోటీలో పాల్గొన్న యితర 8 పంచాయితీలు యించుమించు సమాన స్థాయిలో ఆయా రంగాలలో అభివృద్ధి సాధించినవి

ప్రస్తుతం పూర్వవిస్తరణ గతిలో ఉన్న ఈ బ్లాకు 1963 సంవత్సరంలో పంచాయితీ సమితిగా రూపొందనున్నది. నాన్ బ్లాకుగా ఉన్నప్పుడే సర్వతోముఖాభివృద్ధి చెంది రాణకెక్కిన ఈ బ్లాకు పంచాయితీలు సమితి ఏర్పాటుతో యితోధికదీక్షతో, ఉత్సాహంతో ఆయా గ్రామప్రజలకు సకల సౌకర్యాలూ కలుగజేసి, ఆంధ్రప్రదేశ్‌లో కూచిపూడి పంచాయితీ సమితివి ఉత్తమ సమితిగా రూపొంది పంచాయితీ రాజ్యం ఆచరణలో గ్రామ రాజ్యంగా ఆదర్శప్రాయం అవుతుందనడంలో సందేహం లేదు.



క థా ని క :

# ఆత్మార్పణం

"భరద్వాజ"

చెట్ల తలలమీదుగా ఆకాశం పచ్చబడింది. పలచనిమంచు తెరలు,దివినుండి భువిదాకా, రవసెల్లాలలాగా జీరాడుతున్నాయి. దూరంనుండి కాపాలదారు వేస్తున్న అడుగుల చప్పుడు, మందంగా, బరువుగా, మెత్తగా వినిపిస్తోంది.

మేజర్ నరేంద్ర చిరాగ్గా గుడారంలో అటూ ఇటూ తిరిగాడు. క్షణ క్షణానికీ అతని కళ్ళు ఎర్రబడుతున్నాయి. టోపీతీసి, బల్లమీదికి గిరవాటెట్టాడు. పొట్టిగా ఉన్న జుట్టును బలంగా మెలిపెట్టాడు. రెండు అరచేతులతోనూ ముఖాన్ని రుద్దుకొన్నాడు. ఉత్సాహం పొటమరించడానికి బదులు, అతని కన్నుల్లో నీటి జీరలు మోడులెత్తాయి. జేబులోఉన్న కాగితాన్ని తీసి మరోసారి చదువుకొన్నాడు. పెదవి విరిచి నిట్టూరుస్తూ, దాన్ని తిరిగీ జేబులో ఉంచుకొన్నాడు.

"రాంసింగ్" అని పిలిచాడు నరేంద్ర.

"సార్"

రాంసింగ్ ఉక్కు ముక్కలా లోపలికొచ్చి ఎటెన్‌షన్‌లో నిలబడ్డాడు.

''ఏంచేదామంటావ్?'' అన్నాడు నరేంద్ర

''చెప్పండి!'' అన్నాడు రాంసింగ్.

''సాయంత్రం మన కేంద్రానికీ వర్తమానం చేరింది.'' అన్నాడు నరేంద్ర.

"ఏమిటి సార్ అది?" అన్నాడు రాంసింగ్.

నరేంద్ర ఒకటి రెండు క్షణాలు రాంసింగ్ కళ్ళల్లోకి ఏదో వెదుకుతున్న వాడిలాగా చూశాడు. ఆ తరవాత, జేబులోనించి, నలిగిపోయిన కాగితాన్ని బయటికి తీశాడు. ఈ విషయం రాంసింగ్‌తో చెప్పడమా, మానడమా అని, తటపటాయించాడు. చివరికి చెప్పడానికే నిశ్చయించాడు. ఎందుకంటే, ఈ క్షణాన తను అనుకొన్న ప్లాను నెరవేరాలంటే; రాంసింగ్ ఒక్కడే అందుకు సమర్థుడు.

"ఈ కొండ వరసలకు ఈశాన్యంగా ఓ లోయ ఉంది. ఆ లోయలో చైనా సైనికులు స్థావరం ఏర్పరచుకొన్నారు." అన్నాడు నరేంద్ర.

''అవును. ఆ సంగతి నాకూతెలుసు.'' అన్నాడు రాంసింగ్.

నరేంద్ర సన్నగా నవ్వాడు.

"తెలియదని కాదుభాయీ! విషయం పూర్తిగా వివరించడం కోసం ఇలా ప్రారంభించాను." అన్నాడు నరేంద్ర.

ఓ నిమషం పాటు మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. గుడారం వాకిలిదాకా వచ్చాడు. దూరంగా కాపాలావాని నీడ కదులుతోంది. నరేంద్ర ఓ నిట్టూర్పు విడిచాడు. గిరుక్కున వెనక్కు తిరిగి రాంసింగ్ ముందుకొచ్చాడు.

"ప్రకృతి కూడా మనల్ని పరీక్ష చేస్తున్నదేమో నను కొంటాను రాంసింగ్. మనకు మరో 40 గంటలదాకా సరఫరాలు అందవు. మామూలుగా మనకు సరఫరాలందే మార్గమంతా మంచులో పూఋకుపోయింది. మన విమానాలు ఇప్పటికి నాలు గైదుసార్లు ప్రయత్నించినా లాభం లేకపోయింది. చూస్తున్నావుగా మంచు ముసురు ఎలాపట్టిందో!" అన్నాడు నరేంద్ర.

జేబులోనుండి, పైపు తీశాడు. అగ్గిపెట్టె తీశాడు. పైపు నోట్లో పెట్టుకొన్నాడు.

"సార్!" అన్నాడు రాంసింగ్.

ఏమిటన్నట్లు చూశాడు నరేంద్ర.

"రాత్రిళ్ళు సావగాల్లో ఎవరూ పొగ తాగ కూడదు." అన్నాడు. రాంసింగ్.

నరేంద్ర కిందిపెదవి కొరుక్కొంటూ, పైపును జేబులో పెటుకొన్నాడు. తనలోతనే సంతృప్తిగా నవ్వుకొన్నాడు.

"నాకందిన సమాచారమేమిటంటేభాయీ" అని ప్రారంభించాడు నరేంద్ర. "చైనాస్థావరానికి ఆహార పదార్థాలు, అదనంగా కొన్ని ఆయుధాలు, మరికొంతమంది సైనికులు, రేపు ఉదయానికల్లా సరఫరా అవుతాయి. సుమారుగా మరో రెండుమూడు గంటల్లో వారి లారీలు, సరఫరా డిపోలనుండి బయలుదేరతాయి."

రాంసింగ్ అప్రయత్నంగా, గుడారం మూలకు చూశాడు. మధ్యాహం జరిగిన పోరాటంలో తీవ్రంగా గాయపడిన ముగ్గురు సైనికులు, ఆదమరిచి నిద్రపోతున్నారు ఆహారపదార్థాలున్న సంచులు బోసిగా ఓమూల కుప్పబడిఉన్నాయి. చెడిపోయిన ఆయుధాలు పోగా, మిగిలిన వాటితో, మరో దాడిచేయడం అసంభవం.

"ఇప్పటి మన స్థావరం, చాలా కీలకమైన ప్రదేశంలోఉంది. ఇది శత్రువుల చేతిలోపడితే, మనం దాదాపుగా 30 మైళ్ళు దిగువకు వెళ్ళాలి. మనం రాత్రింబవళ్ళు వేసుకొన్న రెండురోడ్లు వంతెనలు, శత్రు సైనికులకు చిక్కుతాయి." అన్నాడు నరేంద్ర.

మూలగా ముడుచుకు పడుకొన్న గాయపడిన సైనికుడు, మెల్లిగా లేచికూచున్నాడు. మధ్యాహ్నం దాడిలో అతని తొడలోంచి తుపాకీగుండు దూసుకుపోయింది. ఎడంకాలు పర్వతంలాగా వాచిపోయింది. మెల్లిగా వేళ్ళతో కాలును రాచుకొంటూ "వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు." అని గొణిగాడు.

"అలా జరగ్గూడదనే నేనూ ఆశిస్తున్నాను. ఇప్పుడు మనం తీసుకోబోయే చర్యలమీద, మన నిర్ణయాల మీద ఫలితం ఆధారపడి ఉంది. వెసులుబాటుగా ఆలోచించడానికి తగిన వ్యవధి కూడాలేదు. మనం మరో నలభై గంటలపాటు ఈ స్థావరాన్ని నిలబెట్టుకో గలిగితే, శత్రువుల్ని సులభంగా తిప్పికొట్టగలం" అన్నాడు నరేంద్ర.

"మేం దొంగచాటుగా వెళ్ళి, వాళ్ళ స్థావరంమీద పడతాం" అన్నాడు గాయపడిన సైనికుడు.

నరేంద్ర చాలా సంతృప్తిగా నవ్వాడు. "మీ ఉత్సాహం నాకు తెలుసుభాయీ! మీరంత పనిచేయగలరని కూడా నాకు నమ్మకం ఉంది. ఈ స్థితిలో మనం, శత్రువు దాపులోకి వెళ్ళడం క్షేమంకాదు ... తగిన ఆయుధాలు లేకుండా ఓ పద్ధతంటూ లేకుండా శత్రు శిబిరంలోకి దూరడం—అబ్బే నేనొప్పుకోను." అన్నాడు నరేంద్ర.

"సార్" అన్నాడు రాంసింగ్.

నరేంద్ర ఆగిపోయాడు.

"ఆ సరఫరాలు చైనావారికి అందకపోతేనో?" అన్నాడు రాంసింగ్.

"విజయంమందే! రేపటికల్లా మనకు సరఫరాలందుతాయి. శత్రుశిబిరాన్ని గాలిలోకి ఎగరగొట్టగలం." అన్నాడు నరేంద్ర ఉత్సాహంగా. "కానీ దాన్ని, వారి సరఫరాలను, ఎలా అడ్డుకోవడం?"

రాంసింగ్ తలవంచుకొన్నాడు. కాలిబూట్లు నల్లతాబేళ్ళలాగా కనిపించాయి.

"నేను ప్రయత్నం చేస్తాను."

"ఎలా?" అన్నాడు నరేంద్ర.

"వారి సప్లయి డిపో ఎక్కడ ఉందో నాకు తెలీదు." అని గొణుక్కున్నాడు రాంసింగ్.

మిగతా ఇద్దరు సైనికులు లేచి కూచున్నారు. సెంట్రీవచ్చి, వారికి వేడి వేడి 'టీ' ఇచ్చాడు.

నరేంద్ర, గుడారం మూలనుంచి ఓ పెద్ద పఠం తీశాడు. దాన్ని నేలమీద పరిచి, అంచులు చుట్టుకుపోకుండా రాళ్ళు పెట్టాడు.

"మనం ఇప్పుడున్నచోటు ఇదీ" అని వేలితో ఓచోట గుర్తు పెట్టాడు నరేంద్ర. "ఈ కొండల వెనుకనున్న లోయలో శత్రువులున్నారు. ఈ సన్నని గీత, వారి స్వాధీనంలో ఉన్న రోడ్డు."

రాంసింగ్ శ్రద్ధగా ఆ పఠంకేసి చూస్తున్నాడు.

"భాయీ! ఈ క్రాస్ గుర్తు దగ్గర శత్రువుల సరఫరా డిపోఉంది. డిపోకూ, వారి స్థావరానికీ మధ్యగల దూరం, 42 మైళ్ళు; పోతే, 27 వ మైలు దగ్గర, రాత్రి మనవాళ్ళు రోడ్డును నరికేశారు. అప్రక్కనే ఉన్న కొండవాగుమీద బ్రిడ్జీని కూడా మనం పేల్చి వేయగలగాలి. అలా మనంచేస్తే శత్రువులకు సరఫరాలు అందవు" అన్నాడు నరేంద్ర.

రాంసింగ్ కిందిపెదవి కొరుక్కుంటూ ఆలోచించాడు.

"అలాగేసార్!" అన్నాడు రాంసింగ్. "ఆ పని నేను చేస్తాను. నన్ను పంపించండి"

"వెరీగుడ్!" అన్నాడు నరేంద్ర.

రాంసింగ్ కళ్ళు సంతోషంతో మెరిశాయి.

"మనకెక్కువ టైంలేదు. శత్రువుల లారీలు బయలు దేర డానికి తయారవుతూ ఉంటాయి. ఈ లోగా నువ్వు, బ్రిడ్జి దగ్గరకు చేరుకోవాలి బ్రిడ్జిని దాటడానికిముందు, రాత్రి మనవాళ్ళు కొట్టిన గండిని వారి లారీలు దాటవలసి ఉంటుంది. అక్కడ వారికి కొంత ఆలస్యమవుతుంది. ఈ టైంలో మనం అక్కడకు విధిగా చేరితీరాలి." అన్నాడు నరేంద్ర.

"చాలాదూరం, చాలాదూరం" అన్నాడు మెల్లిగా, గాయపడిన మలయాళీ సైనికుడు.

"మామూలు దోవలో వెడితే, ఉదయానిగ్గానా అక్కడికి చేరుకోవడం కష్టమే!" అన్నాడు నరేంద్ర పటంకేసి గుచ్చిగుచ్చి చూస్తూ. "అందుకని మనం అడ్డదారినవెళ్ళాలి. ఈ కొండ దిగంగానే, మైదానంఉంది. నేలంతా మంచు బురదమయం. ఈ మైదానం ప్రక్కగా, చిన్న చిన్న రుప్పలున్నాయి వీటిని దాటాక, రాంసింగ్ వింటున్నావా?" అన్నాడు నరేంద్ర.

"యస్సార్" అన్నాడు రాంసింగ్.

"ఈ పీలం గుర్తులే, మైదానాన్ని అనుకొని ఉన్న కొండల వరస. ఈ కొండ దిగువనే రోడ్డుఉంది. రోడ్డుదాకా వెళ్ళడం సులభమే! ఎత్తయిన చెట్లుచాటున మనం దాక్కోవచ్చు. బ్రిడ్జి ఎక్కడ ఉందనుకొన్నావ్ రాంసింగ్—పెద్దచెట్టు—రోడ్డుమీదికి వంగి ఉంటుంది. దానికి 45 గజాల అవతల బ్రిడ్జి"

రాంసింగ్ ఆ గుర్తులన్నీ నోట్ చేసుకొన్నాడు. మంచు బూట్లువేసుకొన్నాడు. మిత్రులదగ్గర సెలవు తీసుకొన్నాడు.

"బాయీ!"

రాంసిగ్ వెనక్కు తిరిగాడు.

"దురదృష్టం! మన దగ్గర ఒక్కటే చేతిబాంబు ఉంది. దీన్నెంత జాగ్రత్తగా ఉపయోగించవలసిందీ, నీకు తెలుసు. వెళ్ళు. నీ కోసం మేమంతా ఎదురుచూస్తూ ఉంటాం. నీ సాహసం మీద, ఈ ప్రాంతపు భవిష్యత్తు ఆధారపడి ఉంది." అన్నాడు నరేంద్ర.

రాంసింగ్‌ను అతను గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు. మాతుక్షణంలోనే అతను గుడారం నుండి వెలుపలికి వచ్చేశాడు.

నరేంద్ర గాఢంగా నిట్టూర్చాడు, కాపలావాని అడుగుల చప్పుడు, మంచులో కూరుకుపోయి, బోలుగా వినపడుతోంది. మంచుజడి ఇంకా ఎక్కువయింది. అప్పుడప్పుడు, కొండ అవతలి వేపునుంచి, శత్రుసైనికుల కేకలు వినపడుతున్నాయి.

"తోడేళ్ళు, తోడేళ్ళు"

పళ్ళు పటపట లాడించాడు నరేంద్ర. టోపితీసి, జేబు గుడ్డతో మంచునీటిని తుడిచేసి తిరిగి పెట్టుకొన్నాడు. తొడలోనించి తుపాకీ గుండు దూసుకుపోయిన సైనికుడు, కూనువే కునికిపాట్లు పడుతున్నాడు.

వైర్‌లెస్ సెట్ సంకేతాలిచ్చింది.

"ఆఁ" అన్నాడు నరేంద్ర. "నెంబర్ 2076 దట్సాల్"

"వాతావరణం బాగాలేదు. హెలికాప్టర్ ఉదయం గానీ బయలు దేరదు. దట్సాల్"

"మంచిది దట్సాల్ అన్నాడు నరేంద్ర.

"మీరు సురక్షిత ప్రాంతానికి రండి. దట్సాల్"

"లేదు ఈ స్థావరాన్ని విడిచిపెట్టం. ఇంకా కొందరం—చాలా ఆరోగ్యంగా ఉన్నాం. చివరిదాకా పోరాడాలని నిశ్చయించుకొన్నాం. నా సైనికులు ఈ స్థావరాన్ని కాపాడి తీరతామంటున్నారు. దట్సాల్" అన్నాడు నరేంద్ర.

"సరఫరాలు రేపుగానీ అందవు. దట్సాల్"

"మంచిది. వీలుంటే, ఇంకా పెందరాడే పంపించండి. దట్సాల్" అన్నాడు నరేంద్ర.

"విష్‌యు సక్సెస్. దట్సాల్"

నరేంద్ర ఉత్సాహంతో చిన్న చిటిక వేశాడు.

రాంసింగ్ ప్రయాణం అనుకొన్నదానికల్లా భయంకరంగా ఉంది. మంచు ఊబిలో కూరుకుపోయాడు. ఇక బయటపడటం అసంభవమనుకొన్నాడు. క్షణక్షణానికీ, అతను లోనికి దిగజారిపోతున్నాడు. అతని పెనుగులాట వృధా అయిపోతోంది. కోపం, కసి, పట్టుదల, అతన్ని దహించివేస్తున్నాయి. మరో గంటలోగా తను, బ్రిడ్జిని చేరుకోకపోతే, చైనావారికి ఆయుధాలందితీరుతాయి. ఎంతో కీలక స్థావరంలో ఉన్న తన సహచరులందరూ, శత్రువుల దాడిలో చిక్కుబడిపోతారు. ఇప్పుడేమిటి చెయ్యడం?

ఆఖరి ప్రయత్నంగా, రాంసింగ్ ఊపిరి బిగబట్టి, శక్తినంతా పుంజుకొని, ముందుకుసాగాడు. ఏవో పిచ్చి మొక్కలు చేతికి దొరికాయి. వాటిని గట్టిగా పట్టుకొని, మంచులోంచి పైకి వచ్చాడు. శరీరమంతా చలికి కొంగర్లు పోతోంది. ప్రయత్నపూర్వకంగా మంచును దులుపుకున్నాడు. మైదానానికి అడ్డుపడి పరుగెత్తసాగాడు.

"అమ్మయ్య. దగ్గరకొచ్చేశాను. ఇంకెంతో దూరం లేదు" అనుకొన్నాడు రాంసింగ్ రొప్పుతూ

కొంత దిగేటప్పుడు, అతని బూట్లు పగిలిపోయాయి. దాదాపు ఫర్లాంగు దూరం రాళ్ళమీద దొర్లుకుంటూ పడిపోయాడు. దవడకు కోసురాయి తగిలి బద్దలయింది. కాళ్ళు చచ్చుతీపులు పుడుతున్నాయి కళ్ళు మూతలు పడుతున్నాయి. నోటి నుండి రక్తం కారుతోంది. నెత్తురు కారిపోతే, తనకు స్పృహ తప్పుతుందేమో ననుకొన్నాడు రాంసింగ్. బ్రిడ్జిని పేల్చివేశాక ఏం జరిగినా ఫరవాలేదు ఖర్మకాలి ఈలోగా స్పృహతప్పితే?

రాంసింగ్, చొక్కాను చింపి, రక్తం కారకుండా కట్టు కట్టుకొన్నాడు. నడవలేని చోట్ల నేలమీద పాకుతూ వస్తున్నాడు 27 వ మైలురాయి ఇంకెంతో దూరంలో లేదు వంద గజాలు. అక్కడికి వెళ్ళిందాకా, ప్రాణాలుంటే చాలు. ఈ నాగన్నలకు తన మజాకా చూపిస్తాను

రాంసింగ్ చెట్ల మధ్యగా. జెర్రిపోతులా పాకుతున్నాడు మళ్ళీ తీగెలు ముఖాన్ని రక్కి, నెత్తురును రుచి చూస్తున్నాయి. అడివి పురుగులు, బూట్లు లేని కాళ్ళను కరిచేస్తున్నాయి. మరో 80 గజాలు, 70 గజాలు, 60 గజాలు వెడితే–

రాంసింగ్ కొయ్యబారిపోయాడు. కుడి చేతిలో "హాండ్ గ్రెనేడ్" ఉంది. ఎడం చేత్తో కళ్ళముందు మంచుపొగను చెదర గొట్టి రోడ్డుకేసి చూశాడు.

పొడవైన నీడ, రోడ్డుమీద అటూ ఇటూ కదలుతోంది. ఒకటి, రెండు, మూడు, నాలుగు–

రాంసింగ్ లెక్కపెట్టలేకపోయాడు. గత రాత్రి అనుభవాన్ని దృష్టిలో ఉంచుకొని, శత్రువులు, రోడ్డుకు కాపలా పెట్టారన్నమాట!

"కుక్కల కొడకల్లారా:" అనుకొన్నాడు రాంసింగ్.

ఓ నిమిషం పాటు, అతని మెదడంతా మబ్బు కమ్మినట్లయిపోయింది. రోడ్డుమీదనే కాపలా ఉన్నప్పుడు, బ్రిడ్జీ దగ్గర ఇంకా గట్టి కాపలా ఉంటుంది. తనక్కడకు వెళ్ళనూ లేదు. వెళ్ళినా, నిర్ణయించుకున్న పనిని చెయ్యనూ లేదు చావడానికి భయమని కాదు గానీ, నిష్ప్రయోజనంగా చావడం మాత్రం ఎందుకు?

దూరంగా లారీ వస్తున్న చప్పుడయింది.

రాంసింగ్ నరాలు గొల్లుమని గోలపెట్టాయి. పోటెత్తిపోతున్న దవడను భుజానికి గట్టిగా అదిమిపట్టాడు. మెల్లిగా, చాలా మెల్లిగా, రోడ్డుకేసి పాకుతూ వస్తున్నాడు. రోడ్డుమీద రొద పెట్టుకొంటూ లారీ కూడా వస్తోంది. ఎన్ని లారీలు? ఒకటి, రెండు, మూడు... అవును మూడు లారీలొస్తున్నాయి. ఈ లారీల్లో శత్రువుల ఆయుధాలున్నాయి. ఈ ఆయుధాలు, తన సహచరుల్ని చూపుమాపుతాయి. తన దేశ సరిహద్దును ఆక్రమించుకొంటాయి. ఇవి చేరకూడదు, చేరకూడదు, ముమ్మాటికీ చేరకూడదు.

రాంసింగ్, రోడ్డుకు మూడు నాలుగు అడుగుల దూరంలో కొచ్చాడు ముళ్లపొద వెనక దాక్కున్నాడు. అతనికి 10 గజాల దూరంలో శత్రువులు 50 గజాల దూరంలో లారీలు. గ్రెనేడ్ ఉన్న చేతిని కదిలించాడు. కదిలించాడా? లేదా? మొద్దుబారిన చేయి కదిలిందీ లేందీ కూడా తెలియడం లేదు. విసరడంలో గురితప్పితే తన సర్వ ప్రయత్నాలు నాశనమయిపోతాయి. తన సహచరులు ధ్వంసమయిపోతారు. తన దేశంలో శత్రువు కాలు పెడతాడు.

కాబట్టి?

లారీ ఎంతో దూరంలో లేదు. 40 గజాలు, 30 గజాలు, 25 గజాలు, 20 గజాలు, 15 గజాల దూరంలో ఉంది. కాపలా సైనికులు, ఉత్సాహంగా కేకలు పెడుతున్నారు. లారీ దీపాలు, రాక్షస నేత్రల్లా కనిపించాయి రాంసింగ్‌కు. లారీ 10 గజాల దూరంలో కొచ్చింది కొండచిలువలా రోడ్డును మింగుతూ ముందుకొస్తోంది అయిదు గజాల దూరం. ఖచ్చితంగా అయిదు గజాల దూరంలో ఉంది లారీ! రాంసింగ్ శక్తినంతా పుంజుకొన్నాడు. 43 కోట్ల మంది జనసత్వాలన్నీ ఆ క్షణాన రాంసింగ్‌లో పుంజీభవించాయి. చేతిబాంబును గుండెలమీద పెట్టుకొని లారీ ముందుకు దూకాడు లారీ చక్రం అతన్ని చిదిమివేసిన క్షణంలోనే కొండ చరియలన్నీ ప్రతిధ్వనించే లాగా లారీ పేలిపోయింది. కాని శకటాలు, ఎర్రని మంటల్లో కావురెత్తిన ఆకాశాన, గిలగిల లాడి, మంచులో కూరుకుపోయాయి...

మేజర్ నరేంద్ర తన సహచరుని కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తున్నాడు. రాంసింగ్ రాలేదు. శత్రువులకు సరఫరాలూ లేవు. * * *



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు జిల్లా

### ప్రజల విరాళం:

గ్రామీణ రోడ్ల అభివృద్ధి సహకార పథకం క్రింద ఈ జిల్లాలో రూ 51,518 20 ల వ్యయంతో నాలుగు పనులను పూర్తి చేశారు ఈ మొత్తంలో గ్రాంట్లు రూ. 40,858. ప్రజల విరాళాలు రూ 10,659.

## అనంతపురం జిల్లా

### నూతన పాఠశాల భవనం:

కుడేరు బ్లాకులోని అలమూరు గ్రామంలో క్రొత్తగా నిర్మించిన పాఠశాల భవనానికి అక్టోబరు 15 వ తేదీన జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

రాయదుర్గం బ్లాకు సిబ్బంది అక్టోబరు 2 వ తేదీన రాయదుర్గం హరిజనవాడలో జాతీయ పారిశుధ్య దినోత్సవం జరిపారు ఆ సందర్భంలో వారు పారిశుధ్య దినోత్సవ ప్రాముఖ్యతను గురించి గ్రామస్థులకు చెప్పారు.

## కడప జిల్లా

### సంగీత, నాటక పోటీలు:

కడప జిల్లా సంగీత, నాటక పోటీలు శ్రీ రామకృష్ణ ఉన్నత పాఠశాలలో అక్టోబరు 3, 4 వ తేదీలలో జిల్లా కలెక్టరు అధ్యక్షతన జరిగాయి. ప్రొద్దుటూరు మునిసిపల్ ఉన్నత పాఠశాల వారు ప్రదర్శించిన "సహకారం" అనే నాటకానికి ప్రథమ బహుమతీ, కడప మునిసిపల్ ఉన్నత పాఠశాల వారు ప్రదర్శించిన "ముందడుగు" అనే నాటకానికి ద్వితీయ బహుమతీ లభించాయి.

## తూర్పుగోదావరి జిల్లా

### విజ్ఞాన పర్యటన:

ప్రత్తిపాడు బ్లాకు ప్రాంతానికి చెందిన 40 మంది పురోగాములైన రైతులు, పంచాయతీల అధ్యక్షులు కలిసి అక్టోబరు 15 నుంచి 27 వరకు 13 రోజులపాటు విజ్ఞాన పర్యటన జరిపారు. విజయవాడ ఆకాశవాణి కేంద్రం, అమరావతి పురావస్తు ప్రదర్శనశాల, బాపట్ల వ్యవసాయ కళాశాల, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, శ్రీశైలం, నాగార్జునసాగర్ ప్రాజెక్టు, గోలకొండ కోట, రాజేంద్రనగర్ వ్యవసాయ క్షేత్రం మొదలైన ప్రదేశాలను వారు సందర్శించారు

## గుంటూరు జిల్లా

### చలన చిత్ర ప్రదర్శనం:

తాడికొండ (పంచాయతీ సమితి) లో అక్టోబరు నెలలో పంచవర్ష ప్రణాళికపై చలనచిత్రం ప్రదర్శించారు. పంచవర్ష

ప్రణాళికలు, సమాజాభివృద్ధి కార్యక్రమాల ప్రాముఖ్యతను ఈ సందర్భంలో గ్రామస్థులకు వివరించారు.

## హైద్రాబాదు జిల్లా

**చిన్న మొత్తాల పొదుపు:**

అక్టోబరు 25 వ తేదీన జరిగిన రాజేంద్రనగర్ పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశంలో చిన్న మొత్తాల పొదుపు పథకానికి విరివిగా మొత్తాలను సేకరించవలసిన అవశ్యకతను పేర్కొంటూ ప్రత్యేకంగా ఒక తీర్మానం చేశారు.

## కరీంనగరం జిల్లా

**మంచినీటి బావులు:**

మంథెని పంచాయతీ సమితి ప్రత్యేక సమావేశం అక్టోబరు 29 వ తేదీన జరిగింది. హరిజనవాడలలో 8 బావులతో సహా 18 మంచినీటి బావులు త్రవ్వటానికీ, అంతర్గత రోడ్లు నిర్మించటానికీ ఈ సమావేశంలో మంజూరు చేశారు.

## ఖమ్మం జిల్లా

**జాతీయ రక్షణ నిధికి విరాళం:**

పాలేరు పంచాయతీ సమితిలోని గట్టుసింగారం గ్రామ ప్రజలు జాతీయ రక్షణ నిధికి రూ. 101 ల విరాళం సమర్పించారు. పంచాయతీ సభ్యులు, విద్యార్థులు విరాళాల సేకరణకు అధికంగా తోడ్పడ్డారు. కల్లూరు సమితిలోని కిష్టారం గ్రామ ప్రజలు జాతీయ రక్షణనిధి కొరకు రూ. 1724 ల మేరకు విరాళాలు సేకరించారు.

**పరిశీలక బృందం పర్యటన:**

పంచాయతీ రాజ్య ఆర్థిక విషయాలకు సంబంధించిన పరిశీలక బృందం అక్టోబరు రెండవవారంలో పాల్వంచ, జుల్లూరుపాడు, లంకపల్లి పంచాయతీలను సందర్శించారు. వీరు ఖమ్మంలో జిల్లా పరిషత్తు, సమితుల అధ్యక్షులను కలుసుకున్నారు. శ్రీ కె. సంతానం ఈ బృందం నాయకులు.

## కృష్ణా జిల్లా

**మధ్యాహ్న భోజన పథకం:**

బంటుమిల్లి పంచాయతీ సమితిలోని 14 గ్రామాలలో ఈ నెలలో "కేర్" సంస్థ సహకారంతో మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రవేశపెట్టారు.

**సంక్షేమ నిధి భవనం:**

కృష్ణా జిల్లా సంక్షేమనిధి సంఘం నిమిత్తమై రూ. 40,000 ల వ్యయంతో నిర్మించిన భవనానికి అక్టోబరు 22 వ తేదీన రాష్ట్ర ఆరోగ్య శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సంక్షేమ నిధి రాఫిల్ టిక్కెట్ల అమ్మకం ద్వారా సేకరించిన కృష్ణా జిల్లా సంక్షేమ నిధి కోటా మొత్తంతో ఈ భవనాన్ని నిర్మించారు.

**మిల్లు యజమానుల సంఘం:**

కృష్ణా జిల్లా బియ్యం, నూనె మిల్లుల యజమానుల సంఘానికై విజయవాడలో నిర్మించిన భవనానికి అక్టోబరు 11 వ తేదీన ఆరోగ్య శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## మహబూబ్‌నగరం జిల్లా

**సమితి సభ్యుల దాతృత్వం:**

గద్వాల పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశం అక్టోబరు 30 వ తేదీన జరిగింది. సమావేశానికి హాజరైనందుకు తమకు లభించే బత్తెంలో ఒక రోజు మొత్తాన్ని జాతీయ రక్షణ నిధికి విరాళంగా ఇవ్వటానికి ఈ సమావేశంలో సభ్యులు తీర్మానించారు.

**సమితి అధ్యక్షుని ఆదర్శం:**

సమితి అధ్యక్షుడు అక్టోబరు నెలకుగాను తనకు లభించే గౌరవ వేతనాన్ని జాతీయ రక్షణ నిధికి విరాళంగా సమర్పించారు. సమితి సిబ్బంది ఒక రోజు జీతాన్ని విరాళంగా ఇచ్చారు.

## మెదక్ జిల్లా

**పశు ప్రదర్శనం:**

అక్టోబరు నెలలో పటన్‌చెరులో జరిగిన పశు ప్రదర్శనమ ఆ పంచాయతీ సమితి అధ్యక్షుడు ప్రారంభించారు. ఈ ప్రదర్శనం ఒక రోజు జరిగింది. 500 పశువులను ప్రదర్శనలో వుంచారు. ఉత్తమ పశువులకు బహుమతులు ఇచ్చారు.

## నల్గొండ జిల్లా

**రక్షణ నిధికి విరాళాలు:**

నల్గొండ జిల్లాలో నవంబరు మొదటి వారం వరకు వసూలైన రూ. 10,108 ల మొత్తాన్ని జిల్లా కలెక్టరు జాతీయ రక్షణ నిధికి సమర్పించారు.

**పౌర సంఘం స్థాపన:**

జాతీయ రక్షణ నిధికి సమర్పించే నిమిత్తం భువనగిరిలో వర్తకులనుంచీ, ప్రజాసంస్థలనుంచీ, ఇతరుల నుంచీ రూ. 25,000 లు సేకరించారు. నవంబరు 1 వ తేదీన జరిగిన పౌర సమావేశంలో, భువనగిరి పట్టణ మునిసిపాలిటీ అధ్యక్షతన 24 మంది సభ్యులతో యుద్ధ చర్యల విషయంలో తోడ్పడటానికి ఒక అడ్‌హాక్ కమిటీని ఏర్పరిచారు.

గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం:

సూర్యాపేట పంచాయతీ సమితిలో అక్టోబరు నెలలో ఎండ్లపల్లి గ్రామంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం మూడు రోజుల పాటు నిర్వహించారు. ఆధునిక వ్యవసాయ పద్ధతులు· పశు పోషణ, సహకారం మొదలైన విషయాలలో సహాయకులు శిక్షణపొందారు.

విద్యార్థులచే రోడ్డు నిర్మాణం:

భారత్ సేవక్ సమాజ్ ఆధ్వర్యంలో పెద్దఊర (బ్లాకు)లో అక్టోబరు 17 వ తేదీ నుంచి 10 రోజులపాటు యువజన శిబిరం నిర్వహించబడింది. 50 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ కాలంలో వారు 1000 అడుగుల అంతర్గత రోడ్డు నిర్మించారు. ఈ పని విలువ రూ. 600/–.

నిజామాబాదు జిల్లా

వయోజన విద్యా తరగతులు:

బాన్స్వాడ తాలూకా గ్రామాలన్నింటిలోనూ అక్టోబరు 2 వ తేదీన జాతీయ పారిశుద్ధ్య దినం జరిపారు. అంతేగాక 16 వయోజన విద్యా తరగతులను ప్రారంభించారు.

అడవుల పెంపకం:

బాన్స్వాడ బ్లాకులోని గౌరారం గ్రామాన్ని జిల్లా కలెక్టరు సందర్శించి అభివృద్ధి కార్యకలాపాల పురోగతిని పరిశీలించారు. వెంకటాపురంలో అమలుపరిచిన కనీస అటవీ పెంపక కార్యక్రమాన్ని కూడా ఆయన పరిశీలించారు.

శ్రీకాకుళం జిల్లా

గ్రామ సహాయకుల గోష్ఠి:

సోర్నపేట సమితి కార్యాలయంలో అక్టోబరు 12 వ తేదీన సుశిక్షితులైన గ్రామ సహాయకుల బ్లాకు స్థాయి గోష్ఠి జరిగింది. సుశిక్షితులైన 60 మంది గ్రామ సహాయకులు గోష్ఠిలో పాల్గొన్నారు.

విశాఖపట్నం జిల్లా

జిల్లా పరిషత్తు సమావేశ మందిరం:

జిల్లా పరిషత్తు సమావేశ మందిరానికి రాష్ట్ర ముఖ్యమంత్రి విశాఖపట్నంలో అక్టోబరు 20 వ తేదీన శంకుస్థాపన చేశారు.

వరంగల్ జిల్లా

వైద్య కళాశాల భవనానికి ప్రారంభోత్సవం:

కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రి అక్టోబరు 10 వ తేదీన వరంగల్‌లో కాకతీయ వైద్య కళాశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. రూ.35 లక్షలవ్యయంతో ఈ కళాశాలకు శాశ్వత భవనాల నిర్మాణం జరుగుతున్నది.

శిక్షణ శిబిరం:

ఘనపూర్ బ్లాకు తాటికొండ గ్రామంలో అక్టోబరు 21వ తేదీనుంచి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించారు. ఆ సందర్భంలో వ్యవసాయ విషయాలలో ప్రత్యక్ష ప్రదర్శనలను ఏర్పాటు చేశారు.

కొత్త పూర్వ విస్తరణ కేంద్రం:

మడికొండ పూర్వవిస్తరణ కేంద్రానికి అక్టోబరు 17వతేదీన ప్రణాళిక పంచాయతీ రాజ్యశాఖలమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

కళాశాల భవనానికి ప్రారంభోత్సవం:

కేంద్ర శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి వరంగల్ ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాల హాస్టలు భవనం, కళాశాల భవనాలకు నవంబరు 7వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో కళాశాల విద్యార్థులు, సిబ్బంది తరపున జాతీయ రక్షణనిధి నిమిత్తం ముఖ్యమంత్రికి రూ. 5,001 లచెక్కు సమర్పించారు.

గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం:

పరకాల బ్లాకులోని కౌకొండ గ్రామంలో అక్టోబరు 22వ తేదీనుంచి మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించారు. 50మంది సహాయకులు శిక్షణ పొందారు.

కొత్త తరగతి ప్రారంభం:

నడికూడు గ్రామ పాఠశాలలో అక్టోబరు 7వ తేదీన ప్రణాళిక, పంచాయతీరాజ్య శాఖలమంత్రి 6వ తరగతికి ప్రారంభోత్సవం చేశారు.

లోకసహాయక్ శిబిరం:

అక్టోబరు 15వ తేదీన జిల్లా కలెక్టరు మహబూబాబాదులో లోకసహాయక సేవా శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. 525 మంది శిక్షితులు పాల్గొన్నారు. ఉత్తమ శిక్షితుడుగా నిర్ణయించబడిన వ్యక్తిని వచ్చే సంవత్సరం రిపబ్లిక్ దినోత్సవ పెరేడులో పాల్గొనటానికై న్యూఢిల్లీకి పంపుతారు.

* * *

# కృష్ణవేణి మణిమేఖల

[విజయ వాటికలోని ప్రకాశం బేరేజి గురించి]

బృందగానం— వందనం! అభివందనం!
అందుకొనుమీ కృష్ణవేణీ!
సాగరేశ్వర మనోహారిణి!
అగమోన్నత పథవిహారిణి!!
గౌతమీ ప్రియ సోదరీ! నవ
జాతిరత్న మయోదరీ!!
పావనీ! సకలాంధ్రజనసం
సేవితోత్తమ వాహినీ!!
కనకదుర్గ కటాక్షకరుణా
ఘనరసాంచిత జీవనీ!!

స్వరం: భారత దేశంలోని పన్నెండు పుష్కర నదుల్లోనూ కృష్ణానది వొకటి. ఆంధ్ర ప్రదేశంలో గోదావరి తరవాత పెద్దది కృష్ణవేణి. పడమటి కనుమల్లో పుట్టింది. ఆంధ్ర కర్ణాటక మహారాష్ట్ర సీమల్లో ప్రవహిస్తూ తూర్పు సముద్రాన్ని వరించి, సగర్వంగా సంతోషిస్తుంది—

కృష్ణ: ఓ మనోహరా! సాగరేశ్వరా! ప్రేమసుమాంజలి
చేకొనుమా!
తుంగభద్ర నాసోదరితో పొంగుచువచ్చితి నీదరికీ!!
నా తటసీమలు పావనమైనవి—ఖ్యాతిగన్నవి చరిత్రలో!
నాప్రజలందరు వీరవరులుగా సుప్రసిద్ధులీ ధరిత్రిలో!!
తరుణోపాయము లాంధ్రజనాళికి పరమేశాలయ
జాలములూ!
అమరావతి నాగార్జునశైలము విమలారామ సహస్ర
ములూ!!

స్వరం: కృష్ణవేణి జీవనది. జన్మస్థానమైన సహ్యాపర్వతం నుంచి, గమ్యస్థానమైన హంసలదీవివరకూ 775 మైళ్ళు ప్రయాణిస్తుంది. భీమ, కౌశికి, మలాప, ఘటప్రభ, కకుద్మతి, విశాల, వైష్ణవి, కుముద, నారాయణి, మూసి, తుంగభద్ర మొదలైన వాగులనూ ఏరులనూ తనలో కలుపుకుని, పొంగుతూ పరవళ్లు త్రొక్కుతూ వచ్చే కృష్ణానదిని చూసేసరికి ప్రజలకు భక్తితో పాటు భయంకూడా కలిగేది. వందల యేళ్ల క్రితం—

బృంద: ఉవ్వెత్తుగా పొంగులెత్తె నీమేరూ!
ఊరూరు ముంచెత్తు—మాకేది దారీ?
పసిపాపలున్నారు—ముసలివారున్నారు—
పసువులున్నా—యన్ని గంగపాలేనా?
బంగారు పంటతో పొంగారు మాచేలు—
సింగారమౌతోట—లయ్యో పాడై పోవు!
చేయెత్తి మ్రొక్కుతా మోతల్లి కృష్ణా!
హాయిగ్లనూ గుల్ల చేయకమ్మా!

స్వరం: పెద్దపెద్ద వరదలుగావచ్చి ఆదరినీ ఈదరినీ ముంచెత్తేది కృష్ణానది. పంటలుపాడై కరువులూ కాటకాలూ చెలరేగేవి. అప్పుడు మేజర్ బీట్సన్ కృష్ణానదిని చూశాడు. ఆ నీరంతా సముద్రంలో కలసిపోవడం చూశాడు—

బీట్సన్: ఓహో కృష్ణా! ఓహోహో!
కోహినూరుకీ మాతృమూర్తి వీ!!
అలనాగార్జును డవతరించెగా
ఇలలో నీవర తీరములో!
ఆంధ్రరాజ్య నిర్మాణము చేసిన
ఆంధ్రవిష్ణువూ నీ సుపుత్రుడే
పావనమ్మ నీ జీవనమ్ములో
కావనమ్ముగా జేయుమమ్మా!
కరుణి వుము కృష్ణాతరంగిణీ!
శరణాగతు లీప్రజలమ్మా!

స్వరం: 150 ఏళ్ల క్రితం మేజర్ బీట్సన్ కృష్ణానదికి ఆనకట్ట వేయించాలనుకున్నాడు; కాని, ఆయనమాట సాగలేదు. ఆ

తరువాత, 1832 లో పెద్ద కరువు వచ్చిపడింది. తిండిలేక ప్రజలు మాడిపోయారు; వేలకొలదీ పశువులు కూలిపోయాయి. తెలుగునాడంతా గగ్గోలెత్తిపోయింది

బృంద : కరువులోన బ్రతుకలేము–విరు పేదలమూ!
ఏరులందు వాగులందు నీటిలేదు చుక్కయేని–
మా పొలాల పంటలన్ని మాడిపోయె నయ్యయో!
తిండిలేక వేసటువే లెండిపోవుచుండిరీ!
ఇంకిపోయె చెరువులూ–ఇంకిపోయె దొరువులూ!
అన్నమోయి రామచంద్ర యంచునేడ్తు రీజనం!

స్వరం: ఆ గోల విన్నారు పరిపాలకులు. కృష్ణానదికి ఆనకట్ట కడితే కొన్నిలక్షల యెకరాలపొలాలు పండుతాయనీ, కరువులుండవనీ తెలుసుకున్నారు. గోదావరీనదికి ఆనకట్టకట్టిన సర్ ఆర్థర్ కాటనే కృష్ణానది ఆనకట్టకు డిజైన్ వేశాడు. కెప్టెన్ ఆర్ అనే ఇంజనీర్ 1852 లో ఆనకట్ట ప్రారంభించి 1855 లో పూర్తిచేశాడు. రెండుకోట్ల రూపాయిలు ఖర్చయింది. పంటకాలువలద్వారా సుమారు ఆరు లక్షల యెకరాలు సాగులోకి వచ్చాయి. ఆ పంటలను చూసి ప్రజలు మురిసిపోయారు. మెరిసిపోతున్న కన్నులతో చూసి, కృష్ణవేణమ్మ తెలుగువారిని దీవించింది.

కృష్ణ: ఆంధ్రభూమికీ అభ్యుదయం!
ఆంధ్రజాతికీ శుభకాలం!!
పావనములు లోకావనములు నా
జీవనములు ఆధారముగా–
చేలు నిండుగా పంట పండగా
శ్రీలు చేరు సౌఖ్యాలు తీరునూ!
కరువుండదు మీ దేశములో!
బికివుండదు మీ జీవితములలో!
పాడితోడ మేలైనపంటతో
వాడవాడ సొంపారు నింపుగా!!

స్వరం: ఆ యానకట్టవల్ల సుమారు ఆరులక్షలయెకరాలు సాగులోకి వచ్చాయి. క్రమక్రమంగా ఆయకట్టు పెరిగింది. దానికోసం ఆనకట్టమీద షట్టర్లు ఏర్పాటు చేశారు. వాటియెత్తు క్రమక్రమంగా 6 అడుగులు పెంచారు. అప్పుడు ఆయకట్టు ఎది లక్షల యెకరాల వరకూ పెరిగింది. కాలువలలో నీరు ఎంతటికి చాలలేదు. ప్రభుత్వం వారు (మనకు స్వాతంత్ర్యం వచ్చాక) కొత్త ఆనకట్ట కట్టాలనుకుంటూండగా, 1952 లో కృష్ణానదికి హఠాత్తుగా పెద్ద వరద వచ్చింది. ఆనకట్టలో గండిపడింది. పంట కాలవల్లోకి నీరెక్కలేదు. ప్రజలు గగ్గోలు పడ్డారు–

కవి. ఉ|| కాలువలందు నీరు సరిగా ప్రవహించుట లేదు; లేదయో
చేలకు నీరు; మే మెటుల చేయుదుమో వ్యవసాయ మింక? ఏ
లీల శ్రమించిననే కృషిఫలించుట కష్టమటంచుతోచు; మ
మ్మేలెడువారు–ఇక్కట్టులనెల్ల హరించెడువార లెవ్వరో?

స్వరం విజయవాడలో పి. డబిల్యు. డి. సూపరింటెండింగ్ ఇంజనీర్ వేపా కృష్ణమూర్తిగారు పాడైన ఆనకట్టను చూశారు; వాడిపోతూన్న పంట మొలకలను చూశారు. ఆనకట్టలో పడిన గండిని పూడ్చాలని సంకల్పించారు. 1952 సెప్టెంబర్ 6 వ తేదీని, ప్రొద్దు క్రుంకుతూన్న సమయంలో మరికొందరింజనీర్లతో కలిసి కృష్ణమూర్తిగారు గండి పూడ్చడానికి వెళ్లారు. విధి వ్యతిరేకించింది. కృష్ణవేణి ఉద్ధృతంగా ప్రవహించింది. పడవలు తల్లక్రిందైనాయి. ఆ త్యాగశీలి, ప్రతిభాశాలి, వేపా కృష్ణమూర్తిగారు, బలైపోయారు–

బృంద : ఓతల్లి కృష్ణవేణీ! నీ పుత్రు
లీతీరుగా పోయిరా?
దేశభక్తులు వారు–త్యాగమూర్తులు వారు–
ఆశాశలా పేరు ప్రఖ్యాతులందారు!
పాడిపంటా పెంపగా–యత్నించి
వీడిరే ప్రాణమ్ములూ?
నీవేగ మాపగా జాలువారెవ్వారు?
నీవె మాపై జాలినొంది కాపాడుమా!

స్వరం: ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులుగారు దేశ దైన్యాన్ని నివారించడానికి సంకల్పించారు. పంటకాలువలలోకి నీరెక్కువగా పోవాలంటే, ఇంకా యెత్తైన ఆనకట్ట కావాలి. అందుకోసం కొత్త బేరేజ్ కట్టాలనీ, దానిమీద రహదారీకూడా వేయాలనీ ఆంధ్ర ప్రభుత్వం నిశ్చయించారు. 1954 ఫిబ్రవరి 13 వ తేదీని కొత్త ఆనకట్టకూ దానిమీద రాచబాటకూ ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రకాశంపంతులుగారు ప్రారంభోత్సవం చేశారు. ఆ మహోత్సవానికి ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. ప్రజల ఆనందానికి మేరలేదు.

బృంద . చూడరె మన కృష్ణా నదినీ!
నేడు వింతగా తోచునదే!!

తన జీవన మీ లోకము కోసము
వినియోగమ్మగు నని సంతోసము ।
జనులందరి కానందకరముగా–
ఘనవాహినిగా ప్రవహించుగదా ।
ఇంద్రకీల శైలముపై కొలువౌ
అంబ దుర్గ పాదాల నంటుచూ ...

స్వరం కృష్ణానదిమీద బేరేజీ రోడ్ బ్రిడ్జీ కట్టడం మొదలుపెట్టి, చురుకుగా పని సాగించారు అంచనా వేసినదాని కన్నా తక్కువ ఖర్చుతో, అనుకున్నదానికన్నా ముందుగానే, ఆనకట్ట వంతెనలు పూర్తయినాయి. రెండు కోట్ల డబ్భైయ్యేదు రూపాయిలు మొత్తం ఖర్చయింది. భారతదేశం స్వతంత్రమైన తరవాత నిర్మించిన వారధుల్లోకెల్లా ఇదే పెద్దది ఇటువంటి గొప్ప పనులు తలపెట్టినప్పుడు విదేశాలనుంచి పెద్దఇంజనీర్లను పిలిపించి వారి సలహాలు తీసుకోవడం మామూలు. కాని ఈ యానకట్ట వంతెనలను ఊహించినవారూ నిర్మించినవారూ అందరూ స్థానికంగా వున్న ఇంజనీర్లే। పనివారు కూడా ఉల్లాసంగా ఉత్సాహంతో పేచీల్లేకుండా సహకరించి, దీక్షగా పాటుపడ్డారు

కవి సీ॥ సీతానగరమందు చెన్నూరు నౌకమంచి
వర్కుషాప్, పబ్లిక్కు వర్క్సు వారి
యాజమాన్యమ్ములో అద్భుతయానైన
వుక్కు తల్పులు గట్టి వుత్తమములు;
ఇనుప వస్తువులన్ని ఘనముగా నచటనే
పనివారు మనవారె యొనర జేసి
నారు, బేరేజంత భారతీయమ్మౌట
సారమ్ముగా గర్వ కారణమ్ము;
ముప్పదేడువందలపైన ముప్పదారు
అడుగు లా పెద్ద బేరేజి పొడుగు, రెండు
వంకలా కాలిబాట లొప్పార, దారి
వెడల పదియు ముప్పది నాలు గడుగులంట।

స్వరం: అదే ప్రకాశం బేరేజ్. 1957 డిసెంబర్ 24 వ తేదీని కృష్ణానదిపై నిర్మించిన వారధికి ప్రారంభోత్సవం చేస్తూ నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు దానికి ప్రకాశం బేరేజి అని నామకరణం చేశారు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు భారతదేశానికీ, ఆంధ్రప్రదేశానికీ చేసిన సేవకు చిహ్నంగా దానికి ప్రకాశం బేరేజ్ అని పేరు పెట్టారు. దీనివల్ల మరొక లక్ష యెకరాలకు పైగా సాగులోకి వస్తాయి మాగాణీ పొలాలుగావున్న పదకొండులక్షల యెకరాల నేలంతా సమృద్ధిగా నీరందుతుంది. పంటల కింక ఎట్టి లోటూ వుండదు. కరువులూ, కాటకాలూ దరిజేరవు. ఇదివరకున్న ఆనకట్టకు కొంచెం ఎగువగా ఇది నిర్మించబడి– ప్రతి రాత్రి విద్యుద్దీపతోరణాలతో అలంకరింపబడి సుందరతరంగా వుంటుంది చీలికలు పోయి. దేశంలో అందరూ కలిసిపోయి హాయిగా బ్రతకాలని పెద్దలంటున్నారు. వారి దివ్యాదర్శాలకు నిదర్శనంగా ఉత్తర దక్షిణ పథాలను ఏకం చేసింది ప్రకాశం బేరేజ్। కృష్ణానదికి సుందరమైన అలంకారం. కృష్ణవేణికి ఉజ్వలమైన మణిమేఖలగా కలకాలం ప్రకాశిస్తుంది ప్రకాశం బేరేజ్

బృంద ఓహో మహనీయమూ ।
కృష్ణవేణి మణిమేఖల ॥
మానవశక్తికి చిహ్నము ।
మా నవజాతికి భాగ్యము ॥
ఉత్తర దక్షిణ పథాల
కుత్తమమౌ సేతువూ ।
కర్షకాంధ్రలోకానికి
హర్షహేతువూ ॥
భారత దేశాభ్యున్నతి
సారమైన సేతువూ ।
సర్వ శిల్పవేత్తలకూ
గర్వహేతువూ ॥

వింజమూరి శివరామరావు



# బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు



[ దీనజనబాంధవుడు, నిమ్నజాత్యుద్ధారకుడు సంఘ సంస్కరణ పరాయణుడు అయి బ్రహ్మర్షిగా కీర్తిగడించిన శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి శతవర్ష జయంత్యుత్సవాలు గత అక్టోబరు 27వ తేదీన కాకినాడలో జరిగాయి. ఈ సందర్భంగా ఆబ్కారీ మద్యనిషేధశాఖల మంత్రి శ్రీ యం.ఆర్. అప్పారావుగారు శ్రీ వెంకటరత్నం నాయుడుగారి సర్వతోముఖమైన ప్రతిభను గురించి అత్యుదాత్తమై గంభీరమైన ఉపన్యాసం యిచ్చారు. ఆ ఉపన్యాసాన్ని వ్యాసరూపంగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రకటిస్తున్నాము. ఎడిటర్.]

ఋషులయుగం గతించింది. అయినా సృష్టి వైచిత్ర్యం ఎంత గొప్పదంటే సహాయమనేది అనుకోని దిక్కునుండి లభ్యమౌతూ వుంటుంది—అది దైవికం అనండి, యాదృచ్ఛికం అనండి. బహుముఖ ప్రజ్ఞానిధి, గుణ సంపన్నులు అయిన బ్రహ్మఋషివంటివారు ఈ విశాల భారత చరిత్రలో ఎక్కడా కన్పించరు. అకుంఠిత కార్యదీక్షకు దైవత్వానికి, ఆధ్యాత్మిక చింతనకు పవిత్రతకు, నితరణకు మారుపేరు నాయుడుగారు. ఆయన గొప్ప బోధకుడు, గొప్ప సంస్కర్త, అన్నిటికీ మించి ఆయన బ్రహ్మర్షి. అటువంటి బహుముఖ ప్రజ్ఞాశాలిని మనం ఎక్కడ చూడగలం? నాయుడుగారు 1862 అక్టోబరు ఒకటవ తేదీ మహార్నవమి నాడు మచిలీపట్నంలో జన్మించారు. మచిలీపట్నం కృష్ణా జిల్లాకు ప్రధాన కేంద్రం. నేను ఆ జిల్లాకు చెందినవాడినే. అంతేకాదు, నాయుడుగారు ఏ కళాశాలల్లో విద్యార్థిగాను తదుపరి అధ్యాపకుడుగాను ఉన్నారో వాటిలో చదివే అదృష్టం నాకు కల్గిందని చెప్పుకోటానికి నేను ఎంతగానో సంతోషిస్తున్నాను. మద్రాస్ క్రైస్తవ కళాశాలలో రెండు సంవత్సరాలూ, నోబుల్ కళాశాలలో రెండు సంవత్సరాలూ నేను చదవడం నా భాగ్యం. మన దేశపు విద్యారంగంలో ప్రముఖ పాత్ర వహించిన ఈ రెండు కళాశాలల్లోను నేను చదవటం వల్ల గురుదేవునితో ఆ విధంగా నా సన్నిహిత సంబంధాన్ని వ్యక్తపరచుకోగల్గుతున్నాను. క్రైస్తవ కళాశాల ఎందరో మహామహులను ఉద్భవింపచేసింది. వారిలో డా॥ సి. ఆర్. రెడ్డిగారు ఒకరు. నాయుడుగారి తండ్రి, తాత మదరాసు ఆర్మీలో పని చేశారు. సైనికులుగా వారి కుటుంబం, విశ్వాసానికి నిజాయితీకి ధైర్య సాహసాలకు పేరొందినది. మహర్షి తాతగారైనా రఘుపతి వెంకటరత్నంగారు అందరు తాతలకు వలెనే తన మనుమని ఎంతో ప్రేమతో చూచేవారు. మన వెంకటరత్నం నాయుడుగారిని పుత్రునిగా పొందే మహద్భాగ్యం సుబేదారు అప్పయ్యనాయుడుగారికి కలిగింది. అప్పయ్య నాయుడుగారు మిలిటరీ అధికారి. ఎంతో నిరాడంబరులు, నిజాయితీపరులు, దైవభక్తి కలవారు. వైష్ణవ తత్వ బోధకులైన రామానుజులవారి మతానికి చెందినవారీయన. గురుదేవుని మాతృమూర్తి శేషమ్మగారు—విష్ణుభక్తి తత్పరురాలు. కుటుంబాన్ని చక్కదిద్దుకోవడంలో అసాధారణ ప్రజ్ఞాపాటవాన్ని ప్రదర్శించేది ఆమె. ఆమెలో భారత నారికుండవలసిన అత్యుత్తమ గుణగణాలన్నీ ఉన్నాయి. ఆమె

సత్కరించేది. మహమ్మదీయ సాధువుల గోరీ కనబడితే చాలు, ఆమె బండి దిగి గోరీకి మొక్కేది. పరాయి మతానికి చెందిన ప్రవక్తలను ఎందుకు మొక్కుతారంటే "పవిత్రుడైన మానవుని కుల మతాలను గురించి అడగవలసిన అవసరం ఏముంది" అనేది ఆమె. నాయుడుగారిమీద తండ్రిగారి కంటే తల్లిగారి ప్రభావమే ఎక్కువ పడింది. నాయుడుగారిని పన్నెండేళ్ళప్పుడు స్కూలులో వేశారు. ఉత్తరప్రదేశ్ లోని బందా జిల్లా ఉన్నతపాఠశాలలో మొదటిసారిగా ప్రవేశించారు. అక్కడే ఆయన పర్షియన్, ఉర్దూ, హిందుస్తానీ నేర్చుకున్నారు. అక్కడ చదువుతూ వుండగానే అనూచానంగా వస్తూవున్న పూజా పునస్కారాల మీద ఆయనకు సందేహాలు ఏర్పడజొచ్చాయి. ఏకేశ్వరోపాసనను ప్రబోధించే పర్షియన్ పద్యాలు ఆయనను ఎంతగానో ఆకర్షించాయి. క్రమ క్రమేణా ఆయన భగవంతుడు ఒక్కడే అనీ, ఆయనే లోకేశ్వరుడనీ నమ్మసాగారు. తండ్రి అప్పయ్య నాయుడుగారికి హైదరాబాదు బదిలీ కాగా నాయుడుగారు చదువు చాదరుఘాటులోఉన్న నిజాం ఉన్నత పాఠశాలలో కొనసాగించడంజరిగింది. అప్పుడు అక్కడ పనిచేస్తున్న సరోజినీనాయుడు తండ్రి డా॥ అఘోరనాథచటోపాధ్యాయగారివద్ద విద్యనభ్యసించారు. ఆ విధంగా నాయుడుగారికీ హైదరాబాదుకూ సన్నిహితసంబంధం ఏర్పడింది. ఆ తర్వాత ఆయన మదరాసు క్రైస్తవ కళాశాలలో చేరారు. అప్పుడు ఆ కళాశాలకు మదరాసు క్రైస్తవ కళాశాల వ్యవస్థాపకులు, నవ భారత విద్యావేత్త అయిన డా॥ మిల్లరు ప్రిన్సిపాలుగా వుండే



రచన :

యం. ఆర్. అప్పారావు

నేమి ప్రతిభావంతులుగా ఉండేవారు. ఈయన పట్ల డా॥ మిల్లరు ప్రత్యేక శ్రద్ధ వహిస్తూ వుండేవారు. వెంకటరత్నం నాయుడుగారికి కార్లయిల్, టెన్నిసన్, వర్డ్స్‌వర్త్, బ్రౌనింగు, షేక్స్పియరు మొదలైనవారంటే ప్రత్యేక అభిమానం. ఆయన ఎం.ఏ. డిగ్రీ కోసం మిల్టన్ వ్రాసిన పేరడైజ్ రీగేయిన్డ్ మీద థీసెస్ తయారుచేశారు. ఈ వ్యాసాన్ని పరీక్షకులు ఎంతో ప్రశంసించారు. ఆయన 1886 లో పట్టభద్రులయ్యారు. డా॥ మిల్లరును ఆయన ప్రధానాచార్యులుగా భావించారు. నాయుడుగారు మేధా సంపన్నులు. తోటి విద్యార్థులకు చదువు సంధ్యలలో తోడ్పడుతూ వుండేవారు. మిత్రుడికి జబ్బు చేసిందంటే తన ప్రాణాన్నయినా లెక్కచేయకుండా ఆ మిత్రుడికి సహాయపడేవారు. అంటువ్యాధులు సోకి తన మిత్రులు బాధపడుతూ వుంటే, ఆయన జడిసేవారు కాదు. తాను విద్యార్థిగా ఉన్న రోజులలో అవసరమున్నవారికి సహాయపడేవారు. అంతేకాదు స్కూలు ఫీజు కూడ తనే కట్టేవారు.

ఇంతకుముందు చెప్పినట్లుగా భగవంతుడు ఒక్కడేననీ ఆయనే లోకేశ్వరుడనీ ప్రబోధించే సూఫీ సిద్ధాంతం పట్ల ఆయనకు మక్కువ ఉండేది. ఆయన స్కూలులో చదువుకుంటున్న రోజులలో రాజారామమోహనరాయి పేరు మొదటిసారిగా విన్నారు. విగ్రహారాధన వ్యతిరేకిస్తూ ఆయన చేసిన బోధనలను తెలుసుకున్నారాయన. సాధారణ బ్రహ్మ సమాజ నాయకుడు పండిత శివానందశాస్త్రిగారి బోధనల వల్ల నాయుడుగారికి బ్రహ్మ సమాజం పట్ల మిక్కిలి ఆసక్తి ఏర్పడింది. శాస్త్రిగారు 1881 లో మదరాసు వచ్చారు. బ్రహ్మ సమాజం గురించి ఆయన వరుసగా ఎన్నో

ఉపన్యాసాలు ఇచ్చారు. అప్పటికి వెంకటరత్నం నాయుడుగారు ఎఫ్. ఏ. చదువుతూ వున్నారు. శివానందశాస్త్రిగారు గొప్ప పండితులు, ఉపన్యాసకులూను. అన్నిటికి మించి ఏకేశ్వరోపాసన సిద్ధాంతాన్ని గట్టిగా నమ్మిన వ్యక్తి ఆయన. హృదయానికి హత్తుకునేటట్లు ఆయన ఉపన్యసించేవారు. శ్రోతలను మంత్ర ముగ్ధులను గావించేవారు. నాయుడుగారు బ్రహ్మసమాజం ద్వారా తన ఆధ్యాత్మిక జీవనాన్ని గడపాలని నిర్ణయించుకున్నారు. 1885లో మదరాసులో బ్రహ్మ సమాజ మందిర నిర్మాణం జరుగుతున్నప్పుడు అంత పిన్న వయస్సులోనే ఆయన ఎక్కువగా కృషి చేశారు. ఆయన మందిరానికి నిత్యం వెళుతూవుండేవారు. మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్, శివానందశాస్త్రి మున్నగువారు వ్రాసిన బ్రహ్మ సమాజ సాహిత్యాన్ని విరివిగా చదివారు.

ఆ రోజులలో బ్రహ్మ సమాజంతో ఎటువంటి సంబంధం పెట్టుకున్నా సనాతన హిందువులు హీనంగా చూసేవారు. ఈ విషయంలోనే నాయుడుగారికీ సనాతనులైన వారి తండ్రిగారికీ పేచీ వచ్చింది. ఇప్పటికీ మనం మన మతాన్ని విడనాడి మరొక క్రొత్త మతాన్ని స్వీకరించడం ఎంత కష్టమో మనం చూస్తూవున్నాం. అటువంటప్పుడు 70 సంవత్సరాల క్రితం ఇది ఇంకెంత కష్టమో ఊహించవచ్చును. దుర్బలహృదయులు, బలవత్తరమైన సాంఘిక శక్తులముందు లొంగిపోవలసినదే. సనాతన మతాన్ని ధిక్కరించిన వారిని అతి నిర్దయతో నలిపివేశారు. అన్యమతం స్వీకరించాడంటే అతనికి వెలి తప్పేది కాదు. వంటింట్లోకి రానిచ్చేవారుకాదు. దగ్గర వారైనా సన్నిహితంగా తిరగనిచ్చేవారు కాదు. అతనికి ఆస్తిలో వాటా కూడా దక్కేది కాదు. కొడుకు చేసిన నేరానికి నాయుడిగారి తండ్రి అనేక సందర్భాలలో మందలించారు. వారిని గదిలో పెట్టి తాళం వేసి తిండి పెట్టకుండా కొన్నాళ్ళపాటు ఉంచేవారు. ఆఖరికి మొత్తం కుటుంబాన్నే వెలేశారు. బ్రహ్మ సమాజంలో చేరిన రోజున ఆయన ఆత్మ సంపూర్ణసంతృప్తిని పొందగలిగింది. ఆయన తన కాలాన్ని భగవద్ధ్యానంలో గడిపారు.

70 సంవత్సరాల క్రితం ఎం. ఏ. ఎల్. టి. చదువుకున్న వ్యక్తి ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించి వుంటే ఎంతగా రాణించేవారో మనం ఊహించవచ్చు. కాని ఆయన డబ్బుపై గాని అధికారంపై గాని ఆసక్తి చూపించలేదు. సంఘం ఆధ్యాత్మికంగా పునరుద్ధరింపబడటంమీదే ఆయన శ్రద్ధ చూపించారు. పవిత్రత నిరాడంబరత, సత్యవర్తనలకు కట్టుబడిన వ్యక్తి నాయుడుగారు. సూఫీ వేదాంతాన్ని హిందూ మతాన్ని, క్రైస్తవ మతాన్ని క్షుణ్ణంగా ఆకళించుకున్నారు. బ్రహ్మ సమాజం ద్వారా విశ్వైక మతాన్ని రూపొందించాలని ఆయన వాంఛించారు. ఆయన జ్ఞాపక శక్తి అపారం. దానివల్లనే ఆయనకు అనర్గళంగా ఉపన్యసించే ప్రతిభవుండేది. ఆంగ్లభాషలో వారికి గల పాండిత్యం భారతీయులలో నాటికీ నేటికీ చాలా తక్కువ మందికి ఉంటుంది. వారు ఆ భాషలో చక్కటి పదజాలం ఉపయోగించి ఉత్తమంగా వ్రాసేవారు, మాట్లాడేవారు. తన అనర్గళ ఉపన్యాస ధోరణిలో శ్రోతలను మంత్రముగ్ధులను చేసేవారు. ఆస్తికత్వం మీద, వేదాంతం మీద, సాహితీ విమర్శ మీద ఆయనతో సరితూగే వ్యక్తులు చాలా అరుదు. విశ్వైక మతాన్ని, ఏకేశ్వరోపాసన సిద్ధాంతాన్ని వ్యాపింపజేసేటందుకు 1881 లో ఒక ముద్రణాలయాన్ని స్థాపించి "బ్రహ్మ ప్రకాశిక", "ఫెలో వర్కర్" పత్రికలను నడిపారు. ఆ పత్రికలను నిర్వహించడంలో వారు చూపిన శ్రద్ధవల్ల అవి మేధావుల మన్ననలను అందుకొన్నవి. ఆకాలంలో దేశాన్ని బాధిస్తున్న సమస్యలపై తమ మత సంబంధమైన సామాజిక అభిప్రాయాలను ప్రకటించి చాలా సేవచేశారు. అస్పృశ్యతను, పడుపు వృత్తిని ఆయన ప్రతిఘటించారు. విధవా వివాహాలను బలపరిచారు. వెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు గార్ల స్ఫూర్తితోనూ ఈ పత్రికల చేయూతతోనూ దక్షిణాదిన సంఘ సంస్కరణబలం చేకూర్చుకుని ముందుకు సాగింది. ఆయన 1884 లో బి.ఎ. మొదటి సంవత్సరం చదువుతుండగా శేషమాంబగారిని వివాహమాడారు. ఆమె దయార్ద్ర హృదయిని. పతికి దగిన సతీమణి. 1887 లో వారికి ఒక కుమారుడు జన్మించాడు. కాని వెంటనే ఆ పిల్లవాడు చనిపోయాడు. ఆయన మతభ్రష్టుడు కాగా భగవంతుడు కినుక వహించి కుమారుణ్ణి తీసుకుపోయాడని ప్రజలు అనుకునేవారు. ఈ మతాన్ని త్యజించాల్సిందని తండ్రి ఎంతగానో పట్టుబట్టారు. కాని నాయుడుగారు అలాంటిదేమీ చేయలేదు. బ్రహ్మ సమాజ మందిరానికి వెళ్ళటం మానివేద్దామా అని భార్య నడుగగా ఆమె నిరాకరించింది. చివరకు దంపతులిద్దరూ పితృగృహాన్ని విడిచి వెళ్ళవలసి వచ్చింది. 1889 లో ఒక ఆడపిల్లను కని శేషమాంబగారు మరణించారు. ఆమె మరణించిన తరువాత నాయుడుగారు తిరిగి పెళ్ళి చేసుకోలేదు. 50 సంవత్సరాల పాటు కఠినమైన బ్రహ్మచర్యాన్ని అనుసరించారు. హిందూ వితంతువుల మాదిరిగా ఉండాలని ఆయన ఎల్లప్పుడూ తెల్లటి దుస్తుల్నే ధరించేవారు. కాబట్టి ఆయనకు "ఆంధ్రదేశ శ్వేతాంబరఋషి" అని పేరొచ్చింది.

వెంకటరత్నం నాయుడుగారు తాము ఉపాధ్యాయుడు కావాలనే ఎప్పుడూ కోరుకొనేవారు. వారు "ఇంపీరియల్ పార్ట్యూన్ ఛెల్లర్" అనే పుస్తకం చేతపట్టుకొని ప్రశ్న వేసుకోగా బడి పంతులవుతావని సమాధానం వచ్చిందట. చివరకు అది నిజమే అయింది. ఏలూరు సి.ఎం.ఎస్. హైస్కూల్‌కు వారు కొంత కాలం హెడ్‌మాస్టరుగా పనిచేశారు. ఆ తరువాత రాజమండ్రి థీయిస్టిక్ హైస్కూలులోను, బందరు హిందూ హైస్కూలులోను ఉపాధ్యాయులుగా పని చేశారు. 1891 లో ఎం. ఏ. (లిటరేచరు) పట్టా పుచ్చుకొన్నాక పచ్చయప్ప కళాశాలలో అంత్రోపాలజీ, ఇంగ్లీషు ప్రొఫెసరుగా పనిచేసి, గొప్ప పేరు గడించారు.1894లో నోబుల్ కళాశాల ప్రథమ శ్రేణి స్థాయికి పెంచబడినప్పుడు వారు అసిస్టెంటు ప్రొఫెసరయ్యారు. స్కూలు సూపరింటెంటుగా ఉంటూ దాని పనులు కూడ చూస్తూ ఉండేవారు. ఎక్కువ కాలాన్ని బోధనకూ, హైస్కూలు నిర్వహణకూ వినియోగించేవారు. అతి చాకచక్యంతోను, సామర్థ్యంతోను వారా కార్యభారాన్ని నిర్వహించారు. కళాశాల ప్రిన్సిపాలు రివరెండు సి. డబ్ల్యు. ఏ. క్లార్కు, ఎం. ఏ. గారు వారిని గురించి చెపుతూ "విద్యార్థులపై నాయుడుగారి వ్యక్తిత్వ ప్రభావం ఎంతో బలవత్తరమైనది. అంత ప్రభావం కలిగిన మరోవ్యక్తి నెవర్నీ నేను చూడలేదు" అన్నారు. ఎప్పుడూ వారివెంట ఎంతో మంది విద్యార్థులు ఉంటుండేవారు. వారి బోధనా సామర్థ్యానికి, వారు చూపే వాత్సల్యానికి విద్యార్థులు వారిని అమితంగా గౌరవిస్తూండేవారు. బ్రహ్మర్షి తరవాత కళాశాల ప్రిన్సిపాలైన డా॥ రామకృష్ణరావుగారు నాయుడుగారి ఉపన్యాసాలన్నిటిని అత్యంత ప్రతిభావంతంగా రికార్డు చేశారు. నాయుడుగారి గురించి వారిలా అన్నారు. "నాయుడుగారిలో సౌమ్యత, సంతోషంతో తొణికిసలాడే హాస్య ప్రవృత్తి స్పష్టంగా గోచరిస్తాయి. ఆయనది నిండైన విగ్రహం. మనిషిలో ఠీవి, హుందాతనం మూర్తీభవించి ఉన్నాయి. సమయానుకూలంగా ఆయన ఎన్నెన్నో ఉదాహరణలిచ్చేవారు. ఆయన గంగా ప్రవాహంలా ఉపన్యసించేవారు." విద్యార్థులంతా నాయుడుగారి తరగతి గదిని ఒక దేవాలయంగా భావించేవారు. వారి ఉపన్యాసాలను ఆధ్యాత్మిక అనుభవంగా పరిగణించేవారు. వెంకటరత్నంగారు విద్యాబోధన చేసేటప్పుడు షేక్స్పియర్, మిల్టన్, వర్డ్స్‌వర్త్, టెన్నిసన్, కార్లైల్, రస్కిన్, వీరంతా సజీవ వ్యక్తులై, నాయుడుగారి ముఖతః తమ సందేశాన్ని ఇస్తున్నట్లుండేది. తరవాతి తరానికి చెందిన ప్రముఖులంతా ఒకప్పుడు వారి విద్యార్థులే. పూజ్యులైన తమ గురువుగారికి తామెంతో ఋణపడి ఉన్నట్లు కృతజ్ఞతతో చెప్పుకొనేవారు. విద్యార్థులు నాపై చూపే గౌరవమే నాజీవితానికి సార్థకం అనేవారు నాయుడుగారు. ఐహంతా ఉపాధ్యాయునికి సంతృప్తి కలిగించేది అంతకంటే మరేమీ లేదేమో. బందరు నోబుల్ కళాశాలలో పనిచేసిన నాలుగేళ్లూ తమ జీవితంలో అత్యంత సంతోషకరమైన రోజులు అనేవారాయన. సమర్థులైన ప్రిన్సిపాలు రివరెండ్ క్లార్క్ గారిని వారెంతో గౌరవించేవారు. ఆధ్యాత్మిక, మత విషయాలపై కళాశాల అధికారులతో అభిప్రాయభేదాలు రావడంతో వారు కళాశాలనుంచి తప్పుకోవలసి వచ్చింది. 1899 నుంచి 1904 వరకూ వారు సికిందరాబాదులోని మహబూబ్ కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేశారు. వారి నిష్కళంకమైన శీలం, స్వచ్ఛమైన మనస్సు ఈ విలాసమయ స్వేచ్ఛా నగరానికి వింతగా కన్పించాయి. కళాశాలను వీడినప్పుడు విద్యార్థులు అమితాదరంతోను, గౌరవ ప్రపత్తులతోను వారికి వీడ్కోలిచ్చారు.

1904 లో కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాల ప్రిన్సిపాలు పదవి ఖాళీ అయింది. దానికోసం ఇద్దరు దరఖాస్తు పెట్టుకొన్నారు. ఒకరు వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి, రెండోవారు వెంకటరత్నంగారు. ఇరువురూ సమాన ప్రతిభావంతులే. అయినప్పటికీ విధి వశాత్తు కమిటీవారు వెంకటరత్నంగారిని ఆ పదవికి ఎంచుకున్నారు. అప్పటినుంచి పిఠాపురం రాజావారికి నాయుడుగారి నిరంతర మార్గదర్శకత్వమూ, వారి పరిచయ భాగ్యమూ లభించాయి. 1909 లో కళాశాల ఆర్థికంగా స్థిరపడ్డది. పిఠాపురం మహారాజావారు స్వయంగా కళాశాల నిర్వహణబాధ్యతను చేపట్టారు. ఇంతకుముందే చెప్పినట్టు స్త్రీలకు, దళిత జాతుల విద్యార్థులకు ఉచితంగా విద్యగరప బడుతుండేది. ఈ ఉచిత విద్యావిధానాన్ని మనం ఈనాటికీ పూర్తిగా అమలు జరుపలేకపోతున్నామంటే, వారు తీసుకున్నది ఎంత అభ్యుదయకరమైన చర్యో. వెనుకబడ్డవారికి, నిరాధారులకు, నిరుపేదలైన అస్పృశ్యులకు అది ఎంత మేలు చేసిందో మీరు బాగా ఊహించుకోగలరు. 1911 లో మొదటిసారిగా ఆడపిల్లలను కళాశాలలో చేర్చుకొన్నప్పుడు వారితో నెగ్గుకురాగల సామర్థ్యం ఉన్నదా అని అనేకమంది సందేహం వెలిబుచ్చారు. ఎన్ని ఇబ్బందులొచ్చినప్పటికీ స్త్రీలకు ప్రవేశం కల్పించడంలో కృతకృత్యులైనారు. అంతేకాదు, ఇతర కళాశాలలో కూడ సహవిద్య ప్రవేశపెట్టేందుకొక గొప్ప ఉద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమం క్రమేణా బలవత్తరమై చివరకు భారతదేశంలో ఉత్తమ విద్యావిధానంగా అంగీకరించబ

ఉండేది. తన విద్యార్థుల జీవనంలోను, వారి నైతిక సంక్షేమం వట్లా స్వయంగా శ్రద్ధ తీసుకొనేవారాయన. ఒకసారి ఒక విద్యార్థి అనైతిక కార్యాలకు పాల్పడుతున్నాడని విని అతణ్ణి పిలిపించి నిజం చెప్పమని అడిగారు. ఆ విద్యార్థి కన్నీరు కారుస్తూ తప్పు ఒప్పుకొని సత్ప్రవర్తనుడైనాడు. తన విద్యార్థులపట్ల పితృ వాత్సల్యాన్ని వ్యక్తపరచే ఇలాంటి సంఘటనలు కోల్లలుగా ఉన్నాయి. 1905 నుంచి 1919 వరకూ వారు పి. ఆర్. కళాశాల ప్రిన్సిపాలుగా ఉండి విద్యార్థులను ఉత్తేజపరిచారు, అర్హులను ఆదుకున్నారు. వారి లోపాలను చక్కదిద్దారు నైతిక పతనం నుంచి కాపాడారు. వారి హయాంలో కళాశాల బాగా వృద్ధి చెందింది. దాని వుజ్వల ప్రతిష్ట వాడవాడలా వ్యాపించింది. పిఠాపురం మహారాజా వారు కళాశాల భవనాలకు, ఆట స్థలాలకు గాను లక్ష రూపాయలూ, 35 ఎకరాల స్థలమూ విరాళంగా ఇచ్చారు. కళాశాలతో తమకు గల సాన్నిహిత్యాన్ని గూర్చి చెప్తూ, "నా హృదయాన్ని అరంగుళం చీల్చి చూడండి, అక్కడ మీకు పిఠాపురంరాజా కళాశాల కన్పిస్తుంది" అన్నా రాయన. విద్యార్థులలో మానవతా దృక్పథాన్ని, మేధాసంపత్తిని, మౌలిక ఆలోచనను అలవర్చడంకోసం ఆయన విద్యార్థిసంఘాన్ని స్థాపించారు. అదెంతో ప్రసిద్ధి చెందింది. ఆ సంఘ సభ్యులు ఈ తత్వవేత్తను తమ గురువుగా, తండ్రిగా, దైవంగా ఆరాధించే వారు. బ్రహ్మర్షి అనుచరులమని సగర్వంగా ప్రకటించుకునేవారు ఆయన తరచు, తోటకో, కాకినాడ సముద్ర తీరానికో వెళ్ళి ప్రార్థన, దైవం, ప్రేమ, దయ మొదలైన విషయాలపై ఆత్మను ఉత్తేజ పరిచే ప్రసంగాలు చేస్తుండేవారు. సందేశాలు అందజేసేటప్పుడు వారు ఎంతగా నిమగ్నమై ఉద్రేకపూరితులయ్యే వారంటే, కళ్ళ నుంచి అశ్రువులు రాలేవి. చెక్కిళ్ళు ఎరుపెక్కేవి, ఉద్వేగంతో కంఠం రుద్ధమయ్యేది. నయనాలలో దివ్య జ్ఞానజ్యోతి ప్రకాశించేది.

వెంకటరత్నంగారు 1912 లో మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటు సభ్యులయ్యారు. విశ్వవిద్యాలయ "ఫెలో"గా కూడ ఎన్నికయ్యారు. మద్రాసు ప్రభుత్వం వారిని 1921 నుంచి 1923 వరకు ప్రాంతీయ శాసన పరిషత్తు సభ్యులుగా నామినేటు చేసింది. తరువాత పరిషత్తు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. పిఠాపురం రాజా కళాశాల నుంచి రిటైరయ్యాక ఆయన మరే ఉద్యోగమూ చెయ్యలేదు. మళ్ళీ ఉద్యోగం చెయ్యనని ప్రకటించారు కూడ. 1925 లో వారు మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులై మూడేళ్ళపాటు ఆ పదవిలో ఉన్నారు. విశ్వవిద్యాలయ అధికారం చేపట్టాక సుదీర్ఘ పరిణామాలు గల సంస్కరణ లెన్నిటినో ప్రవేశపెట్టారు. ప్రాచ్య అధ్యయన శాఖను ప్రారంభించారు. భారతీయ చరిత్రాధ్యయనాన్ని నిర్బంధం చేశారు. వేదాంత, గణిత శాస్త్రాలకు అధ్యక్ష పీఠాలను నెల కొల్పారు. నిర్బంధ వ్యాయామ శిక్షణను, ద్వితీయ భాషాధ్యయ నాన్ని ప్రవేశపెట్టారు. దక్షిణ భారతీయ భాషలపై ప్రముఖ విద్యా వేత్తలచే ఉపన్యాసాలిప్పించడం ప్రారంభించారు. భాషా కోవి దులకు డాక్టరేటు డిగ్రీ ఇచ్చి వారిని గౌరవించారు. మహా మహోపాధ్యాయ యు. వి. స్వామినాథ అయ్యరుగారికి తమిళంలో డాక్టరేటు ఇచ్చి సత్కరించారు. ఒక భారతీయ భాషలో డాక్టరేటు ఇవ్వడం అదే ప్రథమం. ఆంధ్ర విశ్వవిద్యాలయ బిల్లును రూపొం దించి, శాసన మండలిచే ఆమోదింపజేయడానికి వారే ముఖ్య కారకులు. విశ్వవిద్యాలయం ఏర్పాడ్డాక ప్రఖ్యాతి గాంచిన ఉపా ధ్యక్షులు డా॥ సి. ఆర్. రెడ్డిగారు దాన్ని భారతీయ విశ్వవిద్యా లయాలలో కెల్లా అగ్రగామిగా తీర్చి దిద్దారు. ఉపాధ్యక్షులుగా తనకొచ్చే రెండువేల రూపాయల జీతంలో తనకోసం నూటయాభై రూపాయలకంటె ఎక్కువ ఖర్చుపెట్టుకునే వారు కారట.

నాయుడుగారు నోబుల్ కళాశాలలో పనిచేసేటప్పుడు కొద్ది కాలం బందరు కౌన్సిలరుగా ఉన్నారు. తన నియోజకవర్గానికి నిస్వార్థమైన సేవచేసి మునిసిపల్ కౌన్సిలరుగా మంచిపేరు సంపా దించుకున్నారు. వారెక్కడికి వెళ్ళినా ప్రజలు సంతోషముతో "తమరు దయచేశారా! మాబోటి వాళ్లకు తప్పక న్యాయం కలుగు తుంది." అని అనేవారు. అప్పుడు మెయ్‌డెన్‌గారు మునిసిపల్ చైర్మెనుగా ఉండేవారు. వారిని గూర్చి కొన్ని వింతలు చెప్పు కొనేవారు. ఎన్నికలను గూర్చి అప్పీళ్ళు వచ్చినప్పుడు వారడిగే ప్రశ్నలు హాస్య రసోత్పాదకాలుగా ఉండేవి. నవ్వుతెప్పించే విధంగా క్లయింట్సుతో జరిపిన సంభాషణకు ఈ క్రిందిదొక ఉదాహరణ.

"నీకు భార్య ఉన్నదా?

చిత్తం. లేదండి.

ఎందుకు పెట్టుకోలేదు?

నీకు పిల్ల లేదా?

లేదండి

ఎందుకు చెయ్యలేదు?

1880నుంచి 1890 వరకు అఖిలభారత జాతీయ కాంగ్రెసుతో కూడ వారికి సంబంధం ఉండేది. ఆ కాలంలోనే సుప్రసిద్ధ 'నార్టన్ సంఘటన' జరిగింది. వారు మద్రాసు బ్రహ్మ సమాజానికి అధ్యక్షులుగా ఉన్నారు. పూజ్యులు వీరేశలింగం పంతులుగారు స్థాపించిన రాజమండ్రి హితకారిణి సమాజానికి కూడ వారధ్యక్షులుగా పని చేశారు. ఈ సమాజం నిర్వహణక్రింద ఒక వితంతు గృహం, ఒక హైస్కూలు, ఒక ప్రార్థన మందిరం, ఒక గ్రంథాలయం, ఒక పఠన మందిరం, ఒక ఉద్యానవనగృహం ఉండేవి. వారి ప్రోత్సాహంతోనే పిఠాపురం మహారాజావారొక అనాధ శరణాలయాన్ని ప్రారంభించారు. పిఠాపురం మహారాజావారి సాయంతో కాకినాడ బ్రహ్మ సమాజ మందిరం నిర్మితమైంది. మహారాజా వారిచ్చిన లక్షరూపాయల విరాళంతో ఒక నిధి ఏర్పాటు చేయబడింది. అది "ఆంధ్ర బ్రహ్మధర్మ ప్రచారక నిధి" అన్న పేరుతో 1928 లో ఏర్పాటైంది. నాయుడు గారికి ఈ మూడు సంస్థలతోను అత్యంతసన్నిహిత సంబంధం ఉండేది. ఈ మూడు సంస్థలలో ఒకటి మానవుని ఆత్మను పెంపొందించేది, రెండోది వికసింప జేసేది, మూడోది పరిపక్వం కావించేది. అని అంటుండేవారాయన. రాజకీయ, సాంఘిక, మత సంబంధమైన ఎన్నో ముఖ్య సమావేశాలకు అధ్యక్షత వహించి మన్ననలను అందుకున్నారు. వారికి 1912 లో రావ్ బహదూర్ బిరుదూ, 1918లో దివాన్ బహదూర్ బిరుదూ ప్రదానం చెయ్యబడ్డాయి. 1923లో కైజరిన్ హింద్ బంగారు పతకం బహూకరించబడింది. ఆఖరుకు 1924 లో నైట్ హుడ్ ప్రసాదించబడింది. అనధికార విద్యావేత్తకు నైట్ హుడ్ ఇచ్చి గౌరవించడం అదే ప్రథమం. దక్షిణ భారత ఉపాధ్యాయ సంస్థకు వారు పెక్కుమార్లు అధ్యక్షతవహించారు. ఉపాధ్యాయులంతా వారిని కులపతిగా గౌరవించారు. 1927 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం మొట్టమొదటి పట్టప్రదానోత్సవ సందర్భంలో ఈ ప్రముఖునికి లిటరేచరులో గౌరవ డాక్టరేటు డిగ్రీనిచ్చి సత్కరించింది. 1927_28 లో వారు అంతర్విశ్వవిద్యాలయ మండలికి అధ్యక్షులయ్యారు. 1938 లో సర్ జార్జి స్టాన్లీ మద్రాసు విశ్వవిద్యాలయంలో వారి నిలువెత్తు చిత్ర పటాన్ని ఆవిష్కరించారు.

1932 లో 70 వ జన్మదినంనాడు నాయుడుగారివద్ద విద్యనభ్యసించినవారు, అభిమానులు అందరుకలసి ఆయనకు బ్రహ్మర్షి బిరుదును ఇచ్చి సత్కరించారు. అది ఆయనకు ఎంతగానో తగివున్నది. ఆయన మన ప్రాచీన మహర్షులకంటె ఏ మాత్రం తక్కువవాడు కాడు. బౌద్ధ మతం బోధించిన దయాగుణం క్రైస్తవ మతం బోధించిన మానవ సేవాపారాయణత ఆయనలో వుండేవి.

వెంకటరత్నంగారు మిక్కిలిదయాళువు. వారు అనాధులను కనికరించి ఉదారంగా సహాయం చేశారు. ఒకనాడు ఆయనకు త్రోవలో ఒక అనాధ బాలిక కనుపించింది. ఆయన ఆ బాలికను ఇంటికి తీసుకువెళ్ళి తన కుటుంబంలో చేర్చుకొని పెంచారు. ఆబాలికను తన స్వంత కూతురు మాదిరిగాపెంచారు. ఆయన భూత దయగలవాడు. ఆయన భగవద్ధ్యానంలో సర్వ ప్రపంచాన్ని ఐహిక విషయాలను మరిచిపోయి ఏకాగ్రచిత్తంతో వుండేవారు. ఒక మానవుడుగా ఆయన ఎంతో కృషి చేశారు. ఆయన పెంచిన అనాధులు ఆయన లేకపోతే నిరాశ్రయులయి వుండేవారు అని ఎవరైనా అంటే ఆయన వెంటనే వారు లేకపోతే నేనెక్కడ వుండేవాడిని అని అనేవారు. వారికి ఆయన స్వయంగా పాలు త్రాగించి పడుకోబెట్టేవారు. ఆ బాలికకు పెండ్లి అయిన తరువాత ఆయన వారికి తరుచుగా డబ్బు, ఇతర కానుకలు పంపుతుండేవారు. 1936 లో ఒకే నెలలో ఆయన విద్యార్థులు కాలేజీలో చేరడానికి తాను సహాయంగా సుమారు 1,500 రూపాయలు పంపారని ఆయన జీవిత చరిత్ర వ్రాసిన సూర్యనారాయణ గారంటున్నారు. ఆయన సంపూర్ణమైన జీవితం గడిపి 1939 మే 26 వ తేదీన దివంగతులైనారు.

సాంఘిక నైర్మల్యమును గూర్చి మాట్లాడుతూ ఆయన సమాజాన్ని నైతిక విషయ పరంగా మూడు ప్రత్యేక దశలుగా విభజించవచ్చునని చెప్పారు. ఆ ప్రకారంగా చట్టమూ, ప్రజాభిప్రాయమూ, నివేచనాబుద్ధి _ ఇవి సత్ప్రవర్తనను క్రమబద్ధం చేస్తాయి. ఇది ఎంతటి సత్యమో మనమెరుగుదుము. మనం శాసన నిర్మాణం ద్వారా నైతికపరమైన ఐహిక విషయాలను సాధించడానికీ, శాసనం ద్వారా సంఘాన్ని ఉచ్చస్థాయికి తీసికొని రావడానికీ ప్రయత్నిస్తున్నాం. శాసనానికి ప్రజాభిప్రాయం అనుకూలంగా వుంటేనే తప్ప ఆ శాసనం విజయవంతం కాదు. మనం మద్యనిషేధాన్ని అమలుపరచడానికీ, జూదాన్ని నివారించడానికీ, వ్యభిచారాన్ని శిక్షించడానికీ ప్రయత్నిస్తున్నాం. కానీ ఆప్రయత్నం ఏ మాత్రం జయప్రదం కాలేదు. రెవిన్యూ శాసనం వలె లేక క్రిమినల్ ప్రొసీజరు కోడ్ వలె సాంఘిక శాసనాన్ని అమలుపరచడం సాధ్యం కాదు. ఒక దొంగ పట్టుబడినట్లయితే క్రిమినల్

శాసనం క్రింద శిక్ష విధించవచ్చు. శిస్తు ఒక రూపాయి నుండి రెండు రూపాయలకు పెంచబడినట్లయితే శిస్తు విధించబడిన వ్యక్తి దానిని చెల్లించవలసి వుంటుంది. కానీ మద్యపానాన్ని శాసనం ద్వారా శిక్షార్హం చేస్తే దాన్ని అమలు జరచడం అంత సులభం కాదు. ఎవరో ఒకరు పట్టుబడవచ్చు కాని చాలా మంది శిక్షను తప్పించుకోడానికి అవకాశం ఉంది. జూద గృహాలను మూసివేసినట్లయితే అవి క్లబ్బులు అనే గౌరవనీయమైన పేరుతో తిరిగి వెలుస్తాయి. "దైనందిన లావాదేవీలలో మానవుల్ని సన్నిహితం చేసే అనేక సందర్భాలు, అతి జాగ్రత్తతో మెలగేవారి దృష్టికీ, పరిపాలక సంస్థల దృష్టికీ గోచరించవు" అన్నారు ఆయన. సమాజం ప్రభుత్వానికి అండగా ఉండి నైతిక విషయాలకు సంబంధించిన శాసనాల కనుకూలమైన ప్రజాభిప్రాయాన్ని పెంపొందించాలి. ప్రజలు తమ వ్యక్తిత్వాన్ని గుర్తించి స్వధర్మపాలన, ఆత్మ విశ్వాసము, వైరాగ్యభావము, భక్తి, ఆత్మార్పణ, సేవాపరాయణత-ఈ గుణాలను అలవరచుకొన్నకొద్దీ సమాజం శీఘ్రగతిని అభివృద్ధి చెందుతుంది." అలా జరిగినప్పుడే, "ఇతరులను అనుకరించే పద్ధతి స్థానంలో వ్యక్తిత్వానికి ప్రాబల్యం ఏర్పడుతుంది, ప్రజలు ఆచారాన్ని లెక్కచేయక స్వయంగా ఆలోచించి పని చేస్తారు." ఈ విషయాన్ని నిరూపించడానికి ఆయన కొన్ని ఉదాహరణలు ఇచ్చారు. "కొన్ని ఇదమిద్ధమైన ఉదాహరణలు తీసుకొని పరిశీలించినట్లయితే ఈ మూడు చర్యల యొక్క ప్రత్యేకత ఔచిత్యం విదితమౌతుంది. శాసనాలు జాతి యొక్క భౌతికపరమైన భద్రతకును సంక్షేమం విషయంలోను బాధ్యత వహిస్తాయి. ప్రజాభిప్రాయం సాంఘిక సంబంధాలను క్రమబద్ధం చేస్తూ సాంసారిక బాధ్యతలను నిర్వహిస్తుంది వ్యక్తిత్వ భావన మానవునిలో గుప్తంగా ఉండే ఉద్దేశాలను లేక సహజ ప్రేరేపణలను పటిష్ఠం చేస్తుంది. సమాజం యొక్క నైతిక ఔన్నత్యాన్ని సాధించడానికి వస్తుతః విభిన్నమైన ఉద్దేశాలతో ఈ మహత్తర సాధనాలు వేరువేరు రంగాల్లో పనిచేస్తాయి. మనదేశం నుంచే కొన్ని ఉదహరణలు తీసుకుందాం. శాసనం సతీసహగమనాన్ని రద్దుపరచి వితంతువు న్యాయమైన హక్కులను నిర్ణయిస్తోంది. ప్రజాభిప్రాయం స్త్రీ పునర్వివాహాన్ని నిరసిస్తుంది. క్రూరమైన దురాచారాలకు గురి అవుతున్న అసంఖ్యాక ప్రజానీకానికి విముక్తి కల్గించడం వ్యక్తుల న్యాయబుద్ధి, ఉన్నత భావాలు కల్గివున్నప్పుడు మాత్రమే సాధ్యం అవుతుంది. వ్యక్తులు తమ సమ్మతిని తెలుపుటకు ఎంత వయస్సు కలిగియుండాలో శాసనం నిర్ణయించవచ్చు లేదా అది వివాహసంబంధమైన హక్కులను పునరుద్ధరించవచ్చు. కాని క్రూరులైన భర్తల ప్రచ్ఛన్న క్రౌర్యాన్ని అణచివేసేది ప్రజాభిప్రాయమే. పవిత్రమైన వాంఛలతో కూడిన సహృదయత మాత్రమే దాంపత్య జీవితాన్ని స్వర్గతుల్యం చేస్తుంది. శాసనం ద్వారా మద్యపానీయాల ధరలను పెంచి అవి ప్రజలకు అందుబాటులో లేకుండ చేయవచ్చు కాని ప్రజాభిప్రాయం తప్ప ఇంకేదీ కూడా ఈ దురలవాటును అరికట్టలేదు

శాసనం బహిరంగంగా అసభ్యంగా ప్రవర్తించే వారిని శిక్షించవచ్చు కాని అసభ్యకరమైన పాటలను గర్హించేది బలమైన ప్రజాభిప్రాయం మాత్రమే.

శాసనం జరిగే కార్యాన్ని పరిశీలిస్తుంది. ప్రజాభిప్రాయం ప్రవర్తనను పరిశీలిస్తుంది. వ్యక్తిగతాభిప్రాయం ఆంతరంగిక వాంఛను పరిశీలిస్తుంది. శాసనం మానవుణ్ణి నేరం చేయకుండ అసహాయుణ్ణి చేస్తుంది. ప్రజాభిప్రాయం మానవుని సాంఘిక జీవితాన్ని ప్రభావితం చేస్తుంది; వ్యక్తిగత బాధ్యత మానవుని పౌరుషాన్ని అదుపులో పెట్టుతుంది."

శాసనం, ప్రజాభిప్రాయం పరస్పర సహకారం కొరకు ఏ విధంగా పని చేస్తాయో సమగ్రంగా వివరించిన తరువాత ఆయన, శ్రమ నివారణలో సంతుష్టిని విధి నిర్వహణలో సంతోషాన్ని ఇబ్బందిలో సౌఖ్యాన్ని ఈ ప్రకృతి ఏ విధంగా ఏర్పరచిందో వివరించారు.

ఆహారంతో ఆకలి బాధను నివారించవచ్చు కాని సంతుష్టి కల్గించేది రుచియే. జీవితాన్ని సుఖమయం చేసుకోడానికి ఎంతైనా వీలుంది కాని మానవునికి జంతువుకు మధ్యగల తేడా అట్టి సౌఖ్యాన్ని వినియోగించుకొనే విధానంలోనే ఉంది. జీవితలక్ష్యంగా సౌఖ్యాన్ని కోరడం జంతులక్షణం. జీవిత లక్ష్యానికై సౌఖ్యత్యాగం చేయడం మానవలక్షణం. అంటే సహజ స్వభావానికి ప్రాముఖ్యం ఉంటుంది. మానవుడు తన సహజ స్వభావాన్ని హేతుబద్ధం చేసుకుంటాడు, కావున జంతువు తాత్కాలిక సృష్టి. కాని మానవుడు శాశ్వత సృష్టి. ఈ ఆధిక్యత మూలముగనే మానవుని విషయంలో సౌఖ్యం ప్రగతికి సాధనం అవుతుంది. దానిని విడనాడవలసిన పని లేదు. సౌఖ్యం క్రమబద్ధం చేసుకోవలసిన ఒక సాధనమే కాని బొత్తిగా వదలుకోవలసిన పీడకాదు. "నిగ్రహము" మానవునికి చాల అవసరం. నిర్మలత్వమే నిగ్రహము. గృహ సౌఖ్యాలను సాంఘిక ఆదర్శాలను నిర్ణయించే స్త్రీ పురుషుల మధ్య ఉండే శ్రేష్ఠమైన సంబంధం మన జాతి గతిని మారుస్తుంది. కావున సాంఘిక నైర్మల్యం అంటే సంపూర్ణ అభివృద్ధికి అనుగుణంగా జీవన విధానాన్ని మార్చుకోవడానికి మన కాంక్షలను అదుపులో పెట్టడం.

ఆయన స్త్రీని ఒక మాతృమూర్తిగా సోదరిగా పత్నిగా భావించారు. ఆయన ఎప్పుడూ స్త్రీని ఒక వ్యభిచారిణిగా ఎంచలేదు. ఆయన స్త్రీని వంచించే మతాన్ని గర్హించారు. మతానికి సంబంధించిన అక్రమాలను తీవ్రంగా నిరసించారు. "బ్రహ్మచర్యం—భగవంతుని సేవకై ఆత్మ సమర్పణ చేసుకోవడం—సాంఘిక దురాచారానికి దారితీసింది. పవిత్ర దేవదాసీ స్థానంలో సందేహాస్పదమైన శీలం గల స్త్రీలు వచ్చారు. భారత దేశపు ఆధ్యాత్మిక దురాచారాలను తొలగించే గోస్వస్థితి ఈ జీవం లేని ఎముకల్లో జీవం పోస్తుంది. అంతే కాకుండా అనేకులు ఆచరించే మత విషయక కార్యకలాపాలలో అసహ్యం పుట్టించే ఉన్మత్త తాండవాలు, ఇంద్రియ సుఖాసక్తి పూరకములయిన లీలలు, కామం మూర్తీభవించిన దేవతలు అపవిత్రమయిన హోలీలు ముఖ్య లక్షణాలు అయినవి. ఈ చెడు ఇంతటితో ఆగడం లేదు. జీవితంలోని అతి ముఖ్యమైన విషయాలలో నైతిక విలువల పట్ల చూపుతున్న నేరపూర్వకమయిన ఈ నిర్లక్ష్యం మతాన్ని దోచడమే కాకుండా కొన్ని సందర్భాలలో సాధారణ సంస్కారాన్ని, భక్తిని కూడ నాశనం చేస్తున్నది. పవిత్ర స్థలాలుగా పేరెన్నికగన్న ప్రదేశాలను జాగ్రత్తగా పరికిస్తే అవి అపవిత్రతతో దుర్గంధ భూయిష్టమై ఉండడం గమనించవచ్చును. ఇదంతా చాలా బాధాకరమైన విషయం. ఇది మానవశక్తిని మించిపోయేటటువంటిదేమీ కాదు. దీనికి నివారణోపాయం సమాజంలో ఉన్నది. ఆచారమన్నది లేని చోట ఈ విషయాలలో సమాజం అసాధారణంగా మేల్కొంటుంది. విజ్ఞానవంతులు మాత్రమే ఈ విషయాలను ముఖాముఖిగా చూడాలి. మన జాతీయ ఆదరాలలోను, సంప్రదాయాలలోను కావలసినంతగా పవిత్ర ధర్మనిష్ఠాపరత, ఉత్తేజకరమైన నిర్మలత్వము ఉన్నవి.

వివేచనా రహితంగా మన పూర్వ ఘనతను చాటుకోవడం అన్నది ఒక విషయం. వివేకంతో దానిని అనుసరించడమన్నది మరో విషయం.

సాంఘిక, మతైక విషయాలలో నిర్మలత ఉండవలసిన అవసరాన్ని గురించి విశదపరచిన పిమ్మట సానివృత్తి నిర్మూలన ఉద్యమాన్ని ఆయన చేపట్టాడు. ఆంధ్రలో ఉన్న వేశ్యల గురించి వ్యథాపూరితమైన తన హృదయాన్ని ఆయన వ్యక్తం చేస్తాడు. సంగీతానికి విరుద్ధంగా ఆయన పోరాడుతున్నాడని, వేశ్యలను వ్యక్తిగతంగా ద్వేషిస్తాడని చేసిన నిందారోపణలు ఆధార రహితమైనవని ఆయన పేర్కొన్నారు. బాగుచేయడానికి వీలులేనిదాన్ని ఆయన బాగుచేయడానికి ప్రయత్నిస్తున్నాడని కూడా కొందరు అన్నారు. అటువంటి దురదృష్టకరమైన విషయం పట్ల ఏకాగ్రతతో వ్యవహరించిన వ్యక్తి మరొకరెవరైనా ఆయనకు పూర్వం కాని తరువాత కాని ఎక్కడైనా ఉన్నారా? ఈ విషయం ఒక్కదానిలోనే ఆయన సంఘ సంస్కర్తలలో అగ్రస్థానానికి అర్హుడవుతున్నాడు. సంగీతం, నాట్యం, నటనలను దుర్మార్గం, అపవిత్రత, సంఘ బహిష్కారాలనే అవమానాల నుండి రక్షించడంలో ఆయన ఘన విజయాన్ని సాధించాడని నేను చెప్పాల్సి ఉంది. ఆయనకు పూర్వం గౌరవంగా బ్రతికే ఏ బాలిక కూడ బహిరంగంగా నాట్యం చేయడానికి కాని, నటించడానికి కాని సాహసించేది కాదు. ఇప్పుడు అన్ని రంగాల్లోను సంతోష పూర్వకమైన మార్పు రావడం మనం చూడవచ్చు. శక్తి, జ్ఞానము, అందము ఉన్నటువంటి ప్రతిభావంతులు, ప్రవీణులు అయిన బాలికలు నాట్యం, సంగీత నాటకాల్లో పాల్గొనేటందుకు ఇప్పుడు ముందుకు వస్తున్నారు. ఎవరైన తండ్రి తన కూతురుయొక్క గాన మాధుర్యాన్ని గురించి గాని లేక ఆమె నాట్య కౌశల్యాన్ని గురించి గాని మానవ జాతి యొక్క మౌలిక మనోభావాలను సాధారణ సంతోషాలను నటన ద్వారా వ్యక్తీకరించడంలో ఆమె చూపే ప్రతిభను గురించి గాని ఈరోజు గర్వపడుతున్నాడంటే అందుకు రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు దోహదం చేసినది అంతా యింతా కాదు. ఇప్పుడు భరతనాట్యం ఒక్క వేశ్యలకు మాత్రమే పరిమితమైనది కాదు. అత్యంత మనోహరమైన నాట్యం ద్వారా స్వయం ప్రకాశితం కాదలిచే ప్రతి బాలికా అభ్యసించే అత్యంత గౌరవ స్థానంలో ఉన్న కళ అది. యువతి పాడే పాట ఇప్పుడు మంత్రముగ్ధం చేసే సైరను కాదు, మనస్సులను కదలించి ఆకట్టుకొనే దైవమాత శ్రావ్యగానం అది. సంగీత నృత్య నాటకాలలో తమ కుమార్తెలు సాధించినదాన్ని చూచి తలిదండ్రులు గర్విస్తున్నారు. కరకులోహం ఎంత చక్కటి బంగారం మయింది. ఈ మార్పును సాధించిన రసవాది ఘనుడైన మన మహా పురుషుడు కాక మరి ఎవరు? ప్రాచీనమైనవన్న పేరుతో మాత్రమే చలామణిలో ఉన్న కర్కశ ఆచారాలను ఆయన ఎలా ఎదిరిస్తున్నారో చూడండి.

"ఆచారం ఎంతో పురాతనమైనదై ఉండి బహుళ వ్యాప్తి కలిగి ఉండినప్పటికీ అప్పుడప్పుడు ఉత్తేజిత ప్రభావం చూపించుతూ ఉంటుందేకాని చెడును ప్రమాదరహితంగా మాత్రం చేయలేదు. ఈ ఘోర అన్యాయం తనలో జీవిస్తూ పెంపొందడానికి పడే బాధకు భారతదేశం చెల్లించవలసి వస్తున్న మూల్యం వెలుగులోకి రాకుండా పోతున్నది. నిశ్శబ్దంగా దాదాపు అచైతన్యంగా

ఈ మూల్యం చెల్లించబడుతున్నది. చెడుయొక్క వికృత స్వరూపాన్ని దాచిపెట్టి బహిరంగంగా దానిని పరిగణించడం వల్ల అది నాగరికమైపోయి అతి వ్యయకారకమవుతుంది ప్రతికూల భావం మాత్రం ఉండే పోటీని అది నెలకొల్పుతుంది ఈ ప్రమాదభరితమైన వ్యామోహం సంపదకు, జీవితానికి ఎంత వ్యర్థంగా పరిణమించిందన్న విషయాన్ని దరిద్ర దశకు చేరుకొన్న అనేక కుటుంబాలు, నిష్ఫలమైపోయిన వందల కొలది ఆశలు, నిరాశోపహతులయిన అనేకుల జీవితాలు నిష్ప్రయోజనమైపోయిన అవకాశాలు, ఉపేక్షింపబడిన అనురాగాలు, ఛిన్నాభిన్నమైపోయిన సంపదలు విస్తారంగా వివరించి చెపుతాయి ఇంతే కాకుండా ఒక పాపం పట్ల సంఘం ప్రదర్శించే ద్వేషానికి తగిన పరిమాణంలో సాధారణంగా పశ్చాత్తాపం పడాలని ఉంటుంది భోగనిరతుడైన సురాజుద్దౌలా తనను గురించి చెప్పిన అసహ్యగీతిక నుద్దేశించి "అది నీ తల్లికే కళంకాన్ని ఆపాదిస్తున్నది; నా పేరును మాత్రమే నీవు దీనికి జతపరుస్తున్నావు" అని చురుకైన వేశ్య బాలిక ఒకతె గర్వంగా ఎదురుదెబ్బ కొట్టింది. సంఘం అవసరమైన వృత్తిగా దేనినైతే పరిగణిస్తున్నదో దానిని నీచ వృత్తిగా ఎవరో గాని పేర్కొనటం లేదు ఎవరికెంత రాసిపెట్టివుందో అంతకంటే ఎక్కువ ఆశించనవసరం లేదన్న ఊరడింపు భావం పరితాపానికి సులభంగాని వృత్తి కలిగిస్తుంటుంది నికృష్టదాస్యంకన్నా హీనంగా కవి పరిగణించే ఈ "తెచ్చిపెట్టుకొన్న తృప్తి" పాపపు దురదృష్టకరపెంపకం యొక్క ఘోర శిక్ష. తన కళంకిత జీవితం తనను నైతికంగా కుష్ఠురోగిని చేసివేస్తున్నదని ఆమె తలపోయడానికి కూడ ఇందువల్ల సాధ్యం కాదు. ఆ విధంగా అతి నికృష్టుడైన పాపికి కూడా స్వర్గంలో తెరచివుంచిన పశ్చాత్తాప ద్వారం ఆచారాలలో తలమునకలైపోయిన సమాజంచే పూర్తిగా మూసివేయబడింది. అందు మూలంగా పశ్చాత్తాపహీనమైన అపరాధాన్ని అది ప్రోత్సహిస్తున్నది. ఇతరుల హీనస్థితి ఆధారంగా ఖరీదు చేసే ఆనందాన్ని ఏది కూడ సమర్థించలేదు. కృత్రిమంగా ఏ సిద్ధాంతమైనా ఉండనీయండి. కాని, వాస్తవానికి జీవితంలో ఎల్లరు అనుభవించే స్త్రీగా ఉండిన ఏ స్త్రీకూడా గాయనిగా ఉండదు ఉండలేదు దుఃఖకరమైన ఆమె పరిస్థితే ఆమెను ఆ వృత్తికీ అర్హురాలను చేస్తుంది. పాశ్చాత్య దేశాలలోని గాన మందిరాల గాయనులతో ఈమెను పోల్చేవారు. ఈ ప్రశ్నను మాన మర్యాదలనే వాటి సహాయంతో పరిష్కరిస్తారు. అయితే ఆ దేశాలలో ఈ రకపు జీవితం అగ్రాహ్యముగాను సందర్భవశాత్తు సంభవించే బలహీనతవల్ల ఏర్పడి పోయినదని, ఇక్కడ తప్పనిసరిగా ఉండవలసిన అర్హతగా పరిణమించినదని వారు మరచి పోతున్నారు. గొర్రెను చంపే వాడే కాక ఆ మాంసాన్ని వండేవారు తినేవారుకూడ జీవహింస చేసినవారవుతారని మనువు ఆరోపిస్తున్నాడు అటువంటప్పుడు "పతిత" స్థితిని గాయనీ వృత్తికి నాట్యవృత్తికి ఒక యోగ్యతా పత్రంగా పరిగణించేవారికి వేశ్యబాలిక పతిత జీవనంలోని తప్పులోను అవమానంలోనూ భాగం ఉండదా? సంగీతం దైవాంశమయిన కళ "క్రూర మృగాలను సాధువులొనర్చేటంత క్రిందకు దిగి దేవదూతలంత ఉన్నత శిఖరాలకు" అది చేరుతుంది. "అనంతపుటంచులలోకి తీసుకవెళ్లి ఒక్కక్షణం అందులోకి మన దృష్టిని సారింపజేసే అవ్యక్త అగాధ భాష"అది ప్రేమోపభోగము, ఆత్మవికాసకారకము అయిన సంగీతం బహిరంగ నైతికపతనంతో అపవిత్ర సాంగత్యం పొందడంవల్ల చాలవరకు నిర్లక్ష్యంపబడి అపఖ్యాతి పాలయింది. ఒకప్పుడు మహర్షులుకూడ దానిని బోధించుటకు వెనుకంజ వేసేవారు కాదు. రాకుమార్తెలు కూడ ఈ విద్య నేర్చుకొనకుండా ఉండేవారు కాదు. శీలవతులు, ఉచ్చస్థితిలో ఉన్న స్త్రీలు ఈ కులీన విద్యను నేర్చుకొని ఉపయోగించిన ఉదాహరణలు ఎన్నయినా పేర్కొన వచ్చును వారు దీనిని అగౌరవంగా భావింపలేదు. ప్రజలుకూడ దీనిని దోషముగా పరిగణింపలేదు. ఎప్పుడయితే సంఘం రాజకీయ సంక్షోభం వల్ల స్తిమితము కోల్పోయి సాంఘిక స్థాయి దిగజారి పోయిందో అప్పుడే మర్యాద అంతరించి పోయింది తుచ్ఛవర్తనము అంతరాయం లేకుండా పైకొచ్చినది. శాంతి, విజ్ఞానోదయం అయిన తరువాత ప్రతి చోటా సంగీతాన్ని దాని పూర్వఖ్యాతికి తీసికొని రావలసి ఉండినది అయితే సాంగత్య ప్రభావం దానికి కళంకాన్ని ఆపాదించి పెట్టింది. సంగీతం మన సంఘంలోని వేశ్యల విశేష హక్కు కాదని గర్హించనంత వరకు (వగలాడియొక్క రసహీనమైన సంగీతాన్ని మనం త్రోసి పుచ్చనంత వరకు ఈ పరిస్థితి ఇలాగే ఉంటుంది) అది పాపానికి చేదోడుగాను నిందార్హమైన దానికి ప్రతిబింబంగాను ఉంటూ మరి త స్వేచ్ఛగా మనల్ని బలిగొంటూనే ఉంటుంది సిగ్గువిడియములను పాటించకుండా స్త్రీలోకమంతటిలోనూ తనొక్కతే "దేహాన్ని" అద్దెకిచ్చుకొంటూ సోదరి అన్న పవిత్ర నామాన్ని పోగొట్టుకొని కన్య, భార్య, విధవ కాకుండా బ్రతుకుతూ "చమత్కారంగా మోసపుచ్చేవలలో చిక్కించుకొనే హృదయాన్ని" "నరక ద్వారమయిన గృహాన్ని" కలిగి, తను రోజూ అపవిత్రంచేసేటటువంటి ఆనందం కోసం కళంక పరిచేటటువంటి సౌశీల్యాన్ని నటిస్తూ బతికే వేశ్య పాల్గొనే వినోదాన్ని తిలకించే ప్రతి కుటుంబం భార్య, పిల్లలు,

అతిథులు, స్నేహితులు అందరి మీదా చివరకు కళంకం, హైన్యం, నైచ్యం తమ ప్రభావాన్ని కలిగి ఉంటాయి అశుద్ధాన్ని తాకి అంటుకోకుండా ఉండాలనుకోవడం ఆద్యంతరహితమైన నైతిక శాసనాన్ని రద్దు పరచడానికి ప్రయత్నించటంవంటిదే అవుతుంది విజాని. పూజ్యుడు అయిన డాక్టరు భండార్కరు చెప్పిన అమూల్యమైన మాటలు ఇక్కడ చెప్పడం సబబుగా ఉంటుంది. "వేశ్యలకు ప్రాపకం ఇచ్చేవ్యక్తి, వారు ఎంతో బహిరంగంగా గడిపే దుర్నీతి పూరకమైన జీవితాన్ని తగినట్లుగా అసహ్యించుకోవడం లేదని, స్త్రీలో కులీన లక్షణాలు పెంపొందే భూమి అయిన స్త్రీ పవిత్రతకు ఇవ్వవలసినంత ఔన్నత్యాన్ని ఇవ్వడం లేదని నేను ఎల్లప్పుడూ అభిప్రాయ పడుతూనే ఉన్నాను స్త్రీ పురుషుల నైతిక విలువలను వేశ్యా వృత్తి హైన్యపరుస్తూనే ఉంటుంది సాని మేళాలను ఏర్పాటు చేయడంలోను వాటికి వెళ్ళడంలోను సంతోషాన్ని పొందే పురుషుని విషయంలో గట్టి ఋజువు ఉండినగాని అతను విశ్వసనీయుడైన భర్తగా ఉంటున్నాడని నేను నమ్మను. ఇంట్లో వేశ్యను ఉంచుకోవడమంటే కుటుంబంలోని బాలబాలికలకు, ముఖ్యంగా బాలురకు, దుర్నీతులలో పాఠం చెప్పడమన్న మాట. వేశ్యను షోకైన విషయంగా పరిగణించినంత కాలం, స్వేచ్ఛగా అనుభవించినంతకాలం పురుషుల నైతికస్థాయి గొప్పగా అభివృద్ధి అవడం గాని, స్త్రీలపట్ల మన గౌరవభావం పెంపొందడంగాని సాధ్యపడదు "విషయాన్నంతా క్లుప్తంగా వివరించే విజ్ఞానపూరిత వాక్కులివి" "ప్రభుత్వాధికారులు; సంఘ నాయకులు తాము ఆహ్వానితులయిన ఏ వినోద కార్యక్రమంలో గాని వేశ్యలు పాల్గొనకూడదన్న కోరికను శతాబ్ది ప్రారంభంలో తెలియజేసినట్లయితే భారతదేశంలో నైతికస్థాయి విషయంలో ఖచ్చితమైన అభివృద్ధి కన్పించవచ్చు." అని బిషప్పు వెల్డ్‌నుగారు చెప్పిన మాటలు ఇక్కడ చక్కగా అమరుతాయి

సాంఘిక పవిత్రతా సంఘ సభ్యులకు ఆయన నిర్దేశించిన ప్రతినలు ఎంత ఆసక్తి జనకమైనవో చూడండి

"భగవంతుని సహాయముతో క్రింది సూత్రాలను పాటించడానికి ప్రతిన బూనుతున్నాను."

1. వేశ్యలు వచ్చే సమావేశమునకు కూడా నేను వెళ్లుట గాని లేక నేనే వారిని స్వయముగా ఆహ్వానించుటగాని లేక వారిని ప్రోత్సహించే ఏ పనినైనాగాని చేయను

2. బూతు మాటలను లేక మోటు హాస్యాన్ని వాడుటగాని లేక అశ్లీలమైన పాటలను పాడుటగాని నేను చేయను అట్టి భాషను, పాటలను, హాస్యాన్ని వినుటనుకూడా చేయను

3. అశ్లీలమైన చిత్రాలను, చిత్తరువులను, దృశ్యాలను నేను సందర్శించను.

4. కేవలము ఆనందించుట కొరకు అశుద్ధమైన ఆలోచనలను రేకెత్తించే విషయాలను గురించి చర్చించుట గాని చదువుట గాని నేను చేయను. అటువంటి ఆలోచనలు నాలో కలుగకుండా చేయుటకు వీలయినంత వరకు ప్రయత్నిస్తాను.

5 శారీరకంగా నేను పవిత్రుడుగా ఉంటాను మనస్సును కూడా పవిత్రంగా ఉంచుకొనుటకు సాధారణంగా పవిత్రత్వాన్ని పెంపొందింప చేయుటకు నాకు చేతనయినంత వరకూ ప్రయత్నిస్తాను

దృఢమైన శీలములో ఒక ముఖ్య భాగముగా నా వ్యక్తిగత పవిత్రతను, పరిరక్షించుకోవడానికి, ఇతరులలో దానిని ప్రోత్సహించడానికి గాను, భగవంతుని సహాయములోను మార్గదర్శకత్వములోను సమ్మతించుచు, క్రిందివాటిని నా శక్త్యనుసారము అవలంబించుటకు ప్రతిజ్ఞ పూనుతున్నాను

1. మనోవాక్కాయ కర్మలలో పవిత్రతకు దోహదం చేసే అలవాట్లను అలవరచుకొనుట.

2. నా తండ్రి (లేక సంరక్షకుని) యొక్క అభీష్టములకు ఆజ్ఞానువర్తినై ఉంటూనే నా వ్యక్తిగత పవిత్రతకు హాని కలుగ చేసేటటువంటి కార్యములనుండి వైదొలుగుట.

3. నా స్నేహితులను, సహాధ్యాయులను ఇదేవిధముగా చేయునట్లు సమ్మతింపజేయుట.

స్త్రీలు మాతృ మూర్తులుగాను, సోదరీమణులుగాను ఏ విధముగా చూడబడినారో దృష్టాంతముల నిచ్చియున్నాడు తన వద్ద చేరిన వారిలో ఏ తరగతికి చెందిన స్త్రీ కానీ నిలబడి ఉన్న పక్షములో తాను కూర్చొనెడివాడుకాదు శ్రీ రాజా రామమోహన రాయ్ మార్గమును ఈయన అనుసరించాడు. ఒకసారి కొంతమంది భారతీయ స్త్రీలు మాజిక్ లాంతరు ప్రదర్శనాన్ని తిలకింపవచ్చారు. వారికి ఆసనాలేవీ లేవు. వారికి తొలుత ఆసనాన్ని ఇచ్చింది ఈయనే. మరో సందర్భంలో ఈయన నడి వేసవికాలంలో రైలు ప్రయాణం చేస్తున్నప్పుడు తన రెండవ తరగతి టికెట్టును ఒక ఆంగ్లో ఇండియన్ స్త్రీకి ఇచ్చి ఆమె మూడవతరగతి టికెట్టును తను తీసికొన్నాడు మరో సందర్భంలో బెజవాడ దగ్గర బకింగ్ హాము కాలువలో తిరిగే కొంత మంది పడవ నావికులు ఒక బీద స్త్రీని నీచంగా అపహాస్యం చేయడం ఈయన గమనించారు. గౌరవమయిన వ్యక్తిగా ఆమె తన "కులాన్ని" పోగొట్టుకోవడమున్నది వారికి తోచిన కారణం

(మిగతా వచ్చే సంచికలో)

# ప్రభుత్వ నిర్ణయాలు

అత్యయిక పరిస్థితి ఏర్పడినందువల్ల విశాఖపట్నం, గుంటూరు, సామర్లకోట, బిమిలిపట్నం మొదలైన మునిసిపాలిటీల ఎన్నికలను ప్రభుత్వం వాయిదా వేసింది. అయితే పంచాయతీలు, పట్టణ మునిసిపాలిటీల ఎన్నికలు మాత్రం జరుగుతాయి.

విశాఖపట్నం, మద్రాసు రేవులలో రసాయనిక ఎరువుల నిలువలు నిలిచివున్నందున వీటిని ఈ రేవులకు సమీపంలో నున్న జిల్లాలకు రోడ్డు మార్గంగా తరలించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. అందుకు అయ్యే ఖర్చులను భారత ప్రభుత్వం, సహకార సంఘాలు భరిస్తాయి.

కన్సైన్‌మెంట్ ప్రాతిపదికపై ఎరువులను సరఫరా చేయటానికీ, సహకార సంఘాలకు 3 $\frac{1}{2}$ శాతం రాయితీ వడ్డీ రేటుపై ఆరు నెలల వరకు ఋణాలు ఇవ్వటానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది.

ప్రభుత్వానికి చెందిన సేద్యయోగ్యమైన బంజరు భూములన్నింటినీ సైన్యం నుంచి విడుదలై తిరిగి వచ్చే ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సైనికుల కొరకు ప్రత్యేకించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇది మినహా ఈ భూముల కేటాయింపు విషయంలో ఇదివరకే దాఖలై అపరిష్కృతంగా వున్న రాజకీయ బాధితుల దరఖాస్తులను మాత్రమే వారి అర్హతలను బట్టి పరిశీలించడం జరుగుతుంది.

ప్రస్తుత "సివాయ్ జమా" భూములలో సేద్యాన్ని అనుమతించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. అయితే అంతమాత్రాన ముమ్మందు ఆ భూములు వాటిని సాగుచేసేవారికి ఇవ్వబడతాయని కానీ లేదా వారు వాటిని ఆక్రమించుకోవచ్చని కానీ హామీ లేదు. ఇలాంటి భూములు 750 వేల ఎకరాల వరకు వుంటాయి.

పోరాటం సాగిస్తున్న సైనిక దళాలలో నున్న సైనికుల పిల్లలందరికీ పాఠశాల ఫీజు మాఫు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇతర సహాయక చర్యలను ప్రత్యేకంగా పరిశీలించటానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది.

సచివాలయంలో ప్రవేశించటానికై శాశ్వత, తాత్కాలిక అనుమతి పత్రాల పద్ధతిని ప్రవేశపెట్టటానికి ప్రభుత్వం నిశ్చయించింది. మంత్రులు, శాసన సభ్యులు, సచివాలయ శాశ్వత సిబ్బంది పత్రికా ప్రతినిధులకు శాశ్వత అనుమతి పత్రాలు ఇస్తారు. ప్రధాన ద్వారం వద్ద "విచారణ కార్యాలయాన్ని" నెలకొల్పుతారు. ఇతర గేట్లన్నింటినీ మూసివేస్తారు. 1962 డిశంబరు 1 వ తేదీ నుంచి ఈ పద్ధతిని ప్రవేశపెడతారు.



## తిరుపతి దేవస్థానం వారికి ఇందిరాగాంధి ప్రశంసలు

దేశరక్షణ చర్యల పటిష్టతకై బంగారం ఇచ్చి నందుకు తిరుపతి దేవస్థానం వారికి కేంద్ర అనధికార పౌర మండలి అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధి ప్రశంసలు తెలిపారు.

దేశంలోని ఇతర పుణ్య క్షేత్రాల వారు కూడా తిరుపతి అవలంభించిన ఈ ఆదర్శ మార్గాన్ని అనుసరించగలరని ఆమె ఆశాభావం ప్రకటించారు

దేశ రక్షణ చర్యలను పటిష్ఠం చేయటానికి బంగారం ఇవ్వటానికై కేంద్ర పౌర మండలి పుణ్య క్షేత్రాల వారిని కోరుతుందా అని నవంబరు 7 వ తేదీన పత్రికలవారు క్రొత్త ఢిల్లీలో శ్రీమతి ఇందిరాగాంధీని అడగగా ఆమె పైవిధంగా అన్నారు.



## గోండు బాలునికి జాతీయ పతకం

అసమానమైన ధైర్య సాహసాలు ప్రదర్శించినందుకుగాను భారత శిశు సంక్షేమ మండలివారు బహూకరించే జాతీయ పతకం ఆదిలాబాదుకు చెందిన కుమార ఆత్రమ్ జలపతి అనే 13 సంవత్సరాల బాలునికి లభించింది

క్రిందటి సంవత్సరం ఉట్నూరు తాలూకా తడ్డ పూనర్ గ్రామ శివారు అయిన జంబాడ వాస్తవ్యుడు కుమార కొండిగరావు పశువులను మేపుతుండగా ఒక పులి అతనిమీద కురికింది అ సమయంలో అతని వెంట వున్న ఆత్రమ్ జలపతి ఆ పులిపై దాడిజరిపి వెన్వెంటనే కేకలు వేశాడు

బాలుని కేకలు విని గ్రామస్థులు ప్రమాద స్థలానికి పరుగెత్తుకొని వచ్చారు. ప్రజలగుంపును చూసి పులి పారిపోయింది



## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1962 అక్టోబరులో తెలంగాణా ప్రాంతంలోని దిగువ గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలు చేకూర్చారు. (1) సూర్యాపేట తాలూకా ఎరకవరం (2) ఇబ్రహీంపట్నం తాలూకా చెడరపల్లి (3) ఇబ్రహీంపట్నం తాలూకా నందివనపర్తి, (4) నల్గొండ తాలూకా బుధారం (5) సూర్యాపేట తాలూకా బల్వెమల

శ్రీకాకుళం తాలూకా కొర్లకోట, కలివరం, తొగరం గ్రామాలకు సెప్టెంబరు నెలలో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు.

పార్వతీపురం తాలూకా కురుప్పం గ్రామంలో అక్టోబరులో 30 వీధి దీపాలను వెలిగించారు.



# జాతీయాభివృద్ధి మండలి ప్రకటన

పదిహేను సంవత్సరాల క్రితం మనం స్వాతంత్ర్యం పొందాం. నేడు ఆ స్వాతంత్ర్యానికి ముప్పు వాటిల్లింది. మన మాతృభూమి చరిత్రలో చైనీయుల దురాక్రమణ ఒక ముఖ్య సంఘటన. ఈ విపత్కర పరిస్థితిలో విభేదాలన్నింటినీ విడనాడి ఒక్కుమ్మడిగా మన దేశ నాయకునికి అండగా నిలబడాలనే జాతి యొక్క దృఢ నిశ్చయాన్ని జాతీయాభివృద్ధి మండలి ప్రకటిస్తున్నది. చైనీయుల దురాక్రమణను త్రిప్పి కొట్టటానికి సర్వశక్తులూ ధారపోయటానికి, ఎంత త్యాగమైనా చేయటానికి జాతీయాభివృద్ధి మండలి ఇందు మూలంగా ప్రతిజ్ఞ చేస్తున్నది.

స్వతంత్ర భారత దేశం ఎల్లప్పుడూ కూడా ప్రపంచ ప్రజలపట్ల శాంతి స్నేహవిధానాలనే అవలంబించింది. చైనాపట్ల నిజమైన మిత్రదేశంగానే ప్రవర్తించింది. చైనా సరిహద్దు వివాదాలను రేపినప్పుడు భారతదేశం వాటిని ఎప్పుడూకూడా శాంతియుత మార్గాలద్వారా, మైత్రిపూర్వకమైన సంప్రదింపులద్వారా పరిష్కరింపదలిచింది. అయినప్పటికీ చైనా దౌర్జన్య పద్ధతులను, దురాక్రమణ విధానాలనే అవలంబించింది. భారత భూభాగంపై దాడి జరిపింది. చైనీయుల ఈ దురాక్రమణ కేవలం మన దేశ సరిహద్దులను ఉల్లంఘించడం మాత్రమే కాదు. ఇది మన స్వాతంత్ర్యం, మన ప్రజాస్వామిక విలువలు, అంతర్జాతీయ శాంతి పురోభివృద్ధికి సంబంధించిన మన జాతీయ విధానాలపైకూడా దాడి జరపడమే అవుతుంది. అంతేగాక ఇది అంతర్జాతీయ ప్రవర్తనకు సంబంధించిన పరిగణించబడిన ప్రమాణాలన్నింటినీ ఉల్లంఘించటంకూడా అవుతుంది. శక్తివంతుడు, నిర్దాక్షిణ్యుడు, నీతిబాహ్యుడు అయిన దురాక్రమణదారుని ఈ నాడు మనం ఎదుర్కొంటున్నామనే విషయాన్ని మనం గుర్తించాము. ఈ సవాలును ఎదుర్కోటానికి ప్రజలు బ్రహ్మాండమైన కృషి జరపాలి.

ఈ ప్రమాద సమయంలో దేశమంతటా ప్రజలలో అపారమైన చైతన్యం వెల్లివిరుస్తున్నది. జాతీయాత్మ జాగరూకమై నవ్యోత్తేజం పొందింది. ఈ క్లిష్టతరుణంలో ప్రజలు క్రమశిక్షణతో వ్యవహరించటం, దృఢ సంకల్పంతో కృషిచేయటం అవసరం. జనశక్తిని సక్రమ మార్గంలో వినియోగించవలసి వుంది. లక్షల సంఖ్యలోగల మన యువజనులకు జాతీయ రక్షణకై శిక్షణ ఇవ్వాలి. బృహత్తరమైన మన లక్ష్యసాధనకై దేశవనరులన్నింటినీ సమీకరించ వలసివుంది. జాతీయ కృషిని సమాయత్త పరచవలసి వుంది.

యుద్ధ రంగంలోని మన సైనికులు ఆ ప్రాంతం దుర్గమమైనది కావటంచేత ఇబ్బందులకు గురి కావలసి వస్తున్నప్పటికీ అధిక సంఖ్యలోనున్న శత్రుబలగాలను ఎదుర్కోవటంలో అమోఘమైన ధైర్యసాహసాలు ప్రదర్శిస్తున్నారు. వ్యవసాయ క్షేత్రాలలో, ఫ్యాక్టరీలలో పనిచేసే ప్రజలు యుద్ధభూమిలోని మన సైనికులకు తమ అధికోత్పత్తి కృషి ద్వారా తోడ్పడవలసి వుంది. అందువల్లనే జాతీయాభివృద్ధి మండలి దేశ అభివృద్ధి ప్రణాళికలను జాతీయ రక్షణ కృషిలో అంతర్భాగంగా పరిగణిస్తున్నది. ఈ సందర్భంలో ఆత్యయిక పరిస్థితిని తట్టుకోటానికి వీలుగా అవసరమైన మార్పులతో ప్రణాళికను శీఘ్రంగానూ, విజయవంతంగానూ అమలుపరిచటం తప్పనిసరి అవుతుంది. కాగా ఇందుకు సాధన సంపత్తి పొదుపు చేయటం ద్వారానే సమకూరగలుగుతుంది. పొదుపుచెయ్యటమంటే భవిష్యత్తుకై ఇప్పుడు త్యాగాలు చెయ్యటమే అవుతుంది. సమాజంలో అత్యధికంగా పొదుపు జరగటానికి అనువైన వాతావరణాన్ని కల్పించటానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగు చర్యలు గైకొనాలి. ఈ విధంగా పొదుపు చేసిన దానిని జాతీయ కృషికై మితంగా, సమర్థంగా వినియోగించుకోవాలి.

పౌర వినియోగానికి ఆహారం, ఇతర అత్యవసర సరుకుల సరఫరాలకు సంబంధించిన ప్రస్తుత పరిస్థితిని మండలి గమనించి ఆహార పదార్థాలు మొదలైన వాటిని నిలువ చేయటం, అక్రమ లాభాలు గడించటాన్ని నిరోధించటానికీ, అత్యవసర సరుకుల ధరల అనుచితమైన పెరుగుదలను అరికట్టటానికి తన నిశ్చయాన్ని స్పష్టీకరించింది. సహకార సంస్థల ద్వారా సరుకులను పంపిణీ చేసే విధానం అభివృద్ధిపరచబడుతుంది. ప్రతి చోటా "విజిలెన్స్ కమిటీలు" పరిస్థితిని జాగ్రత్తగా గమనిస్తూ వుంటాయి.

దేశ సమగ్రతను పరిరక్షించటానికి బృహత్తర కృషి జరపటానికై తమ తమ రాష్ట్రాల నుంచి అంగబలాన్ని, అర్థబలాన్ని, వస్తు సంపదను—సమస్త వనరులనూ సమీకరించటానికి సమావేశానికి హాజరైన ముఖ్యమంత్రులు ప్రతిన బూనారు.

మన రాజ్యాంగంలో అనుసరించిన ప్రజాస్వామిక జీవన విధానాన్ని సంరక్షించుకోటానికై మన స్వాతంత్ర్య పరిరక్షణకూ, మన గౌరవ ప్రతిష్ఠల మనుగడకూ మనం పోరాడుతున్నాము. న్యాయ సమ్మతమైన మన లక్ష్యం పట్ల విశ్వాసం వుంచి మన మాతృ భూమి రక్షణకు మన జీవితాలను అంకితం చేద్దాం. **



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌరరక్షణ కమిటీ ప్రథమ సమావేశానికి హైద్రాబాద్‌లో 1962 నవంబరు 8వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.




జాతీయ రక్షణబాండ్లు:- ఆంధ్రప్రదేశ్ గవర్నరు జనరల్ యస్. యం. శ్రీనగేష్ 1962 నవంబరు 10వ తేదీన హైద్రాబాదు లోని స్టేట్‌బ్యాంకు కౌంటర్‌వద్ద రక్షణ బాండ్లను మొట్టమొదటగా కొన్నారు.

ప్రతిఒక్కరూ యథాశక్తి విరాళాలు యిస్తున్నారు. రాష్ట్రంనుండి దేశంలో నలుమూలలనుంచి రక్షణనిధికి సంతతధారగా విరాళాలు వస్తున్నాయి.



6 సంవత్సరాల బాలిక అంజలీ గోపాల్ పాఠక్ తన బంగారు ఉంగరాన్ని ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు సమర్పిస్తున్నది.



సమాచార, పౌరసంబంధాల శాఖలో పనిచేస్తున్న శ్రీ ఖాదర్ ఖాన్ (డ్రైవరు), జాతీయ రక్షణ నిధికి ప్రతినెలా రు. 10, లను విరాళంగా యిచ్చారు.



సమాచార, పౌరసంబంధాల శాఖలో పనిచేస్తున్న శ్రీ జి. యం. ఖాన్, (బంట్రోతు) జాతీయ రక్షణ నిధికి ప్రతినెలా రు. 5 లను విరాళంగా యిచ్చారు.



హైద్రాబాదులో సైనికుల రిక్రూటుమెంటు దృశ్యం.

చైనా దురాక్రమణను ఖండిస్తూ నగరంలో ఆర్టిస్టుల ఊరేగింపు.



చైనా దురాక్రమణను ఖండిస్తూ 1962 నవంబరు 2వ తేదీన హైదరాబాదులో జరిగిన విద్యార్థుల ఊరేగింపు దృశ్యం.



విద్యార్థుల ఊరేగింపు మరోదృశ్యం.



అనంతపురంలోని ఆయిల్ టెక్నలాజికల్ రీసర్చి సంస్థ.



అపూర్వ వాత్సల్యం:— దూడకు పాలిస్తున్న మేక—తిరుపతిలోని పశువైద్య కళాశాల విద్యార్థి శ్రీ కె. కె. మోహన్ తీసిన అపూర్వమైన ఫోటో:—నేటికి కూడా దూడ క్రమం తప్పకుండా మేకదగ్గరికి వెళ్ళి పాలు తాగుతోంది. తన స్వంతపిల్లలకు పాలిచ్చినట్లుగానే మేక నిలబడుతుంది.



కల్లూరులోని పాఠశాలలో మధ్యాహ్నభోజన పథకాన్ని అమలు జరుపుతున్నారు.




—"స్వరాజ్య" సౌజన్యంతో







—"స్టేట్సుమన్" సౌజన్యంతో

# పబ్లిక్ వర్క్సుశాఖ కార్యకలాపాలు

## సేద్యపు నీటి వనరులు

ఒక సంవత్సరకాలంపైగా ప్రణాళిక అమలు జరిగిన తరువాత, కొన్ని నూతన పరిస్థితులు తలెత్తాయి. తత్ఫలితంగా ప్రణాళికా కేటాయింపులను పునః పరిశీలించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని పథకాలపై జరిగే వ్యయంలో సాధ్యమైనంత ఎక్కువగా పొదుపు చేయడానికిగల అవకాశాన్ని అన్వేషించడం ద్వారా అనివార్యమైన కొన్ని పనులకు అదనపు మొత్తాలను కేటాయించే ఉద్దేశంతో ప్రణాళికాశాఖ ప్రతి శాఖ తాలూకు ప్రణాళికా పథకాలను సమీక్షించింది. సవరించిన ప్రణాళికలో సేద్యపు నీటి పారుదల పథకాలకు (భారీ, మధ్యరకం వరదనిరోధక కార్యక్రమాలు, ఇంజనీరింగ్, పరిశోధన కార్యక్రమాలు) తృతీయ ప్రణాళికలో రూ 2963 44 లక్షలు ప్రత్యేకించారు అయితే ఈ పథకాలకు మొదట కేటాయించినది రూ 3123 00 లక్షలు.

తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ, పోచంపాడు వంటి భారీ పథకాల పనులు విలకడగా చురుగ్గా కొనసాగడానికి వీలుగా వర్తమాన ఆర్థిక సంవత్సరానికి (1962–63) చేసిన కేటాయింపును రూ 335 60 లక్షల నుంచి రూ. 461 89 లక్షలకు పెంచారు. పై పథకాల పనులు ఇదివరకే శీఘ్రంగా కొనసాగుతున్నాయి ప్రస్తుతం చేసిన కేటాయింపులు సంపూర్ణంగా వినియోగించుకొనబడగలవని భావిస్తున్నారు.

ప్రణాళికా సంఘం, ప్రభుత్వాల ఆదేశాన్ని పురస్కరించుకొని 1963–64 వ సంవత్సరానికి రూ. 591.32 లక్షల వ్యయంతో కూడిన ఒక ప్రణాళికను పరిశీలనార్థం ప్రభుత్వానికి పంపారు. ఈ ప్రణాళికా వ్యయం సవరించిన పూర్తి ప్రణాళిక కేటాయింపులో 20 శాతం

## చిన్నతరహా సేద్యపు నీటి వనరులు

సవరించబడిన తృతీయ పంచవర్ష ప్రణాళికలో పబ్లిక్ వర్క్సు శాఖ తాలూకు చిన్నతరహా సేద్యపు నీటి పారుదల కార్యక్రమాలకు రూ. 2009 08 లక్షలు ప్రత్యేకించారు. ఆశించినట్టుగానే ప్రస్తుత సంవత్సరపు కేటాయింపును రూ. 257.87 లక్షలకు హెచ్చించారు.

1963–64 వ సంవత్సరానికై రూ 509 00 లక్షల వ్యయంతో కూడుకున్న ప్రణాళికను పరిశీలన నిమిత్తం ప్రభుత్వానికి పంపారు.

## రహదార్లు

(1) విజయవాడ సమీపంలో అయిదవ జాతీయ రహదారి మళ్లింపులో బందరు కాలువపై వలయాకారపు వంతెన నిర్మాణం: మొదటి అంచనా. రూ. 5,58,400

సవరించిన అంచనా. రూ 6,96,000

ఈ వంతెనను, విజయవాడ సమీపంలో బందరు కాలువపై 500 అడుగుల వ్యాసార్థపువంపులో నిర్మిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇదే ఇలాంటి మొట్టమొదటి వంతెన దీనిని బావులపై నిర్మిస్తున్నారు వంతెనక్రింది భాగంలో ఆర్. సి. సి. బోలు స్తంభాలూ, పై భాగంలో పెట్టె ఆకారంగల బోలు బారు దూలాలు (ఆర్. సి. సి) వుంటాయి పూర్తి ఎత్తు 8 అడుగుల 10 ½ అంగుళాలు రోడ్డు మార్గం 26 అడుగులు. రెండు వైపులా 5 అడుగుల కాలిబాటలుంటాయి. వంతెనపూర్తి నిడివి 240 అడుగులు, ఇరువైపులా 40 అడుగుల కాంటిలివర్స్ వుంటాయి వీటి మధ్యదూరం 160 అడుగులు. వంతెన పైభాగం పనులు సగానికి పైగా పూర్తయ్యాయి. ఈ వంతెనను వంపులో నిర్మిస్తున్నారు గంటకు 40 మైళ్ల వేగంతో వెళ్లే శకటాలు సులభంగా వంపుతిరగటానికి అనువుగా దీనిని నిర్మిస్తున్నారు

(2) అయిదవ జాతీయ రహదారిపై విజయవాడ వద్ద కృష్ణానదిపై రెగ్యులేటర్–రోడ్డు వంతెనను ఉత్తరం వైపునుంచి వచ్చి కలిసే రోడ్డు నిర్మాణం.

మొదటి అంచనా: రూ. 8,01,437

సవరించిన అంచనా·రూ 9,44,000

ఇది విజయవాడవద్ద గ్రాండ్‌ట్రంక్ రోడ్డు మళ్లింపుగా ఉపయోగపడుతుంది మళ్లింపు పూర్తి నిడివి ఆరుమైళ్ల 3 ఫర్లాంగుల 120 అడుగులు. ఈ మళ్లింపురోడ్డు విజయవాడ మునిసిపల్ హద్దులలో రద్దీని తగ్గిస్తుంది. అయిదవ జాతీయ రహదారిపై ప్రయాణం చేసే శకటాలకు నేరుగా కలకత్తా వెళ్లే మార్గంతో సంబంధం ఏర్పరుస్తుంది.

నిర్మాణం త్వరితంగా సాగటానికి వీలుగా ఈ పనిని నాలుగు భాగాల క్రింద విభజించారు. ఇది కృష్ణా బరాజ్ కలకత్తా వైపున ఆరంభమై కృష్ణా వరద కట్టగుండా వెళ్లి బందరు కాలువను 3/2 వ మైలువద్ద దాటి తోటభూములు, సుక్షేత్రాలైన మాగాణీ భూములగుండా పయనించి చివరకు ప్రస్తుత గ్రాండ్ ట్రంక్‌రోడ్డును రామవరప్పాడు గ్రామంవద్ద 274/2-3వ మైలు వద్ద కలుస్తుంది మొదటి రెండు భాగాలపని కొనసాగుతున్నది. కృష్ణా నదిపై ప్రస్తుతపు రైలు వంతెన సమీపంలో ఒక భూమార్గాన్ని నిర్మించవలసివుంది. దీని నిర్మాణం ముగిశాక విజయవాడలోని ఇతర దిగువ వంతెనలు, నదితోపాటుగా ఇదికూడా ఒక సుందరమైన స్థలంగా రూపొందుతుంది భూమార్గం నిర్మాణాన్ని రైల్వే శాఖవారు నిర్వహిస్తారు. మై. 1/1 నుంచి మై 3/2 వరకు గల మూడవభాగం పని దాదాపు పూర్తికావచ్చింది. బందరు కాలువకు అడ్డంగా వర్తులాకారపు వంతెన నిర్మాణం సాగుతున్నది. నాలుగవ భాగం కలకత్తా వైపున ఆరంభమై రామవరప్పాడు గ్రామంవద్ద పూర్తవుతుంది. దీని పొడవు 3 మైళ్లు 15 చిన్న గొట్టపు వంతెనల పనిపూర్తయింది. చప్టా వంతెనపని కొనసాగుతున్నది. మరో మూడు చిన్న వంతెనపనులను చేపట్టారు ఈ పనులన్నికూడా త్వరితంగా అమలుజరుగుతున్నాయి. రైల్వేవారుచేపట్టే భూమార్గం పనులు మినహా మిగిలిన పనులన్నీ బహుశా 1963 జూన్ నాటికి సమాప్తమవుతాయి.

(3) ముక్త్యేశ్వరం—జగ్గయ్యపేట రోడ్డుపై 4/3వ మైలువద్ద అడ్డకట్టదారి నిర్మాణం—ప్రణాళికా పనులు.

అంచనా మొత్తం రూ. 3,75,000/—

ఈ అడ్డకట్ట దారికి ప్రధానంగా 25 అడుగుల "స్పాన్"లు 8 వుంటాయి. జగ్గయ్యపేట వైపున 204 అడుగులు, ముక్త్యాల వైపున 110 అడుగుల పై "అప్రోచు"లు ఏర్పరచటానికి ప్రతిపాదించారు

దీని పునాదులను పెద్ద బండమీద నిర్మించటానికి ప్రతిపాదించారు ప్రతిస్తంభానికీ క్రిందబావులు వున్నాయి. బావులను 12 అడుగులు, 8 అడుగుల కొలతలతో గుండ్రని మూలలతో నిర్మించారు 2 అడుగుల మందాన గచ్చు చేశారు. బావులలో అడుగున, పైన వరుసగా 4 అడుగులు, ఒక అడుగు వరకు దిమ్మెస వేయటానికి ప్రతిపాదించారు.

బావుల ఉపరిభాగాన్ని ఒక అడుగు ఆరు అంగుళాల మందంగల ఆర్ సి సి కాపింగ్ స్లాబుతో కలిపివేయటానికి ప్రతిపాదించారు. "హాండ్‌పోస్టు"ల మధ్యరోడ్డు మార్గం నిడివి 226 అడుగులు వుంటుంది.

బావుల త్రవ్వకం ఆరంభమైంది. అంచనాలోతు మేరకు వాటిని దాదాపు త్రవ్వటం పూర్తి అయింది. కాని ఈ బావులను మరింత లోతుగా త్రవ్వవలసిన అవసరం ఏర్పడింది బావులలో పెద్ద రాతిబండలు వుండటంవల్ల పనివేగం కొంత మందగించింది. ఈ వంతెనవల్ల ముక్త్యాల వైపునగల గ్రామాలకూ జగ్గయ్యపేటకు మధ్య నిర్విఘ్నంగా రాకపోకలు జరగటానికి వీలు ఏర్పడుతుంది. ముక్త్యాల, జగ్గయ్యపేట, వైరాలను కలిపే రోడ్డుపై ఇది వుంది. కృష్ణ, ఖమ్మం జిల్లాలను ఇది కలుపుతుంది

(4) జగ్గయ్యపేట—బోనకల్లు రోడ్డు పై 15-1-5 వ మైలు వద్ద మునివేరుకు అడ్డంగా అడ్డకట్టదారి నిర్మాణం:

మొదటి అంచనా · రూ. 9,00,000

సవరించిన అంచనా రూ. 8,73,000

ఈ అడ్డకట్టదారికి 54 "స్పాను"లున్నాయి ఒక్కొక్కదాని నిడివి 15 అడుగులు. దిగువ ప్రవాహం వైపున గోడను 176 00 మట్టంలో నిర్మించగా ఎగువ ప్రవాహం వైపున 184.00 మట్టంలో నిర్మిస్తారు. కాగా రోడ్డు 193 50 మట్టంలో వుంటుంది. తూములు లేని భాగంలో గోడలతో సహా ఆరు "స్పానులు" నిర్మించబడతాయి. ఒక్కొక్కదాని నిడివి 15 అడుగులు. అడ్డకట్టదారి మొత్తం పొడవులో "గైడ్ పోస్టుల" మధ్య రోడ్డు నిడివి 24 అడుగులు వుంటుంది.

ఈ పని ప్రారంభించారు. కొంత పని అంటే తూములు లేని భాగంలో గోడలను నిర్మించే పని ముగిసింది. 1964 జూన్ నాటికి బహుశా ఈ పనులన్నీ సమాప్తమవుతాయి.

పాలేరు, మునివేరుపై గల ఈ వంతెనను నిర్మించటం వల్ల వ్యాపార కేంద్రమైన జగ్గయ్యపేటకు ఖమ్మం జిల్లా నుంచి రాకపోకల సంబంధం ఏర్పడుతుంది.

### విద్యుచ్ఛక్తి :

### గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలు

1962 సెప్టెంబరు నెలలో 9 గ్రామాలకు, 559 పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు

గుణదల సబ్ స్టేషను : గుణదలలో 7-5 ఎం. వి ఏ సెంక్రొనస్ కండెన్సర్లను రెండింటిని నెలకొల్పడం పూర్తయింది వాటిని పరీక్షించి వినియోగంలోకి తేవల్సి వుంది

గుత్తిమార్గం : హంపి నుంచి కడప వరకు 132 కి వా లైను వేయడానికి ఉత్తర్వులు చేయటం జరిగింది. లైను వేసే పనులు జరుగుతున్నాయి

### తెలంగాణా జల విద్యుత్ పథకం

(అ) తాడేపల్లి-హైద్రాబాదు 132 కి వా. లైనుతో కలిసే నాగార్జునసాగర్-హైద్రాబాదు లైనులో టవర్ల స్థాపన దాదాపు పూర్తిఅయింది. తాడేపల్లి నాగార్జునసాగర్ లైనుపై "స్టబ్స్" వేసే పని జరుగుతున్నది.

(ఆ) హుస్సేన్‌సాగర్ వద్ద బాయిలర్‌కు పునాదులు నిర్మించడం, రామగుండం వద్ద నాచురల్ డ్రాఫ్టు హైడ్రాలిక్ కూలింగ్ టవర్ (II) నెలకొల్పటం జరుగుతున్నది. హుస్సేన్‌సాగర్ వద్ద బాయిలర్ హౌస్ నిర్మాణం కూడా కొనసాగుతున్నది.

(ఇ) జంటనగరాలలో విద్యుదుత్పత్తి అభివృద్ధికై నెల్లూరు విద్యుత్కేంద్రం నుంచి తెప్పించబడిన 2,500 కి. వా. ల సెట్టును నెలకొల్పారు అవసరమైన పరీక్షలు కూడా ముగిశాయి. ఇప్పుడిది వాణిజ్య వినియోగానికై సిద్ధంగా వుంది.

### కొత్తగూడెం థర్మల్ పథకం

కొత్తగూడెం. వరంగల్ - రామగుండం 132 కి. వా. డబుల్ సర్క్యూట్ లైనుకు అవసరమైన పరికరాలకై ప్రాథమిక ఉత్తర్వులు చేయడం జరిగింది

### ప్రసారం, పంపిణీ పథకం

(అ) ఎగువ సీలేరు-నాగార్జునసాగర్ 220 కి.వా లైనుకై ప్రాథమిక ఉత్తర్వులు జరిగాయి. ఈ లైనుపై సమగ్రమైన సర్వేలు జరపటానికి ఏర్పాట్లు చేశారు.

(ఆ) నాగార్జునసాగర్ సబ్‌స్టేషను నిర్మాణానికి స్థల నిర్ణయం జరిగింది భూమి సేకరణకు సంబంధించిన ప్రతిపాదనలను పరిశీలిస్తున్నారు



# పదరా!

పదపదపదరా, భావిపౌరుడవు
భరతమాత కనుపండువుగా ॥పద॥

నదరాబెదురా అదరకు మెదలో
వీరతేజమది. అలరగమదిలో ॥పద॥

నడుముగట్టరా, నడకసాగరా,
నాగరికుండవు, నాణెకాడవన ॥పద॥

నాదేశంబిది. నాసంస్కృతియని.
ఆదేశింపర. అన్ని దిశలలో ॥పద॥

పంచశీలయని. మంచిమాటలను.
వంచించిన యావంచకు ద్రుంచర ॥పద॥

దురాక్రమణలను దురాత్ములను తగ,
పరాభవింపర, పరాక్రమింపర ॥పద॥

—కృత్తివెంటి వెంకట సుబ్బారావు

———

# సర్టిఫైడ్ రేడియోలాజికల్ అసిస్టెంట్ల కోర్సు 1963

## రేడియం ఇనిస్టిట్యూట్, కాన్సర్ ఆసుపత్రి, రెడ్‌హిల్స్, హైదరాబాదు. ఆం ప్ర.

సర్టిఫైడ్ రేడియోలాజికల్ అసిస్టెంట్స్ కోర్సులో శిక్షణ పొందటానికి అభ్యర్థులనుంచి దరఖాస్తులు కోరబడుతున్నాయి. ఈ కోర్సు ఆంధ్రప్రదేశ్ హైదరాబాదులోని రేడియం ఇనిస్టిట్యూటు, కాన్సర్ ఆసుపత్రిలో 1963 జనవరి మొదటి తేదీ నుంచి ఆరంభించబడుతుంది. భారత ప్రభుత్వం ఆమోదించిన పాఠ్యప్రణాళికననుసరించి ఈ కోర్సు 18 నెలల పాటు జరుగుతుంది మరో 6 నెలల పాటు ప్రత్యక్ష శిక్షణ ఇవ్వబడుతుంది.

**వయస్సు :** అభ్యర్థుల వయస్సు 1963 జనవరి మొదటి తేదీ నాటికి 17 సంవత్సరాలకు తగ్గకుండా 27 సంవత్సరాలకు మించకుండా వుండాలి.

**ప్రవేశార్హతలు :** పరిగణింపబడిన ఏదైనా విశ్వవిద్యాలయం యొక్క ఇంటర్మీడియేటు లేదా పి. యు. సి. పరీక్షలో భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రాలను ప్రత్యేక విషయాలుగా తీసుకొని ఉత్తీర్ణులై వుండాలి. లేదా విశ్వవిద్యాలయంచే ఇందుకు సమానమైనదిగా పరిగణించబడిన ఏదైనా విద్యార్హత కలిగివుండాలి. ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్‌లో పరిగణించబడిన డిప్లొమా పొందినవారికి ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

**స్టయిపెండు :** కోర్సులో చేర్చుకొనబడిన ప్రతి అభ్యర్థికీ కోర్సు కాలం పూర్తయ్యే వరకు నెలకు రూ. 60/– ల చొప్పున స్టయిపెండు చెల్లించబడుతుంది. ఎన్నిక చేయబడిన అభ్యర్థులు నిర్ణీత ఫారములో బాండు వ్రాయవలసి వుంటుంది. ఈ కోర్సులో చేరదలచిన అభ్యర్థులు దిగువ వివరాలను పేర్కొంటూ ఈ క్రింద సంతకం చేసినవారికి దరఖాస్తులు దాఖలు చేయవచ్చు:–

1. పేరు (విడి అక్షరాలలో)
2. తండ్రి పేరు, వృత్తి
3. పూర్తి చిరునామా
4. వయస్సు, జన్మించిన తేదీ (క్రీస్తు శకం ప్రకారం)
5. విద్యాయోగ్యతలు (హాజరైన పాఠశాలలు, కళాశాలల జాబితాను జతపరచాలి)
6 మతం, తెగ (నిమ్నజాతులు, నిమ్న తెగలు, వెనుకబడిన తరగతులకు చెందిన అభ్యర్థులు ఆ విషయాన్ని ధ్రువపరచు సర్టిఫికెటును జతపరచాలి)
7. అభ్యర్థి జన్మస్థానం, జిల్లా.
8. దిగువ పేర్కొన్న పత్రాల ధ్రువీకృత ప్రతులను జతపరచాలి :
   1. హెచ్ ఎస్ ఎల్.సి / హెచ్ ఎస్ సి. మెట్రిక్యులేషను సర్టిఫికెట్లు.
   2 ఇంటర్మీడియేటు, పి యు సి, లేదా దానికి సమానమైన పరీక్ష సర్టిఫికెటు
   3. మార్కుల పట్టిక (ఇంటర్మీడియేటు, పి యు.సి. లేక దానికి సమానమైన పరీక్ష)
   4. పాస్‌పోర్టు సైజు ఫొటో.

దరఖాస్తులు దిగువ సంతకం చేసినవారికి 1962 డిసెంబరు 15 వ తేదీన కానీ తత్పూర్వం కాని చేరాలి అసంపూర్ణంగా వున్న దరఖాస్తులు పరిశీలించబడవు. ఉత్తర ప్రత్యుత్తరాలు జరపబడవు. ఎన్నిక చేయబడినవారికి ఆ సంగతి తెలియజేయబడుతుంది

(సం) (హెచ్. సయ్యద్ అలీ)

సూపరింటెండెంటు, రేడియం ఇనిస్టిట్యూటు, కాన్సర్ ఆసుపత్రి,

రెడ్‌హిల్స్, హైదరాబాదు.

# ముమ్మరంగా సాగుతున్న మన యుద్ధ ప్రయత్నాలు

"స్వాతంత్ర్య సాధనకు మనం పోరాడినాము. దానిని రక్షించుకోడానికి కూడా వెనుదీయము ..నేటి మన శత్రువు నీతి, నియమాలు లేనివాడు. న్యాయానికి కట్టుబడడు. ధర్మాన్ని లక్ష్య పెట్టడు. అందువల్ల మనం పూర్వంకంటే ఎక్కువదీక్షతో పోరాడవలసిన సమయమిది. మనలోని త్యాగశీలము, పట్టుదల, మాతృదేశ సేవానురక్తి ఈనాడు ద్విగుణీకృతంగా ప్రదర్శించాలి," అని రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి, అక్టోబరు 29 వ తేదీన ఆకాశవాణి ద్వారా ప్రజానీకానికి పిలుపునిస్తూ అన్నారు. నడుములు బిగించి సన్నద్ధంగా వుండాలని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు. దీనితో ఆంధ్రప్రదేశ్ లో యుద్ధప్రయత్నాలు ఆరంభమై ముమ్మరంగా కొనసాగుతున్నది.

ఆ తరువాత నాలుగు రోజులకు మంత్రివర్గం సమావేశమై రాష్ట్ర అంగబలం, అర్థబలం, వస్తుసంపదలను పూర్తిగా సంపూర్ణ యుద్ధప్రయత్నానికై కేంద్రప్రభుత్వపరం చేయడానికి నిశ్చయించింది. రాష్ట్రం తీసుకున్న ఈ ఉత్తేజకరమైన చర్యకు దేశమంతటినుంచీ ప్రశంసలు లభించాయి. రాష్ట్ర స్థాయిలో యుద్ధ ప్రయత్నాలను తీవ్రంగా సాగించడానికి తొలిచర్యగా ముఖ్యమంత్రి అధ్యక్షతన 63 మంది సభ్యులతో ఆంధ్రప్రదేశ్ ప్రజారక్షణ సంఘాన్ని స్థాపించారు

## సభ్యత్వం

ఈ సంఘంలో విభిన్నరంగాలకు చెందిన వ్యక్తులకు ప్రాతినిధ్యం కల్పించబడింది. యుద్ధ ప్రయత్నాలు సాగించడానికీ, జాతీయ రక్షణనిధికి మొత్తాలు సేకరించడానికీ, సరుకులు నిలవ చేయడం, అక్రమ లాభాలు గడించడం, అత్యవసర సరుకుల ధరలు పెంచడాన్ని అరికట్టడం ద్వారా ప్రజల సాధారణ ఆర్థిక జీవితానికి ఎట్టి అంతరాయం కలుగకుండా జాగ్రత్త వహించడానికీ, రాష్ట్రంలో వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో అధికోత్పత్తిని సాధించడానికీ, రక్షణ దళాలకు సౌకర్యాలు చేకూర్చడానికీ, యుద్ధరంగంలోని సైనికుల కుటుంబాలకు సమస్త సహాయం అందజేయడానికీ ప్రజారక్షణ సంఘం కృషిచేస్తుంది. ఈ సంఘంలో రాష్ట్రమంత్రులందరూ సభ్యులుగా వుంటారు. వీరితో పాటు దిగువ వారిని సభ్యులుగా చేకూర్చుకున్నారు:—

1 శ్రీ టి. విశ్వనాథం. 2 శ్రీ కె. వి. నారాయణరెడ్డి, 3 శ్రీ జి లచ్చన్న, 4 ముకర్రంజా రాకుమారుడు. 5. రాణీ కుముదినీదేవి, 6. శ్రీ జె డి లాహోటీ, 7 ఆంధ్రప్రదేశ్ వాణిజ్యమండలి అధ్యక్షుడు, 8 శ్రీ పన్నాలాల్ పిట్టీ, 9 శ్రీ వాసుదేవ్ నాయక్, 10. శ్రీ జి. బ్రహ్మయ్య, 11 డా బి. రామకృష్ణ రావు, 12 శ్రీ బి. రామచంద్రారెడ్డి, 13. శ్రీ వి. బి రాజు, 14 శ్రీ కె. వి రంగారెడ్డి, 15. బొబ్బిలిరాజా, 16. ఆర్చిబిషప్ మార్కగోపు, 17. ఆర్చి జాన్ సుభాన్, 18 శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, 19. శ్రీ ఎక్కిరాజు సుబ్బారావు, 20. శ్రీ సి బి. తారాపూర్ వాలా, 21. శ్రీ బి పి. శేషారెడ్డి, 22. శ్రీ వి. రామకృష్ణ, ఐ. సి యస్ (రిటైర్డ్), 23 శ్రీ ఏ సత్యనారాయణరాజు; 24 శ్రీ డి ఎస్ రెడ్డి, 25. వి కూర్మయ్య, 26. శ్రీమతి రత్నాకర్, 27. శ్రీమతి సుబయా, 28. శ్రీ సయ్యద్ మొహమ్మద్ పాషాహుసేన్, 29. శ్రీ బి. వెంకటరత్నం, 30. శ్రీ సత్యదేవ్, 31. శ్రీ ప్రగడ కోటయ్య, 32 శ్రీ అక్బర్ అలీఖాన్, 33. శ్రీ జి. సంజీవరెడ్డి, 34. శ్రీ బి కె నెహ్రూ, 35. శ్రీ వి. జగన్నాధరావు, 36 శ్రీ కె. యస్ దత్ 37. శ్రీ యస్ వి.

శేషయ్య, 38 శ్రీ కె.ఆర్ పట్టాభిరామ్, 39 శ్రీ ఏ కె. బాబూ ఖాన్, 40. శ్రీ దోస్త్ మొహమ్మద్ అల్లాఉద్దీన్‌ఖాన్, 41. శ్రీ ఎం పి పాయ్, ఐ సి. యస్, 42 శ్రీ ఏ కె కె నంబియార్, ఐ జి.పి 43 శ్రీ సి. నరసింహం, ఐ ఏ యస్, 44 శ్రీ ఎం టి రాజు, ఐ సి.ఎస్, 45 శ్రీ కె ఎన్ అనంత రామన్, ఐ, సి. ఎస్, 46 శ్రీ అబ్బాసి ఐ ఏ ఎస్, 47. శ్రీ ఎల్.ఎన్ గుప్త, ఐ ఏ.ఎస్, 48 శ్రీ వి సుందరేశన్, ఐ ఏ ఎస్.

శ్రీ వి సుందరేశన్, ఈ సంఘం కార్యదర్శిగానూ, స్టేట్ బ్యాంకు ఆఫ్, హైద్రాబాదు మేనేజింగ్ డైరెక్టరు కోశాధిపతిగాను వ్యవహరిస్తారు.

ఇవే ఉద్దేశాలతో జిల్లా స్థాయిలో కూడా ఇలాంటి సంఘాలను కలెక్టర్ల అధ్యక్షతను స్థాపించడానికి ప్రభుత్వం నిశ్చయించింది మేయరు హైద్రాబాదునగరంలో ఒకసంఘాన్ని స్థాపిస్తారు

రాష్ట్ర ప్రజారక్షణ సంఘం తొలి సమావేశం హైద్రాబాదులోని జూబిలీహాలులో నవంబరు 8 వ తేదీన జరిగింది. ముఖ్యమంత్రి సమావేశాన్ని ప్రారంభిస్తూ సంఘం స్థాపనకుగల కారణాలను సంగ్రహంగా వివరించారు "ఈ సమస్యను గురించి సమాలోచన చేయడానికి రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలకు రంగాలకు సంబంధించిన మిత్రులను ఒక చోట చేర్చాం" అని ఆయన అన్నారు. ఇలాంటి విషయాలలో ప్రతి ఒక్కరినీ కమిటీలోకి తీసుకోడానికి వీలుండదనీ అదేగాక కమిటీ సభ్యుల సంఖ్య దృష్ట్యా కూడా ఇది ఆచరణ సాధ్యంకాదని ఆయన అన్నారు. పూర్తి వివరాలలోకి వెళ్లి తదనుగుణంగా తగు చర్యలు గైకొనడానికి కార్యవర్గ సంఘాన్నీ, కొన్ని ఉపసంఘాలను నియమించవచ్చని ముఖ్యమంత్రి సూచించారు

## కమ్యూనిస్టుల మినహాయింపు

ఈ సంఘంలో కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులను చేర్చుకోకపోవడానికిగల కారణాలను వివరిస్తూ, ఈ పార్టీ అధికారిక తీర్మానం చేసినప్పటికీ వారిలో చాలామంది సందిగ్ధావస్థలో వున్నారనీ, భారత, చైనా దేశాలను రెండింటినీకూడా దురాక్రమణదార్లుగానే పేర్కొంటున్నారనీ ముఖ్యమంత్రి అన్నారు. ప్రస్తుతానికి ఈ సంఘంలో కమ్యూనిస్టులను చేర్చుకునే ప్రసక్తేలేదని ఆయన స్పష్టీకరించారు. అయినా వారిలో ఎవరైనా దేశ గౌరవానికీ రక్షణకు తోడ్పడగలమని గట్టి నమ్మకం కలిగించినట్లయితే ఈ విషయంలో తన అభిప్రాయాలను మార్చుకోడానికి తాను వెనుదీయనని ముఖ్యమంత్రి పేర్కొన్నారు

## కార్యవర్గ స్థాపన

ముఖ్యమంత్రి ప్రారంభోపన్యాసానంతరం శ్రీయుతులు వి. బి. రాజు, కె వి నారాయణరెడ్డి, రామారావు మాచర్ల, తారాపూర్‌వాలా, తెన్నేటి విశ్వానాథం, సత్యదేవ్, బి కె నెహ్రూ, సి. నరసింహం, ప్రగడ కోటయ్య, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు జి బ్రహ్మయ్య, వాసుదేవ్ నాయక్, దోస్త్ మొహమ్మద్ అల్లాఉద్దీన్, శ్రీమతి కుముదినీదేవి, శ్రీమతి రత్నాకర్ గారలు చర్చలలో పాల్గొన్నారు.

కార్యవర్గంలో దిగువవారు సభ్యులుగా వున్నారు –
శ్రీయుతులు ఎన్ సంజీవరెడ్డి (ముఖ్యమంత్రి), పి.వి జి రాజు, కె బ్రహ్మానందరెడ్డి, మీర్ అహ్మద్ అలీఖాన్, ఎన్ రామచంద్రారెడ్డి, డా. ఎం చెన్నారెడ్డి, తెన్నేటి విశ్వానాథం, కె. వి. నారాయణరెడ్డి, జి. లచ్చన్న, మొకరంజా రాజకుమారుడు, సత్యదేవ్, వి. బి. రాజు, బి కె. నెహ్రూ, జి. బ్రహ్మయ్య, ఎం. పి. పాయ్, సి. నరసింహం, ఎల్ ఎన్. గుప్త, శ్రీమతి రత్నాకర్. కార్యవర్గం తొలి సమావేశం ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి అధ్యక్షతన నవంబరు 9 వ తేదీన జరిగింది దిగువ పేర్కొన్న నాలుగు ఉపసంఘాలను కార్యవర్గం నామినేటు చేసింది.–

(అ) ప్రచార కార్యకలాపాల ఉపసంఘం, అధ్యక్షుడు డా చెన్నారెడ్డి, (ఆ) రక్షణనిధి ఉపసంఘం, అధ్యక్షుడు, ఆర్థిక మంత్రి శ్రీ కె బ్రహ్మానందరెడ్డి, (ఇ) ధరలు, ఉత్పత్తి విషయాల ఉపసంఘం, పరిశ్రమల మంత్రి డా యం ఎన్ లక్ష్మీనర్సయ్య (ఈ) సంక్షేమ విషయాల ఉపసంఘం, అధ్యక్షురాలు శ్రీమతి శ్రీనగేష్

విస్తృతంగా సమాచారం తెలియ జేయడం, ప్రజల మనోధైర్యం సడలకుండా చూడటం, కరపత్రాలు, పోస్టర్లు మొదలైన వాటిని తయారుచేసి పంపిణీచేయడం, సాంస్కృతిక ప్రదర్శనలు, చలనచిత్ర ప్రదర్శనలు నిర్వహించడం, నిధుల సేకరణలో రక్షణనిధి సంఘానికి తోడ్పడడం–ఇవీ ప్రచారకార్యకలాపాల ఉపసంఘం విధులు. జాతీయ రక్షణనిధికి విరాళాలు సేకరించడానికీ, జాతీయ రక్షణ ఋణపత్రాలు, బంగారం బాండులు, రక్షణ సర్టిఫికెట్లు మొదలైన అమ్మకాన్ని ప్రోత్సహించడానికి కూడా ఈ సంఘం కృషిచేస్తుంది ధరలు ఉత్పత్తి విషయాల ఉపసంఘం, వివిధ వస్తువులు ప్రత్యేకించి అత్యవసర పదార్థాల ధరవరల పరిస్థితిని జాగ్రత్తగా గమనిస్తూ, సరుకుల నిలుపజేయడం, అక్రమలాభాలు

గడించడాన్ని నిరోధించడానికి ప్రభుత్వానికి తగు సూచనలు చేస్తుంది. సంక్షేమ విషయాలకు సంబంధించిన ఉపసంఘం, మన సైనిక దళాలలో పనిచేస్తున్న వారి కుటుంబాల సంక్షేమానికై చర్యలు తీసుకుంటుంది.

రాష్ట్రంలో జాతీయ రక్షణనిధికి స్వచ్ఛందంగా లభిస్తున్న విరాళాల పరిస్థితి ప్రోత్సాహకరంగానే కాకుండా చాలా ప్రశంస నీయంగా కూడా వుంది. ధనికులనుంచేగాక అతిసామాన్యులైన వ్యక్తులనుంచి కూడా యథాశక్తి విరాళాలు అందుతున్నాయి. హిమాలయ పర్వతప్రాంతంలో శత్రువులు జరిపిన విద్రోహకర మైన దాడులు భారతీయుల హృదయాలను ఎంతగా కలిచివేసిందీ గుర్తించడానికి ఈ సంఘటనలే సాక్ష్యాలు.

## ధీరోదాత్తమైన సంసిదత

సికింద్రాబాదులో నవంబరు 13 వ తేదీన జరిగిన బ్రహ్మాం డమైన బహిరంగసభలో ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రసంగిస్తూ, దురాక్రమణదారును గెంటివేయడానికై దేశ ఆర్థిక, సైనిక శక్తులను పటిష్ఠం చేసుకోడానికి శాయశక్తులా కృషి చేయాలనీ, నెహ్రూ ప్రభుత్వానికి ఒక్కుమ్మడిగా అండగా నిలవా లని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

సరిహద్దు వివాదం పుట్టుపూర్వోత్తరాలను గురించి చెప్తూ చైనా నాయకులు తమ దేశ ప్రజలకు కూడు గుడ్డ మొదలైన జీవితావసరవస్తువులను సమకూర్చలేక జీవనోపాధి కల్పించలేక సామ్యవాద సరళి సమాజస్థాపనకై భారతప్రజలు శాంతియుతంగా సాగిస్తున్న మహోన్నతకృషిని భంగపరచడానికి వారిని వినియో గిస్తున్నారని ముఖ్యమంత్రి అన్నారు. స్వాతంత్ర్యం పొంది దాని సత్ఫలితాలను గత 15 సంవత్సరాలనుంచి అనుభవిస్తున్న భారత ప్రజానీకం తమ స్వాతంత్ర్యాన్ని ధారాదత్తం చేయడానికి ససే మీరా అంగీకరించదు. తమ స్వాతంత్ర్య పరిరక్షణకై ప్రతి భార తీయుడూ తమ రక్తంలో చివరి బిందువు వరకూ ఒడ్డడానికి సన్నద్ధుడవుతాడు. ప్రజలయొక్క ఈ ధీరోదాత్తమైన సంసిద్ధత మంచుపొరలతో కప్పివేయబడిన ఉత్తుంగ హిమాలయ పర్వత ప్రాంతాలలో దురాక్రమణ దారును వీరోచితంగా ఎదుర్కొంటున్న దేశభక్తి తత్పరులైన మన జవానులకు ఎంతో శక్తినీ ప్రోత్సాహాన్నీ ఇస్తుంది.

దురాక్రమణదారును పారద్రోలడానికి సాగుతున్న ఈ యుద్ధం ఒక్క సరిహద్దులలోనే కాక, జాతిధైర్య స్థైర్యాలు సడలకుండా వుండడానికై తేనేమి, ఉత్పత్తులు పెంపొందడానికై తేనేమి వ్యవసాయ క్షేత్రాలలో, కర్మాగారాల, ఉత్పత్తికి సంబ ధించిన అన్ని కీలక కేంద్రాలలోకూడా జరగాలి.

## విద్యార్థులకు పిలుపు

రాజధానీ నగరంలో నవంబరు 2వ తేదీన చైనా దురాక్రమ ణను ఖండిస్తూ ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాలలు, దాని అనుబంధ కళాశాలలకు చెందిన 10,000 మంది విద్యార్థులు బ్రహ్మాండమైన ఊరేగింపు, ప్రదర్శనలు జరిపారు. నిజాంకళాశాల మైదానంలో జరిగిన ఈ విద్యార్థుల సభలో రాష్ట్ర గవర్నరు, ముఖ్యమంత్రి ప్రసంగించారు.

"క్విట్ ఇండియా" ఉద్యమ సందర్భంలో గాంధీజీ ఇచ్చిన "విజయమో వీరస్వర్గమో" అన్న మహోత్కృష్టమైన నినాదం ప్రస్తుత సమయంలో అన్నివిధాలా అన్వయిస్తుందని ముఖ్యమంత్రి అన్నారు. చైనా ఉపద్రవాన్ని నిర్మూలించడానికి మనలను సమా యత్తపరుస్తూ, ఈ పోరాటంలో మన ప్రధాని దేశపు ప్రథమ సైనికుడుగా వున్నారు. కష్టార్జితమైన మన స్వాతంత్ర్యాన్ని పరి రక్షించవలసిన బాధ్యత యువజనులపైన ప్రత్యేకించి విద్యార్థుల పైన వుంది. "యుద్ధంసరిహద్దులలోనే కాకుండా మన పరిసరాలలో జరుగుతున్నట్టుగా భావించి ప్రమత్తతో వుండా"లని ఆయన అన్నారు.

క్రమశిక్షణకు చక్కగా లోబడిన దళాలు మాత్రమే యుద్ధంలో అంతిమంగా విజయం సాధిస్తాయి. అందుచేత ప్రస్తుత అవాంతర పరిస్థితిలో మన విజయానికి క్రమశిక్షణ కీలకమని ఆయన ఉద్ఘాటిం చారు. భారతజాతి క్రమశిక్షణకు కట్టుబడి వుంటుందనీ, లక్షలు, కోట్లసంఖ్యలో గల భారత ప్రజలంతా ఒక్కుమ్మడిగా ప్రభుత్వా నికి అండగా నిలిచారని శత్రువుకు తెలియజెప్పాలని ముఖ్యమంత్రి విద్యార్థులకు ఉద్బోధించారు. సభ ముగింపులో దిగువ తీర్మానం చేసింది. "మాతృభూమి రక్షణకై మా జీవిత సర్వస్వాన్నీ ధార పోస్తామనీ, ప్రభుత్వంతో సంపూర్ణంగాసహకరిస్తామనీ శపథం చేస్తున్నాము."

## అధికోత్పత్తి

ముఖ్యమంత్రి నవంబరు 10 వ తేదీన విజయవాడలో ప్రసంగిస్తూ, మన పవిత్ర భూభాగంనుంచి శత్రువును పారద్రోలా లనే మన లక్ష్యాన్ని సాధించడానికి తీవ్రకృషి కృతనిశ్చయం చాలా అవసరమని అన్నారు.

యుద్ధరంగంలోని మన సైనిక దళాల అవసరాల మేరకు పదార్థాలను ఉత్పత్తి చేయడంతో పాటు, ధరల పెరుగుదలను అరికట్టడానికై దేశంలో తగినంత సరుకు నిలువవుండానికి వీలుగా దేశ ఉత్పాదక శక్తిని అధికం చేయాలి. * * *

# జయం! జయం!!

జయం జయం శుభోదయం
భారతవీరా!
పరాజయం పరాభవం చైనాదేరా!
కండబలం, మందిబలం
దండుకునే దుష్కాలం
అంతరించె నేనాడో
రిపులమూక చెండాడుము—
జయభేరిని మ్రోగింపుము

శాంతి సహనజీవనమే
సర్వలోక పావనమని
సర్వసౌఖ్య భావనమని
పూరింపుము నవభారత
ప్రియభారత శుభభారత
శంఖధ్వని దశదిశలను ॥జయం జయం॥

అడుగిడవోయ్...పరుగిడవోయ్
మాతృభూమి రక్షణకై
ఆత్మమాన రక్షణకై
అరివినాశ నార్భటితో
ప్రళయకాలరుద్రుడవై
దక్షాధ్వర భద్రుడవై ॥జయం జయం॥

నీ నైతిక బలంముందు
నీ సత్యాగ్రహంముందు
నిలువలేదు ఏ దేశం
గెలువలేదు పో .. వీసం ॥జయం జయం॥

భారత ధర్మావేశం
విశ్వశాంతి విశ్వాసం
రూపుగొన్న భారతీయ
వీరుడవోయ్ . శూరుడవోయ్
నిన్నెదిర్చి సమరస్థలి
మన్నె ఫాలాక్షుడైన ॥జయం జయం॥

— మానాప్రగడ శేషశాయి

# సంగ్రహ ప్రకటనలు

## విద్యుచ్ఛక్తి సరఫరాకు తగ్గింపు ధరలు

రాష్ట్రంలో కొత్తగా పరిశ్రమలు నెలకొల్పే పారిశ్రామిక వేత్తలు విద్యుచ్ఛక్తి సరఫరా తగ్గింపుధరలను గురించి ప్రభుత్వాన్ని విచారిస్తున్నారు. ప్రస్తుత పథకం ప్రకారం అంటే ప్రభుత్వామోదం పొందిన 1961 ఏప్రిల్ 27 వ తేదీ గల పరిశ్రమల శాఖ ప్రభుత్వ ఉత్తరువు (నెం 678) ప్రకారం 1961 ఏప్రిల్ 27 వ తేదీ తర్వాత నెలకొల్పబడిన కొత్త పారిశ్రామిక యూనిట్లలో నిర్ణయించిన వాటికి ఉత్పత్తి ప్రారంభమైనప్పటి నుంచి 5 సంవత్సరాల కాలం వరకు విద్యుచ్ఛక్తి అందజేయబడుతుంది తగ్గింపు ధరలు ప్రస్తుతం వున్న టారిఫ్ రేట్లలో 25 శాతం 50 శాతం మధ్య వుంటుంది.

విద్యుచ్ఛక్తి విరివిగాఖర్చయ్యే కాస్టిక్‌సోడా, క్లోరిన్, కాల్షియం కార్బైడ్, సిలికన్ కార్బైడ్, మెటలిక్ మాంగనీస్, ఫెర్రో సిలికన్, ఫెర్రోఎల్లాయిస్, స్పెషల్ స్టీల్ వంటి పరిశ్రమలకు లేక విద్యుచ్ఛక్తి విరివిగా కావలసివచ్చే కాగితం, గుజ్జు, సిమెంటు, పింగాణి, సింథటిక్ రబ్బరు, పరిశ్రమలకు లేక భారీ ఇంజనీరింగ్ వర్క్‌షాపులు, భారీ ఫోర్జ్ షాపులు, వంటి ఇంజనీరింగ్ పరిశ్రమలకు లేక స్విచ్‌గేర్స్, టెలికమ్యూనికేషన్ సాధనాలు, ఆటోమొబైల్స్, బాల్, రోలర్ బేరింగ్స్, ట్రాక్టర్లు మొదలైన వాటిని తయారు చేసే యూనిట్లు లేక భారీ రసాయనికాల పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం ప్రభుత్వోద్దేశం

ఈ తగ్గింపు రేట్లతో విద్యుచ్ఛక్తి సరఫరా చేసే విషయం పార్టికల్ బోర్డులు, చిప్‌బోర్డులు, బట్టలు, చక్కెర, గ్లాసు, రబ్బరు టైర్లు, ట్యూబులు, భారీ ఇనుప సామగ్రి, బాయిలర్లు, స్టీం జనరేటింగ్ కర్మాగారాలు, రీరోలింగ్ మిల్లులు, ఇంకా ఇతర అత్యవసర పరిశ్రమల విషయంలో కూడా పరిశీలించబడుతుంది.

ఇందుకై ప్రభుత్వం పబ్లిక్‌వర్క్స్ ఆర్థిక, పరిశ్రమల శాఖల కార్యదర్శులు, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల ఛీఫ్ ఇంజనీర్, పరిశ్రమల డైరెక్టరులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈ సంఘం తమకు వచ్చిన దరఖాస్తులను పరిశీలించి సిఫార్సు చేసింది ఈ విషయంలో కావలసిన వివరాలకు, దరఖాస్తులకు పరిశ్రమల శాఖ డైరెక్టరుతో సంప్రదించాలి

## భూయజ్ఞ భూమిశిస్తు నిబంధనలు

1951 వ సంవత్సరం శ్రీ ఆచార్య వినోబాభావే సర్వోదయ భూయజ్ఞ హైదరాబాద్ భూమిశిస్తు నిబంధనలను 9-2-63 నుంచి మరొక సంవత్సరం పాటు తెలంగాణా ప్రాంతంలో విస్తరింపచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువులు జారీ చేసింది. ఈ విషయంలో సమగ్రమైన శాసనం రాష్ట్రం అంతటా అమలు జరపడానికి ముందు కొంత వ్యవధి పడుతున్నందున ఈ విధంగా నిర్ణయించడం జరిగింది

## వినోదపు పన్ను మినహాయింపు

జాతీయ రక్షణనిధికి నిధులు సేకరించడానికి రాష్ట్రంలో ఏర్పాటు చేసే సినిమా ప్రదర్శనలు, వినోద కార్యక్రమాలు, ఇంకా అటువంటి ఇతర కార్యక్రమాలకు వినోదపు పన్ను చెల్లింపును మినహాయిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక ఉత్తరువు జారీ చేసింది అయితే ఈ మినహాయింపు కొన్ని నిబంధనలకు లోబడి వుంటుంది ఆ కార్యక్రమం నిర్వహణకయ్యే వ్యయం మొత్తం ఆ కార్యక్రమానికి వసూలయ్యే మొత్తంలో 25 శాతం

మించకూడదు. అంతేగాక ఆ కార్యక్రమం ఖర్చుల వివరాలను కార్యక్రమం అయిన తర్వాత 15 రోజుల లోపల వినోదపు పన్ను అధికారికి అందజేయాలి.

## పంచాయతీరాజ్ సంస్థల పాత్ర

పంచాయతీరాజ్ సంస్థలు తమ మూల నిధుల నుంచి జాతీయ రక్షణనిధికి విరాళాలిచ్చే విషయాన్ని ప్రభుత్వం పరిశీలించింది. పంచాయతీరాజ్ సంస్థలనిధులు ఆయా ప్రాంతాల్లో వ్యవసాయోత్పత్తి అధికం చేయడానికి చాలనందున వాటిలో కొంత భాగాన్ని రక్షణనిధికి ఇవ్వడం సమంజసం కాదు. అందువల్ల పంచాయతీరాజ్ సంస్థలు రక్షణనిధికి విరాళాలిచ్చే బదులు ఆ నిధులను యుద్ధ కాలంలో అవసరమయ్యే అధిక వ్యవసాయోత్పత్తిని సాధించడానికి వెచ్చించాలని ఆ సంస్థలకు సలహా ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

యుద్ధావసరాలకు తోడ్పడడంలో పంచాయతీరాజ్ సంస్థలకు ఎంతో గణనీయమైన పాత్ర వుంది. ప్రజలు జాతీయ రక్షణనిధికి విరివిగా విరాళాలిచ్చేట్లు, రక్షణ బాండ్లు కొనేట్లు ఆ సంస్థలు ప్రోత్సాహించాలి.

## వక్ఫ్ ఆస్తుల సర్వే

ముస్లిం వక్ఫ్ ఆస్తుల సర్వే తెలంగాణా ప్రాంతంలోని అన్ని జిల్లాలలో త్వరితగతిని సాగుతున్నవి. ప్రస్తుతం నల్గొండ, నిజామాబాద్ జిల్లాలలో ప్రాథమిక సర్వే పనులు తుది దశలలో వున్నాయి. ఇంతవరకు జరిపిన సర్వే ప్రకారం రిజిస్టరు కాని వక్ఫ్‌లు నూరు వున్నట్లు తెలుస్తున్నది ఇందుకు కారణం వక్ఫ్‌లకు సంబంధించిన వ్యక్తుల తెలివితక్కువతనం వారిలో గూడు కట్టుకొనివున్న దురభిప్రాయాలు దురభిప్రాయాల విషయంలో ఈనాందారులు, ముత్తవాలీలు, లేక అసలు వక్ఫ్‌ల వారసులు వక్ఫ్ ఆస్తులను పట్టాలుగా మార్చినట్లు తెలుస్తున్నది.

వక్ఫ్‌ల విషయంలో ఉత్సాహం గల ప్రజలు వక్ఫ్‌ల దొంగ ఆస్తులను కనుగొనడానికి సహకరించే సమాచారాన్ని అందచేస్తే వక్ఫ్‌ల కమిషనర్‌కు ఎంతో సహకరించినవారవుతారు. వక్ఫ్‌ల కమిషనర్ కార్యాలయం హైదరాబాద్ హిమాయత్ నగర్‌లోని 4-6-150 కజాలో వుంది.

## చర్మ పరిశ్రమ సలహా మండలి

చర్మపరిశ్రమ అడ్‌హాక్ బోర్డును ప్రభుత్వం చర్మ పరిశ్రమ సలహా మండలిగా పునర్నిర్మించింది దానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమలశాఖా మంత్రి డాక్టర్ యం. యన్. లక్ష్మీనర్సయ్య అధ్యక్షులుగాను, శాసన సభ్యులు శ్రీ వి. రామారావు ఉపాధ్యక్షులుగాను వుంటారు ఇంకా యీ మండలిలో ఈ క్రింది వారు కూడా వున్నారు.

1. కేంద్ర చర్మ పరిశోధన సంస్థ డైరెక్టరు, 2. వాణిజ్య పరిశ్రమల డైరెక్టరు, 3. అడవుల ఛీఫ్ కన్సర్వేటర్, 4. పశుపోషణశాఖ డైరెక్టరు, 5 లఘుపరిశ్రమల సంస్థ డైరెక్టరు, 6 పరిశ్రమలశాఖ ఆర్థిక సలహాదారు, 7 పరిశ్రమల ఉపకార్యదర్శి, 8 సభ్యుడు కార్యదర్శిగా చర్మపరిశ్రమ నిపుణుడు, 9 శ్రీ జి. ఆర్ వాలుజ్కర్, గౌరవసాంకేతిక సలహాదారు (చర్మపరిశ్రమ) ఖాదీ, గ్రామీణ పరిశ్రమల మండలి బొంబాయి, 10 శ్రీ టి రాజగోపాల్, విజయనగరం, 11 శ్రీ బి. వందనం సత్తెనపల్లి, 12. శ్రీ నవాబ్ మొహిద్దీన్ సలీంఖాన్, హైద్రాబాదు 13 శ్రీ ఎ. జి బసప్ప, ఉరవకొండ, అనంతపురం జిల్లా, 14. శ్రీ కుందా సైలు, జనగాం, 15. శ్రీ జి. అంజప్ప, యం పి, మడకసిర, అనంతపురం జిల్లా, 16. శ్రీ సి ఐ ఆంద్ర్యూస్, హైదరాబాదు, 17 శ్రీ కోట పున్నయ్య, యం పి. ఖమ్మం జిల్లా, 18 శ్రీ టి వి రాఘవులు, ఏలూరు, 19 శ్రీ ఆర్. నాగప్ప, దోర్నకల్, చర్మకార పరిశ్రమ సహకార సంఘం, దోర్నకల్, 20 శ్రీ జానకీరాం, యం యల్. ఎ కరీంనగర్, 21 శ్రీ సి రాజనరసింహం, యం.యల్ ఎ 22. శ్రీ కె పున్నయ్య, యం యల్ ఎ పొందూరు, శ్రీకాకుళం

ఈ సలహా మండలి చట్టబద్ధమైన చర్మపరిశ్రమ బోర్డు ఏర్పడేవరకు గాని 1962 అక్టోబరు 31 వ తేదీనుంచి రెండు సంవత్సరాలవరకుగాని, ఏదీముందయితే దాని ప్రకారం అధికారంలో వుంటుంది. ఉన్నతాధికారసంఘం తమబ్రుహత్ ప్రణాళికలో చేసిన సిఫార్సుల ప్రాతిపదిక పై రాష్ట్రంలో చర్మ పరిశ్రమాభివృద్ధికి వాణిజ్య పరిశ్రమల డైరెక్టరు రూపొందించిన విధానాలను యీ బోర్డు పరిశీలిస్తుంది

## చక్కెర పరిశ్రమ

రాష్ట్రంలోని చక్కెర పరిశ్రమలు 1947 వ సంవత్సరం పారిశ్రామిక వివాదాల చట్టానికై ప్రజోపయోగమైన సర్వీసుగా

962 నవంబరు 1వ తేదీనుంచి ఆరునెలల వరకు ప్రభుత్వం ప్రకటించింది.

### సాంస్కృతిక కార్యక్రమాల సలహాసంఘం

సాంస్కృతిక కార్యక్రమాలను ఆకర్షణీయంగా రూపొందించే ఉద్దేశంతో రాష్ట్ర ప్రభుత్వం 16 మంది సభ్యులతో ఒక సలహా సంఘాన్ని సమాచార పౌర సంబంధాలశాఖ డైరెక్టర్ అధ్యక్షతన నియమించింది. వివిధ సందర్భాలలో నిర్వహించ తలపెట్టిన కార్యక్రమాలను ఈ సంఘం పరిశీలిస్తుంది. సంఘంలో సభ్యులు: శ్రీ అబ్బూరి రామకృష్ణారావు, నాట్యవిద్యాలయం, హైదరాబాద్; శ్రీ దాశరథి కృష్ణమాచార్య, ఆకాశవాణి, హైదరాబాద్; శ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణ, సంగీత కళాశాల ప్రిన్సిపాల్, విజయవాడ; శ్రీ వి. ఆర్. నార్ల, ఎడిటర్ "ఆంధ్ర జ్యోతి" విజయవాడ; శ్రీ పాములపర్తి సదాశివరావు, వరంగల్; శ్రీ స్థానం నరసింహారావు; శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి; శ్రీ మఖ్దూమ్ మొహియొద్దీన్, యం యల్.సి; శ్రీమతి సులోచనా నరోత్తమరెడ్డి; ఆకాశవాణి ప్రతినిధి ఒకరు; ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రతినిధి ఒకరు; హైదరాబాద్‌లోని నాట్య సంఘం ప్రతినిధి ఒకరు; హైదరాబాద్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ ప్రతినిధి ఒకరు; ఆంధ్ర యువతీమండలి ప్రతినిధి ఒకరు.

సమాచార, పౌర సంబంధాలశాఖ డిప్యూటీ డైరెక్టరు (ప్రణాళికా ప్రచారం) కమిటీలో సభ్య—కార్యదర్శి.

### ఎగుమతుల అభివృద్ధి సంఘం పునర్నిర్మాణం

ప్రభుత్వం ఎగుమతుల అభివృద్ధి కమిటీని ఈ క్రింది అధికార అనధికార సభ్యులతో పునర్నిర్మించింది.

పరిశ్రమల శాఖామంత్రి, అధ్యక్షులు; పరిశ్రమలశాఖ కార్యదర్శి; ఆర్థిక శాఖ కార్యదర్శి, ప్రభుత్వ కార్యదర్శి, రివెన్యూ శాఖ., మార్కెటింగ్ స్టేట్ డైరెక్టరు; దిగుమతి ఎగుమతుల డిప్యూటీ చీఫ్ కంట్రోలర్ (ఎగుమతి, దిగుమతుల జాయింట్ చీఫ్ ఇంజనీర్ కార్యాలయం) మద్రాసు; ఆంధ్రప్రదేశ్ మార్కెటింగ్ కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టరు; శ్రీ వి. రామకృష్ణ, ఐ. సి. యస్; హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ సహకార మార్కెటింగ్ సంస్థ అధ్యక్షుడు; ఆంధ్రప్రదేశ్ వాణిజ్యమండలి అధ్యక్షుడు; శ్రీ జె. వి. సోమయాజులు (ఆంధ్ర వాణిజ్య మండలి ప్రతినిధి, మద్రాసు); శ్రీ అల్లూరి సర్వారాయుడు, మద్రాసు మైకా సంఘాధ్యక్షుడు (సభ్యులు).

వాణిజ్య పరిశ్రమల శాఖ డైరెక్టరు ఈ కమిటీ సభ్య—కార్యదర్శిగాను, అనుసంధానాధికారి (లైజన్ ఆఫీసర్) గాను వుంటారు.

ఎగుమతుల అభివృద్ధికి తోడ్పడే విధానాలను రూపొందించడంలోనూ, ఎగుమతుల అభివృద్ధిలోని అవకతవకలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి వాటి నివారణోపాయాలను సిఫార్సు చేయడంలోనూ, ఉత్పత్తిదారులు, ఎగుమతి దారులు, వర్తకులకు తగిన విధానాలను సూచించడంలోనూ, రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు చేపట్టే ఎగుమతి అభివృద్ధి చర్యలకు సంబంధించిన సమాచారం విషయంలోనూ ఈ కమిటీ ప్రభుత్వానికి సలహాలిస్తుంది.

---

# ప్రకటన

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమిషనుచే నేరుగా రిక్రూట్ చేయబడిన అసిస్టెంట్ సర్జన్లందరూ సైనిక వైద్య దళాలలో మూడు సంవత్సరాల పాటు పనిచేయాలి. సైనిక సర్వీసులో ప్రశంసనీయంగా పనిచేసినవారికి ప్రమోషను విషయంలో ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. సైనిక వైద్యదళం నుంచి తిరిగి వచ్చిన తరువాత ప్రమోషను పొందనివారికి వారు సైనిక వైద్యదళంలో పనిచేసిన కాలానికి ప్రతి సంవత్సరానికీ ఒక అడ్వాన్సు గ్రేడు ఇంక్రిమెంటు చొప్పున ఇవ్వబడుతుంది. పబ్లిక్ సర్వీసు కమిషనుచే నేరుగా రిక్రూట్ చేయబడిన అసిస్టెంట్ సర్జన్లందరూ సైనిక సర్వీసుకు పిలువబడినప్పుడు స్వల్ప వ్యవధి నోటీసుతో అయినా వెళ్ళటానికి సన్నద్ధంగా వుండాలి.

(సం) కె. ఎస్. రావు
వైద్యశాఖ డైరెక్టరు.

# ? ? ?
# ప్రశ్నోత్తరావళి

శ్రీ పి ఎన్. మూర్తి

పార్వతీపురం, శ్రీకాకుళం జిల్లా

ప్రశ్న : పార్వతీపురంలోని జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలకు ఎంత మొత్తం మంజూరు చేశారు. కళాశాలను ప్రారంభించే ప్రయత్నాలు ఎంతవరకు వచ్చాయి ?

సమాధానం : పార్వతీపురం జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలను 1961-62 వ సంవత్సరంలో హయ్యర్ సెకండరీ పాఠశాలగా పైస్థాయికి పెంచారు. పైస్థాయికి పెంచబడిన ఈ ఉన్నతపాఠశాలకై అదనంగా భవనాలు నిర్మించడానికి, సాధన సామగ్రి సమకూర్చడానికి సంబంధించినపథకానికిదాదాపు రూ 87,000లు ఖర్చవుతాయి ప్రారంభ ఖర్చుల క్రింద శ్రీకాకుళం జిల్లా పరిషత్తు రూ. 32,635/- ల అడ్వాన్సు గ్రాంటు మంజూరు చేసింది. ప్రస్తుతానికి పార్వతీపురంలో కళాశాలను తెరిచే ప్రతిపాదనేదీలేదు.

శ్రీ సి. హెచ్. అప్పారావు వర్మ

పైపల్లి, అక్కుపల్లి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా

ప్రశ్న : అక్కుపల్లి మార్గంగా కాశీబుగ్గ, వజ్రపు కొత్తూరుల మధ్య రోడ్డు నిర్మించే పని త్వరలో పూర్తవుతుందా ?

సమాధానం . (1) కాశీబుగ్గ-అక్కుపల్లిల మ , (2) వజ్రపు కొత్తూరు-అక్కుపల్లిల మధ్య రోడ్డు నిర్మించే పనులను మొదట క్షామ నివారణ పనుల క్రింద మాజీ జిల్లా బోర్డులు చేపట్టాయి.

తరువాత 1959 వ సంవత్సరంలో ఈ రోడ్డు పనులు రహదార్ల శాఖకు అప్పగించబడినాయి. రోడ్లపై చిన్న గొట్టపు వంతెనలను నిర్మించే పనులు జరుగుతున్నాయి. ఇందుకు రూ. 20,000/- లు కేటాయించారు. బహుశా త్వరలో పనులు పూర్తవుతాయి.

రోడ్లకు కంకరవేసి బాగుపరచడానికి సంబంధించిన రెండు పనులను ప్రభుత్వం మంజూరు చేసింది. కాని ధనాభావం చేత ఈ పనులను ప్రారంభించలేదు. నిధులు సమకూరిన వెంటనే వీటిని ప్రారంభిస్తారు.

శ్రీ సి హెచ్. ఓబయ్య

పగిరెడ, ప్రొద్దుటూరు తాలూకా, కడప జిల్లా

ప్రశ్న : చేనేత సహకార సంఘాలను ప్రారంభించడానికి కనీసం ఎన్ని మగ్గాలు వుండాలి ? ఇందుకు ఏ కార్యాలయానికి వ్రాయాలి ?

సమాధానం నేత పనివారల సహకార సంఘం రిజిస్ట్రేషనుకై నమోదైన మగ్గాలు కనీసం 100 వుండటం అవసరం. రిజిస్ట్రేషను కొరకు తమ ప్రాంతానికి సంబంధించిన సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారుకు దరఖాస్తు ఇవ్వాలి.

శ్రీ రామన్‌గౌడ్

హెల్త్ ఆఫీసు, దక్షిణవిజయపురి, నాగార్జునసాగర్ ఆనకట్ట, నల్గొండ జిల్లా.

ప్రశ్న : (1) సింథటిక్ డ్రగ్స్ ఫ్యాక్టరీ ఎప్పుడు పని ప్రారంభిస్తుంది, ఇప్పుడు ఏమి జరుగుతున్నది, దీనికి ఎంత మొత్తం ఖర్చు చేస్తారు ?

(2) ఎస్ ఎస్ ఎల్. సి. పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు అచ్చట శిక్షణ సౌకర్యాలున్నాయా ?

(3) రామచంద్రాపురంలోని భారీ విద్యుత్‌పరికరాల ఫ్యాక్టరీలో ఎంతమంది ఉద్యోగులు అవసరమవుతారు. వారిని ఎప్పుడు రిక్రూట్ చేస్తారు ?

(4) రిక్రూట్లకు ఏమి అర్హత వుండాలి ?

(5) ఈ రెండు ఫ్యాక్టరీలలోను "ముల్కీలకు" ఏమి సౌకర్యాలున్నవి ?

సమాధానం . 1 సింథటిక్ డ్రగ్స్ ప్రాజెక్టు బహుశా 1963 వ సంవత్సరాంతం నాటికి ఉత్పత్తి ప్రారంభిస్తుంది. దీనికి మొత్తం రూ 8 10 కోట్లు ఖర్చవుతుంది. ఫ్యాక్టరీల నిర్మాణానికి అవసరమైన స్థలాన్ని సేకరించారు. నిర్మాణాలు సాగుతున్నాయి.

2. మీరు అడిగిన సమాచారం కొరకు హైద్రాబాదు గాంధీ భవనంలోని సింథటిక్ డ్రగ్స్ ప్రాజెక్టు ఎడ్మినిస్ట్రేటరును సంప్రదించవచ్చు

3 హైద్రాబాదులోని నిజాం చక్కెర ఫ్యాక్టరీ భవనాలలో ఎడ్మినిస్ట్రేటివ్ కార్యాలయాన్ని ఇదివరకే నెలకొల్పారు కాబట్టి పూర్తి వివరాల కొరకు హైద్రాబాదు నిజాం చక్కెర ఫ్యాక్టరీలోని హెవీ ఎలక్ట్రికల్స్ (ఇండియా) లిమిటెడ్ ప్రాజెక్టు ఇంజనీరుకు వ్రాయవచ్చు

4. అర్హతలు పనులస్వభావంపై ఆధారపడి వుంటాయి.

5 వివిధ ఉద్యోగాలలో అభ్యర్థులను నియమించడంలో స్థానికులకు సహజంగానే ప్రాధాన్యత ఇవ్వబడుతుంది

శ్రీ శేషభూషణరావు
ఎప్పర్తి, నల్గొండ జిల్లా

ప్రశ్న నల్గొండ జిల్లా చౌటుప్పల్ బ్లాకులోని ఎప్పర్తి, పల్వెల గ్రామాల సమీపంలో ప్రభుత్వం ఒక చెరువును నిర్మించ దలచిన సంగతి నిజమేనా ?

సమాధానం · పల్వెల గ్రామ సమీపంలో కొడంగల్ వాగుకు అడ్డంగా ఒక చిన్నతరహా నీటి పారుదల ప్రాజెక్టును నిర్మించడానికి గల అవకాశాలను పరిశీలించే నిమిత్తం జరిపిన ప్రారంభ పరిశీలనలో, పల్వెల గ్రామంలో కొంత భాగంతో సహా చాలా ప్రాంతాలు మునిగిపోతాయి కాబట్టి రిజర్వాయరు నిర్మాణానికి ఈ స్థలం అనువైనది కాదనీ అంతేగాక ఇది ఆర్థికంగా లాభసాటియైనదికూడా కాదని తేలింది.

శ్రీ ద్వారక బి గోపాలకృష్ణ
దేవంజిపేట, విజయనగరం

ప్రశ్న : రాజకీయ బాధితుల కొడుకులు, మనుమలకు ఎన్ని స్కాలర్‌షిప్పులు మంజూరు చేశారు రాజకీయ బాధితుల కొడుకులకు ఆర్థిక సహాయం చేయడానికి, ఉచితంగా భోజన వసతి సౌకర్యాలు కల్పించడానికీ ఏదైనా నిబంధన వుందా ?

సమాధానం రాజకీయబాధితుల పిల్లలు, మనుమలకు మంజూరు చేసిన విద్యారాయతీల పూర్తి వివరాలు 1960 ఆగస్టు 4 వ తేదీన విద్యాశాఖ జారీచేసిన 2558 వ నెంబరు జి. ఓ లో ఇవ్వబడినాయి. రాష్ట్ర గెజెటులో దీనిని చూడవచ్చు

శ్రీమతి డి అనసూయ గోపాలకృష్ణ
విజయనగరం

ప్రశ్న : కళాశాల కోర్సులు చదివే వితంతు స్త్రీలకు ఎలాంటి స్కాలర్‌షిప్పులు మంజూరు చేస్తారు. వీటిని పొందడానికి పద్ధతి ఏమిటి ? దీనికి కాల పరిమితి ఏమైనా వుందా ?

సమాధానం . పి.యు.సి చదివే ఇద్దరు వితంతువులకు స్కాలర్‌షిప్పులు ఇస్తున్నారు డిగ్రీ కోర్సు ముగింపు వరకూ ఇవి వర్తింపులో వుంటాయి నెలకు రూ. 30/- ల చొప్పున సంవత్సరంలో 9 నెలల పాటు ఈ స్కాలర్‌షిప్పులు ఇస్తారు. ప్రతిభ, లేమిడిని పురస్కరించుకొని వీటిని మంజూరు చేస్తారు. వీటికొరకు అభ్యర్థులు ఆయా కళాశాలల ప్రిన్సిపాల్స్ ద్వారా విద్యాశాఖ డైరెక్టరుకు దరఖాస్తులు దాఖలు చేయాలి.

ఆనర్స్ కోర్సు చదివే ఒక వితంతువుకు కూడా ప్రతి సంవత్సరం మరో స్కాలర్‌షిప్పు ఇస్తున్నారు. ఈ స్కాలర్‌షిప్పుకు కూడా పై షరతులే వర్తిస్తాయి. * * *

# ఇతోధిక వైద్య సౌకర్యాలు

## ఆసుపత్రులలో పడకల సంఖ్య హెచ్చింపు

రాష్ట్రంలోని ఆసుపత్రులలో చేరుతున్న రోగుల సంఖ్య దినదినానికి పెరుగుతున్నది ఈ పరిస్థితి దృష్ట్యా ప్రభుత్వం వర్తమాన సంవత్సరం (1962-63)లో దిగువ ఆసుపత్రులలో పడకల సంఖ్యను హెచ్చించింది:-

(1) ఎం జి. ఎం. ఆసుపత్రి. వరంగల్, (200) 150 నుంచి 350.

(2) ప్రభుత్వ ఆసుపత్రి, వరంగల్ (20) 4 నుంచి 24.

(3) ఓ జి ఆసుపత్రి, హైద్రాబాదు (150) 850 నుంచి 1,000.

(4) ప్రభుత్వ జనరల్. ఆసుపత్రి, కాకినాడ (50) 550 నుంచి 600.

ఈ విధంగా ఈ సంవత్సరం 420 పడకలకు అధికంగా ఏర్పాటుచేశారు. వ్యాధిగ్రస్తులైన ప్రజలకు అవసరంగా వైద్య సౌకర్యాలు సమకూర్చడంలో ఇవి చాలా వరకు తోడ్పడగలవని ఆశించబడుతున్నది.

## ఔషధాల పరిశీలన

బజారులో అనేక కల్తీమందులు, నకిలీమందులు అమ్మబడుతున్న పెక్కు సందర్భాలను గురించి ఇటీవల ప్రభుత్వానికి తెలియవచ్చింది ఇలాంటి మందులు ఉపయోగించడం వల్ల, వ్యాధులకు చికిత్సపొందడంలో రోగులకు ప్రయోజనంవుండదు ఇలాంటి పనులకు మందుల ఉత్పత్తిదార్లు కానీ లేక అమ్మకందార్లు కానీ బాధ్యులైవుంటారు ఇట్టిదుష్కృత్యాలను అరికట్టడానికై మందులను విక్రయించటానికి పూర్వం వాటిని పరీక్షించాలని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది రాష్ట్రంలో అమ్మకానికై బజార్లలోకి తెచ్చే కొత్తమందులను పరిశీలించడానికీ, అంతేగాక ఆమోదించబడిన మందుల నాణ్యతను కూడా-కొంతకాలానికి చెడిపోతాయి కాబట్టి - అప్పుడప్పుడు పరిశీలించడానికి తగు సౌకర్యాలు కలిగించే ఉద్దేశంతో ప్రభుత్వం ఇటీవలనే హైద్రాబాదులోని ఐ పి. ఎం. లో మందుల పరిశీలన పనిని ప్రారంభించడానికి మంజూరీ ఇచ్చింది. అధికార్లు, అనధికార్లు, ప్రజల సహకారంతో బజారులో నకిలీ, కల్తీ మందుల అమ్మకం జరగకుండా నిరోధించడంలో ఈ పథకం విజయవంతం కాగలదని ఆశించబడుతున్నది. ***

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి !

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ ఋణ మొత్తాల పొదుపు పథకములలో పెట్టండి .

భారత దేశం యొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమములకు, గొప్ప నదీలోయ [illegible] ..

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి.

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది ఇవి రూ. 5 లవి మొదలు రూ 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ 25,000 ల వరకూ కొనవచ్చు రూ 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ 50 లవి మొదలు రూ 25 000 ల వరకూ కొనవచ్చు

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీ చేయబడు ధరలు రూ. 1,330, రూ. 3 325, రూ 6,650, రూ. 13,300, రూ 26,600 ఈ సొమ్ము నూటికి యేదాదికి 4.25 కు కొంచెమెక్కువగా వచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకూ కొనవచ్చు

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి 3 చొప్పున, రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2½ చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది

**క్యూములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ 5, 10, 20, 50, 100, 200, లేక 200 వంతున 5, 10 లేక 15 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది

ఆదాయంపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది [illegible] పెట్టుబడి పెట్టండి,

ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలను గూర్చి యితర వివరాలు మీకు దేనువగా వున్న పోస్టాఫీసు వద్దగాని రీజియనల్ డైరెక్టరు నేషనల్ సేవింగ్స్ 10-2-2. ఎ సి గార్డ్సురోడ్డు హైదరాబాదు లేక మీ జిల్లా కలెక్టరు ఆఫీసులోని, జిల్లా ఆర్గనైజరు వద్దగాని తెలుసుకోవచ్చు

# వ్యవసాయ రంగం

## 1962 సంవత్సరపు ఖరీఫ్ పంటకు సాంద్ర వ్యవసాయ పథకం

సాంద్ర వ్యవసాయ పథకం క్రింద 20 బ్లాకులలో గ్రామా లన్నింటిలో 7739 యెకరాలలో చెరకు పంటనూ 4,20,054 యెకరాలలో వరిపంటనూ యెక్కువగా పండించటానికి 73729 సాధారణ వ్యవసాయోత్పత్తి పథకాలు తయారు చేయబడినాయి. గ్రామ విత్తనాల క్షేత్రాలు, రాష్ట్రవిత్తనాల క్షేత్రాలు, పరిశోధనా కేంద్రాల నుంచి 14,370 మణుగుల వరి విత్తనాలు సేకరించి, వాటిని ఈ సంవత్సరపు కార్తిలో ఉపయోగించటానికి రైతులకు పంచిపెట్టడం జరిగింది. వివిధ గ్రామాలలో వరి, చెరకు పంటలకై గ్రామానికి 3 చొప్పున మొత్తం 1494 సమిష్టి వ్యవసాయ ప్రదర్శనాక్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. వరి, చెరకు పంటలకు 6763 మెట్రిక్ టన్నుల నత్రజని రసాయనిక యెరువులు పంపిణీ చేయడం జరిగింది. వరిసాగుకు తొలి కార్తెలో 9,055 మెట్రిక్ టన్నుల సూపర్ ఫాస్ఫేటు యెరువు ఉపయోగించడం జరిగింది. సాంద్ర వ్యవసాయ పథకం క్రింద 3,06,623 ఎకరాలలో వేసిన వరి, చెరకు పంటలకు వచ్చే వివిధ రకాల తెగుళ్ళను నిరోధించడం జరిగింది. ఈ పథకంలో పాల్గొన్న రైతులకు అప్పురూపంలో మొత్తం రూ. 32.83 లక్షలు పంచిపెట్టబడినాయి.

### పశ్చిమ గోదావరి జిల్లాలో డ్రైనేజీ పనులు

పశ్చిమ గోదావరి జిల్లాలో పంటకాల్వ క్రింద సాగుఅయ్యే ప్రాంతంలో మురుగునీటి పారుదల ఒక పెద్ద సమస్యగా వుంది. అందుకని ఈ పథకం క్రింద మురుగు నీటి పారుదల సౌకర్యాలు కల్పించే పని చేపట్టబడింది. ఇంతవరకు అయిన పనులకు రూ. 20.82 లక్షలు ఖర్చు అయినాయి.

### 1. పశ్చిమ గోదావరి జిల్లాలో మరి రెండు బ్లాకులకు సాంద్ర వ్యవసాయ పథకం విస్తరణ

ఆచంట, పెనుగొండ బ్లాకులకు సాంద్ర వ్యవసాయ పథకాన్ని విస్తరించడానికి ప్రభుత్వం మంజూరు చేసింది. దీనితో, ఈ పథకం వల్ల పశ్చిమ గోదావరి జిల్లాలో ఏర్పడియున్న 25 బ్లాకులలో 22 బ్లాకులకు లాభం చేకూరుతుంది.

### 2. పొగాకు

కనీవినీ ఎరుగని విపరీత వర్షాలవల్ల పొగాకు విత్తనం వేసిన పొలాలకు చాలా నష్టం కల్గింది. సారవంతమైన మన్ను, పొగాకు సేద్యానికని పొలాల్లో వేసి వుంచిన ఎరువూ అంతా కొట్టుకొని పోయింది. సకాలంలోనే అయినా, వర్షాలు కుంభవృష్టిగా కురిసినందువల్ల పొగాకు ఉత్పత్తిదారులకు గొప్ప నష్టం కలిగింది. ఇలాంటి క్లిష్ట సమయంలో పొగాకు ఉత్పత్తిదారులకూ, పొగాకు విత్తనాలు విక్రయించేవారికీ సహాయపడేందుకై ప్రభుత్వ సిబ్బంది అనేక విధాలుగా సహాయపడుతున్నది. సభలు, సమావేశాలు జరిపి, శాస్త్రీయ పద్ధతులలో పొగాకును పండించడం, పొగాకు తెగుళ్ళను, వ్యాధులను అరికట్టడం మున్నగు విషయాలలో రైతులకు సమాకల్యంగా వ్యవసాయోద్యోగులు బోధించారు.

### 3. పప్పు ధాన్యాలు

పెద్దాపురంలోని ప్రభుత్వ మిల్లెట్ ఫారం నుంచి జి. జి. 525 అనే కొత్తరకం పచ్చ పెసల విత్తనం ఎన్నుకోవడం జరిగింది. చోడవరంలో ఇలాంటిరకం వుత్పత్తి అయింది. ఎకరం 1కి 30 మణుగుల పంట పండుతుంది. స్థానికంగా లభ్యమయ్యే పెసల విత్తనాల కంటే నూటికి 16 వంతులు ఇది యెక్కువ ఫలసాయం ఇస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా జిల్లాల్లో మెట్ట భూముల్లో ఖరీఫ్ కాలంలో ఈ రకం విత్తనం వేయడానికి అనువుగా వుంటుంది.

### 4. ఆంధ్రప్రదేశ్‌లో తీపి నారింజపండ్ల పరిశ్రమ పునర్వ్యవస్థీకరణ

కోడూరు ఫల పరిశోధనా కేంద్రంలో 1938 సంవత్సరం నుంచి తీపి నారింజపండ్ల మొక్కలను గూర్చి తీవ్ర పరిశోధన

చేయగా సత్గూడీ అనే మొక్క ఇతర రకాల మొక్కలకంటే శ్రేష్ఠమైనదనీ, ఫలసాయంలో నేమి, పండ్ల నాణ్యతలో నేమి, రోగాలను ప్రతిఘటించడంలో నేమి ఇది అత్యుత్తమమైనదనీ కనుగొనబడింది

దీర్ఘకాలం సమృద్ధిగా మేలురకం పండ్లు కాపు కాయడానికీ, వ్యాపార దృష్టితో నారింజ తోటలు పెంచడానికీ సత్గూడి మొక్కలు శ్రేష్ఠమైనదని తేలింది రైతులు వీటిని ఉపయోగించేట్లయితే రాష్ట్రంలో ప్రస్తుతం క్షీణావస్థలోనున్న తీపి నారింజపండ్ల పరిశ్రమను పునర్వ్యవస్థీకరించడానికి, ఇది చాల సహాయపడుతుంది

## 5. చెరకు పంట అభివృద్ధి

ఎకరానికి ఫలసాయాన్ని పెంచి, సేద్యపు ఖర్చులను తగ్గించేందుకు, అనకాపల్లిలోని చెరకు పరిశోధనా కేంద్రంలో పరిశోధన జరుగుతున్నది ఇటీవలనే, సిం 775, సిం 975, సిం 997 అను మూడు రకాల చెరకు విత్తనం సేద్యానికి విడుదల చేయబడింది. ఇప్పుడు ఇవి బాగా ప్రచారంలోకి వచ్చాయి. సిం 775 రకం చెరకు విజామాబాదు జిల్లాలో అడ్సాలీ పంటకూ, సిం 975 చిత్తడి భూముల్లోను, సిం 997 ఫ్యాక్టరీ ప్రాంతాల్లోను వేయడానికి యోగ్యంగా వుంటాయి ప్రస్తుతం రాష్ట్రంలో మొత్తం మీద సగటున ఎకరం 1 కి 30 14 టన్నుల చెరకు పండుతుంది. సాంద్ర వ్యవసాయం చేసే ప్రాంతాల్లో ఎకరానికి 32 టన్నులకు పైగానే పండింది

## 6. నూనె విత్తనాలకు సాంద్ర వ్యవసాయం

జాతీయ, అంతర్జాతీయ వ్యాపారంలో వేరుసెనగకు ప్రాధాన్యం పెరిగింది కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో రైతులు వరికోతలైన తరువాత, నీటి పారుదల సౌకర్యంతో రెండవ పంటగా వేరు సెనగను పండిస్తున్నారు వేరు సెనగ పంటను ఇంకా అధికం చేయడానికై ప్రభుత్వం కర్నూలు, మహబూబునగరు జిల్లాల్లో 1962-63 సం లో నీటి సరఫరా సౌకర్యం కల్పిస్తూ, వేరుసెనగ పంటకు సాంద్ర వ్యవసాయ పథకాన్ని అమలుపరచే విషయమై పరిశీలిస్తున్నది

## 7. కొత్తరకం జి 3 మిర్చి

లాం వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో యన్ పి. 46-ఎ-బల్క్ రకం మిర్చి నుంచి జి 3 అను క్రొత్త రకం మిర్చీ తయారు చేయబడింది. ఎనిమిది సంవత్సరాలు తీవ్ర పరిశోధన చేసిన తరువాత ఈ రకం జి 2 మిర్చీ కంటే శ్రేష్ఠమైనదని కనుగొనబడింది. గత మూడు సంవత్సరాలుగా వివిధ జిల్లాలో జి 3 రకం మిర్చీ పంటను పండించి ఫలితాల్ని గమనించడం జరిగింది. ఫలితం ప్రోత్సాహకరంగా వుంది జి 2 రకం మిర్చీ కంటే 4 శాతం యెక్కువ పండింది స్థానిక రకాల కంటే 27 శాతం హెచ్చు పంట పండుతుంది దిగుబడి హెచ్చుగా వుండడమే గాకుండా, ఈ రకం మిర్చీ బాగా ఘాటుగా ఉండుతుంటుంది ఎరుపు రంగు అలాగే వుంటుంది పురుగుపట్టని అనేక ప్రాంతాల్లో పండించడానికి అనువుగా వుంటుంది కాయలు రెమ్మలకు గట్టిగా పట్టుకొని వుంటాయి విత్తనాలెక్కువగా వుండి, ఘాటుగా ఉంటాయి ఎగుమతి వ్యాపారం వేయడానికి కావలసిన సైజు ఆకారంతో వుంటాయి

## 8 తినడానికి యోగ్యమైన కుక్క గొడుగులు

రాజేంద్రనగరంలోని వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో తినడానికి యోగ్యమైన కుక్క గొడుగులను పెంచే విషయమై ప్రయోగాత్మకంగా పరిశోధనలు జరుగుతున్నాయి చేతితో మెత్తగా నలగకొట్టిన వరిగడ్డిని నీళ్ళలో 24 గంటలు నానబెట్టిన తరువాత, దానికి 3 నుంచి 4 అడుగుల పొడవులోను, $2\frac{1}{2}$ నుంచి 3 అడుగుల ఎత్తులోను పేర్చి గడ్డి పొరల మధ్య శుద్ధమైన కుక్క గొడుగులు వుంచడం జరుగుతుంది. రాజేంద్రనగర్‌లో జరిగిన ప్రయోగాలలో ఒక మడిలోనే 3 కిలోగ్రాములు 50 గ్రాములు కుక్క గొడుగుల ఫలితం లభించింది సాధారణంగా వాతావరణం వెచ్చగా వుండి, ఉష్ణోగ్రత 75° ఫారిన్‌హీట్‌కు పైనవుంటే 6 నుంచి 10 పౌనుల వరకు పంట సాధించవచ్చు. ప్రత్యేక రకమైన ఈ కుక్క గొడుగులో పుష్టికరమైన ఆహార పదార్థాలు వుంటాయి. ప్రోటీనులు 3 8%, క్రొవ్వు 0 8%, ఖనిజలవణములు 1 4%, కార్బోహైడ్రేట్స్ 5 1% కాక విటమిన్ బి కంప్లెక్సు, సి విటమిన్ లభిస్తాయి కొత్తరకమైన తిండిగా వుపయోగపడుటమేగాక, ఇవి పౌష్టిక ఆహారంగా కూడా పనికివచ్చేందుకు గొప్ప అవకాశముంది

## 9. పంటల పోటీ

గత 12 సంవత్సరాలుగా రాష్ట్రంలో వరి, జొన్న, వేరు సెనగ, చెరకు పంటలలో పోటీలు, నిర్వహించబడుతున్నాయి. వరి, జొన్న, వేరుసెనగ పంటల పోటీలు, గ్రామ, బ్లాకు, జిల్లా, రాష్ట్ర స్థాయిలలో జరుగుతాయి. చెరకు విషయంలో బ్లాకు, జిలా, రాష్ట్ర స్థాయిలలో జరుగుతాయి. ఇంతవరకు వరి పంటలో 1006 మందినీ, జొన్న పంటలో 450 మందినీ, వేరు సెనగలో 6/4 మందినీ పోటీల జాబితాలో చేర్చుకోవడం జరిగింది ***

# హిమాలయ యోధులు

మంచుతో కప్పివేసిన హిమాలయ సరిహద్దు ప్రాంతంలో, మిక్కిలి కష్టతరమైన పరిస్థితులలో విశ్వాసఘాతకుడైన శత్రువుతో పోరాడడంలో మన సాయుధదళాలవారు అసమాన ధైర్య స్థైర్యాలు ప్రదర్శిస్తున్నారు. విభిన్న పరిస్థితులలో వీరుచూపిన అపూర్వ బలపరాక్రమాలు ధైర్య స్థైర్యాలు శక్తిసామర్థ్యాలను చాటే కొన్ని గాథలు దిగువ పొందుపరచబడినాయి

లడక్, నేఫా ప్రాంతాలలో చైనా దురాక్రమణదారులను ప్రతిఘటించడంలో అత్యంత ధైర్య సాహసాలు ప్రదర్శించినందుకు గూర్ఖా రైఫిల్స్‌కుచెందిన మేజర్ ధాన్‌సింగ్ థాపా (మరణానంతరం)కు, సిక్కు రెజిమెంటుకు చెందిన సుబేదార్ జోగేందర్ సింగ్ (జాడతెలియదు)కు పరమవీరచక్ర పతకాలను బహూకరించినట్లు ఢిల్లీలో ప్రకటించారు.

మేజర్ ధాన్‌సింగ్ థాపా లడక్‌లోని ఒక అగ్రస్థావరంలో దళాధిపతిగా వున్నారు అక్టోబరు 20 వ తేదీన ఆస్థావరంపై చైనీయులు అత్యధిక సంఖ్యలో వచ్చి దాడిజరిపారు అంతకుముందు వారు మోర్టారులను, శతఘ్నులను భారీఎత్తున ప్రయోగించారు.

ఈ అధికారియొక్క సమర్ధవంతమైన నాయకత్వం క్రింద ఆ స్థావరంలో అల్పసంఖ్యలోనే వున్న జవానులు శత్రుదాడులను త్రిప్పికొట్టారు దురాక్రమణ దార్లకు తీవ్రనష్టాలు కలిగించారు

శత్రువులు మోర్టారులను, ఫిరంగులను విరివిగా ప్రయోగించి హెచ్చుసంఖ్యలో మళ్లీ దాడిచేశారు మేజర్ థాపా నాయకత్వం క్రింద ఆయన జవానులు ఈ దాడిని కూడా ప్రతిఘటించారు. శత్రువులకు అధికనష్టాలు కలిగించారు.

తరువాత చైనీయులు మూడవసారి దాడిజరిపారు. ఈ పర్యాయంవారు 'టాంకు'లతో వచ్చిపడ్డారు. అంతక్రితం జరిగిన రెండుదాడులలోనూ ఈ స్థావరం చెప్పుకోదగినంతగా నష్టపడింది

## అనేకమంది చైనీయుల వధ:

అత్యధిక సంఖ్యలోవున్న చైనా దురాక్రమణదారులు చివరకు ఈ స్థావరాన్ని ఆక్రమించుకున్నప్పుడు మేజర్ థాపా తన కందకంలోనుంచి బయటికివచ్చి, చైనా సైనికుల కాల్పులకు గురై నేల కొరిగేవరకూ, వారితో కలియబడి అనేకమందిని హతమార్చాడు.

సమర్థమైన నాయకత్వంలోనూ, అసమానమైన ధైర్య సాహసాల ప్రదర్శనలోనూ మేజర్ థాపా అత్యుత్తమ భారతీయ సైనిక సంప్రదాయాలను పరిపోషించాడు.

నేఫాలో తాంగ్‌పెంగ్‌లా సమీపంలో ఒక పర్వతశ్రేణివద్ద ఒక రక్షణ స్థావరాన్ని కాపలాకాస్తున్న సిక్కు రెజిమెంటుకు చెందిన ఒక దళానికి సుబేదార్ జోగీందర్‌సింగ్ కమాండరుగా వున్నాడు.

అక్టోబరు 23 వ తేదీన ఉదయం 5_30 గం. లకు తవాంగ్‌కు చొచ్చుకొని వెళ్లే ఉద్దేశంతో చైనీయులు బుమ్లా "ఆక్సిస్" పై భారీ ఎత్తున దాడి ప్రారంభించారు.

శత్రువులు మూడుసార్లు ప్రతిపర్యాయం సుమారు 200 మంది చొప్పున దాడులు జరిపారు.

సుబేదార్ జోగీందర్‌సింగ్, ఆయన బృందం మొదటి దాడిని ప్రతిఘటించారు శత్రువులకు భారీనష్టాలు సంభవించడం వల్ల తాత్కాలికంగా వారు ముందుకు రాకుండా నిలిచిపోయారు తరువాత కొద్ది నిమిషాలకు వారు మళ్లీ దాడిచేశారు దీనినికూడా జోగీందర్‌సింగ్ ప్రభృతులు అదేవిధంగా త్రిప్పికొట్టారు. కాని అప్పటికే ఆ దళం సగంబలం కోల్పోయింది

సుబేదార్ జోగీందర్‌సింగ్‌కు తొడపై గాయంతగిలింది. అయినప్పటికీ స్థావరాన్ని ఖాళీచేయడానికి ఆయన సమ్మతించలేదు. ఉత్తేజకరమైన అతని నాయకత్వం క్రింద ఆ దళం

అక్కడే ధైర్యంగా నిలబడి పోరాడడానికి నిశ్చయించుకుంది. ఉపసంహరించుకోడానికి నిరాకరించింది.

ఈ లోగా ఈ స్థావరంపై శత్రువులు మూడవసారి దాడి జరిపారు. సుబేదారు స్వయంగా ఒక తేలిక మరతుపాకీ తీసుకొని పెక్కుమంది శత్రుసైనికులను హతమార్చాడు

తీవ్రంగా నష్టాలు సంభవిస్తున్నప్పటికీ వారు అలాగే ముందుకు చొచ్చుకొని వచ్చారు. అసాధ్యమైన పరిస్థితి ఏర్పడింది. సుబేదార్ జోగీందర్ సింగ్ ఆయన బృందం తమతమ చోట్లను వదిలి బయటికివచ్చి బయనట్లను ఎక్కుపెట్టి పైకివస్తున్న చైనా దళంపైనబడ్డారు తమ స్థావరాన్ని శత్రువులు ఆక్రమించుకొనే లోగా అనేకమంది శత్రుసైకులను పొడిచారు

ఈ సంఘటనల్లో సుబేదార్ జోగీందర్‌సింగ్ అద్యంతం ప్రదర్శించిన సేవా నిరతి, ధైర్య పరాక్రమాలు అసమానమైనవి.

## గస్తీ కేంద్రం రక్షణకు వీరోచిత పోరాటం

లధక్‌లోని ఒక గస్తీ కేంద్రాన్ని రక్షించడానికి భారత సైన్యానికి చెందిన ఒక జవాను దుర్గమ ప్రాంతంలో, ప్రతికూల వాతావరణ పరిస్థితిని సైతం లక్ష్యపెట్టకుండా చూపిన అద్భుత సాహసకృత్యాన్ని తెలిపే గాధ ఇది

అక్టోబరు 23 వ తేదీన పోరాటం సందర్భంలో హాట్‌స్ప్రింగ్ సమీపంలోని మన గస్తీ కేంద్రానికి చెందిన తేలిక మరతుపాకీ శత్రు బలగాల మందుగుండ్ల తాకిడికి నిరుపయోగమైపోయింది. మన జవానులు ఇద్దరు మరణించారు. ఈ గస్తీ కేంద్రానికి చెందిన సిపాయ్ ఖేమారామ్ ధైర్యంగా నిలబడి తన స్తానాన్ని రక్షించడానికై చివరి రౌండు వరకూ కాల్పులు జరిపాడు.

తరువాత 40 అడుగుల ఎత్తు నుంచి ఒక కాలువలోకి దూకి తప్పించుకున్నాడు. ఎముకలు కొరికే చలిలో అన్న పానీయాలు, ఆశ్రయం లేకుండా పూర్తిగా రెండు రోజులు గడిపాడు.

ఈ సంఘటనను గూర్చిన వివరాలను పేర్కొంటూ లధక్ సమరరంగం నుంచి ఇప్పుడే తిరిగి వచ్చిన సైనిక పరిశీలకుడు ఒకరు, ఈ గస్తీ కేంద్రం ఒకే ఒక జె.సి.ఓ. అధ్వర్యం క్రింద వున్నట్లూ అక్టోబరు 20 వ తేదీ వరకూ తన సాధారణ విధులు నిర్వర్తిస్తున్న ఒక చైనా స్థావరానికి కనుచూపు మేరలోనే ఇది వున్నట్లూ పేర్కొన్నాడు.

అక్టోబరు 23 వ తేదీన రాత్రి 10 గంటలకు చైనీయులు ఈ గస్తీ కేంద్రంపై భారీ మోర్టార్లతో కాల్పులు ప్రారంభించారు. ఎడతెరిపి లేకుండా గంటసేపు కాల్పులు సాగించాక వారు పూర్తి అంధకారంలో దాడి జరిపారు

కందకంలో సిపాయ్ ఖేమారామ్ ఒక్కడే వుండిపోయాడు. మోర్టారు గుండ్లకు అతని వ్రేళ్ళు గాయపడినప్పటికీ ప్రాణాపాయం లేకుండా తప్పించుకొనగలిగాడు కందిరీగల దండువలె పైన బడుతున్న చైనీయులపై కాల్పులు సాగిస్తూనే వున్నాడు అతను కాల్పులు జరుపుతున్న సమయంలో "బంకర్" లో వున్న నాయక్ మాయారామ్, సిపాయ్ ముక్త్యార్‌సింగ్ వెనుకభాగంలోని రక్షణ శ్రేణిలోకి వచ్చివేశారు. కాని మిగతా ఇద్దరు జవానులు మరో కందకంలో మరణించారు

తన తోటి సిపాయిలు, నలుగురు వధించబడటం సిపాయ్ ఖేమారామ్ ప్రత్యక్షంగా చూశారు. కాని తన వద్ద వున్న మందు గుండు సామగ్రి పూర్తి కావచ్చినందువల్ల వారిని ఆదుకోలేక పోయాడు చివరి రౌండ్లు ప్రేల్చి శత్రువులపై రెండు చేతి బాంబులు విసిరి తన కందకంలో నుంచి బయటికి వచ్చాడు. చైనీయులు గుండ్లవర్షం కురిపిస్తున్నప్పటికీ లక్ష్యపెట్టకుండా కాలువ వైపుకు పరుగెత్తాడు దాని వద్దకు చేరుకొని 40 అడుగుల దిగువన వున్న కాలువలోకి దూకాడు. ఈ సందర్భంలో అతని మోకాలు వెముక విరిగింది. కాలువ గుండా సుమారు ఒక మైలు దూరం వరకు వెళ్ళి ఒక పెద్ద గుండు మరుగున దాక్కున్నాడు. ఎముకలు కొరికే చలిలో రెండు పగళ్లు, రెండు రాత్రులు నిరాహారంగా, నిరాశ్రయంగా గడిపాడు.

## శత్రువశం నుంచి రైఫిల్‌మన్ పరారీ

కిబిటూ (నేఫా) లో శత్రువుల చేత చిక్కిన తరువాత కుమావూ రెజిమెంటుకు చెందిన రైఫిల్‌మన్ బచీసింగ్ అపూర్వమైన తన సమయస్ఫూర్తితోనూ ధైర్య సాహసాలతోనూ శత్రువుల బారి నుంచి ఏవిధంగా తప్పించుకొనగలిగాడో దిగువ తెలపబడింది

చైనీయులు భారీ ఎత్తున జరిపిన దాడి ఫలితంగా కిబిటూ వారి వశమైపోయింది, అప్పటివరకూ ఆ ప్రాంతంలో వున్న భారత దళానికి చెందిన బచీసింగ్ ఆ ప్రాంతం శత్రువుల వశం కావడానికి పూర్వమే మరో స్థావరానికి సందేశం అందజేసే నిమిత్తం వెళ్ళాడు. తన పని పూర్తి చేసుకొని తన స్థావరాన్ని

ఖాళీచేసిన విషయం తెలియక అచ్చటికి తిరిగి వచ్చాడు. అప్పటికి బాగా చీకటి పడింది. బాగా చలిగా వుంది గాడ్పులు తీక్షణంగా వీస్తున్నాయి ఆ స్థావరంలోకి బచీసింగ్ నిస్సంకోచంగా వెళ్లాడు తరువాత ముగ్గురు చైనీయులు అతన్ని బంధించి కొండపైకి తీసుకొని వెళ్తున్న సందర్భంలో అదును చూసుకొని వారిని త్రోసివేసి పరుగెత్తాడు అప్పుడు వారిలో ఒకడు కాల్పులు జరిపాడు దానికి అతని ముంజేతిపై గాయం తగిలింది తరువాత ముగ్గురూ అతన్ని వెంటాడారు. కాని బచీసింగ్ పెద్ద బండల చాటున నక్కుతూ చీకట్లో తప్పించుకొనగలిగాడు పిమ్మట అతను లోహిత్ పర్వతాల గుండా వెళ్ళి చివరకు వాలాంగ్ చేరుకన్నాడు

## ఐ ఎ.ఎఫ్. పైలట్ అద్భుత కృత్యం

నేఫా ప్రాంతంలో యుద్ధ రంగంలో తీవ్రంగా గాయపడిన వ్యక్తిని తన ప్రాణాపాయాన్ని సైతం లెక్కచేయకుండా సురక్షిత ప్రాంతానికి చేర్చిన ఒక హెలికాప్టర్ పైలట్ సాహసగాథను యుద్ధరంగం నుంచి అందిన సమాచారం తెలుపుతున్నది

యుద్ధ ప్రాంతం నుంచి తిరిగి వచ్చిన భారత వైమానిక దళానికి చెందిన ఒక పరిశీలకుడు ఇలా తెలిపారు జమీథాంగ్‌లో హెలికాప్టర్ స్థావరాన్ని ఏర్పాటు చేశారు. ఇది సముద్ర మట్టానికి 7500 అడుగుల ఎత్తున వుంది హెలికాప్టర్లు రోజంతా యుద్ధరంగంలో క్షతగాత్రులైన వారిని సంచార సైనిక సర్జికల్ విభాగాలకు చేరవేయడానికి వినియోగించబడుతుంటాయి. లుంపూలో ఇలాంటి ఒక స్థావరాన్ని నెలకొల్పారు. ఇచ్చట ఒక దిబ్బపై హెలికాప్టరు దిగడానికి మాత్రమే సరిపోయేంత స్థలం వుంది. దీనికి అన్ని వైపులా ఏటవాలుగా వుంది ఉదయం పూట కూడా ఇచ్చట హెలికాప్టరు దించడం దుర్లభమే.

ఒక రోజు మధ్యాహ్నం. హెలికాప్టరు యంత్రంలో ఏదో లోపం వున్నట్లు దాని పైలటు కనుగొని మర్నాటికి దాన్ని సిద్ధంగా వుంచే నిమిత్తం యంత్రాన్ని చక్కబరచవలసిందిగా సిబ్బందిని కోరాడు. సూర్యాస్తమయమై అంధకారం ఆవరిస్తున్నది అప్పుడు సిబ్బంది పైలట్ వద్దకు వెళ్ళి యంత్రంలో ఏర్పడిన అవరోధం తొలిగించబడినదనీ, అదీ సక్రమంగా పనిచేస్తున్నదీ లేనిదీ పరిశీలించుకోవలసినదనీ కోరారు వారు కోరిన ప్రకారం పైలట్ ఇంజన్ నడపడానికి ఉపక్రమించాడు. ఆ సమయంలో ఒక సైనికాధికారి అచ్చటికి పరుగెత్తుతూ వచ్చి ట్సాంగ్‌ధర్ వద్ద ముగ్గురు క్షతగాత్రులు వున్నారనీ, వారిలో ఒకరిని లుంపూ సంచార సర్జికల్ విభాగానికి తక్షణమే తీసుకొని వెళ్లాలని తెలిపాడు

ప్రతికూల వాతావరణ పరిస్థితుల్లో గానీ, రాత్రి సమయాలలో గాని ఆ హెలికాప్టరును వాడడానికి వీలుపడదు అయినప్పటికీ తన మిత్రుడు ఒకరు ప్రాణాపాయ స్థితిలో వున్నట్లు తెలిసినందున ఆ పైలట్ మసక మసకగా వున్న ఆ సమయంలోనే ట్సాంగ్‌ధర్‌కు బయలుదేరాడు తరువాత 20 నిమిషాలకు ట్సాంగ్‌ధర్ సమీపించాడు ఈ ప్రాంతం సముద్ర మట్టానికి 11,000 అడుగుల ఎత్తున వుంది హెలికాప్టర్ దిగడానికి ఇచ్చట ఏర్పరిచిన స్థలం లుంపూ ఆశ్రయానికంటే కూడా చాలా దుస్తరమైనది. అయినా ఎంతో శ్రమతో సురక్షితంగా క్రిందికి దిగాడు కాని గాయపడిన వ్యక్తిని తీసుకొని వచ్చి హెలికాప్టరులో ఎక్కించేటప్పటికే పూర్తిగా అంధకారమైపోయింది. పైలట్‌కు యంత్ర పరికరాలు కన్పించడం కూడా దుర్లభమైపోయింది. అప్పుడు పైలట్ ఒక సైనికోద్యోగి వద్ద నుంచి టార్చిను అడిగి తీసుకొని దానిని తన కాళ్ళ సందుకు మధ్య వెలిగించి పెట్టాడు

పర్వత శ్రేణుల గుండా పయనించడం చాలా దుర్లభం. కాగా గాఢాంధకారంలో మిణుగు మిణుగు మంటున్న వెలుగులో దారి చూసుకుంటూ వెళ్ళడం మరీ కష్టం అయినా ఈ ఇబ్బందులను వేటిని లక్ష్యపెట్టకుండా పైలట్ క్షతగాత్రుడైన సైనికునితో ట్సాంగ్‌ధర్ నుంచి లుంపూకు బయలుదేరాడు లోయల గుండా పర్వతశ్రేణుల గుండా ప్రయాణం చేసి పూర్తి అంధకారంలో లుంపూ చేరాడు.

లుంపూ హెలికాప్టర్ స్థావరాన్ని తాము సమీపించినట్లు చీకటిని చీలుస్తూ నుంచున్న పర్వతాకారాన్ని బట్టి ఆయన గ్రహించాడు. హెలికాప్టరును జాగ్రత్తగా దించాడు హెలికాప్టర్ స్థావరంలో సైనికాధికారి ఒకరు ఎలక్ట్రిక్ టార్చిని ఊపుతుండటం కనిపించింది హెలికాప్టరును మెల్లగా దింపుతూ హెలికాప్టర్ ఆశ్రయంగా ఉపయోగించబడుతున్న చిన్న భూప్రాంతానికై వెతుక్కుంటూ అక్కడ సురక్షితంగా క్రిందికి దిగాడు ఒక ప్రాణిని రక్షించాడు.

---

# పచ్చి మోసం

ఇతర దురాక్రమణదారుల మాదిరిగానే, చైనాకూడా, భారీ యెత్తున దండయాత్ర చేయడానికి జాగ్రత్తగా సర్వసన్నాహాలు చేసుకొని, మనల్నే దురాక్రమణ చేసినట్లుగా నిందారోపణ చేసింది; కనీసం కొంతమందైనా నమ్ముతారనే ఆశతో, పచ్చి అబద్ధాలు ఆడడానికి చైనా వెనుతీయదు కనుక గతకొన్ని సంవత్సరాలుగా జరిగిన సంఘటనల్ని గూర్చి సత్యమేమిటో తెలుసుకొందాం. వాస్తవిక పరిస్థితులు వాటంతటవే నిజానిజాలు తెలుపుతాయి.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని సముపార్జించుకొన్న తర్వాత చైనా ప్రజలతో ప్రాచీన సంబంధాల్ని పునరుద్ధరించుకోవాలని సంకల్పించింది. చైనా ప్రజాప్రభుత్వం ఏర్పడిన తరువాత, అధికార రీత్యా ఆ ప్రభుత్వాన్ని గుర్తించిన దేశాలలో మొట్టమొదటిది మన దేశమే.

ఆ తరువాత, అంతర్జాతీయ సంస్థలో చైనా ప్రజా ప్రభుత్వానికి ప్రాతినిధ్యం కల్పించేందుకై భారతదేశం ఇన్ని యేండ్లుగా నిరవధికంగా కృషిచేస్తూనే వుంది. ఆసియా ఖండంలోనే గాక, ప్రపంచమంతటా స్థిరత్వమేర్పడాలంటే, చైనావంటి పెద్దదేశాన్ని ప్రపంచ సంస్థనుంచి మినహాయించకూడదనే విశ్వాసంతో పని చేస్తూ వుంది.

గత కాలంనుంచీ అపరిష్కృతంగా వున్న సమస్యలన్నీ ఒకసారి పరిష్కారమైతే ఉభయ దేశాలమధ్య స్నేహబంధం మరింత దృఢపడుతుందనే భావంతో టిబెట్ సమస్యనుగూర్చి చైనాతో చర్చలు ఆరంభించడానికి భారతదేశం చొరవతీసుకొంది. టిబెట్ భారతదేశాలమధ్య వ్యాపారం, ఇతర అన్యోన్య సంబంధాల్ని గూర్చి 1954 ఏప్రిల్ నెలలో చేసుకొన్న ఒప్పందంలో టిబెట్‌తో బ్రిటిష్‌వారికి వున్న ప్రాంతీయ హక్కులన్నింటినీ భారతదేశం వదలుకొనింది. టిబెట్ చైనాకు చెందిన ప్రాంతంగా గుర్తించింది. అంతేగాక యాటంగ్, గ్యాంట్సీలలో వున్న భారతీయ గస్తీ సైన్యాన్ని ఉపసంహరించుకోవడానికి కూడా అంగీకరించింది. టిబెట్‌లో భారతప్రభుత్వానికి చెందిన తంతి, తపాలా టెలిఫోన్ సర్వీసులు, విశ్రాంతి మందిరాలను అతి స్వల్పధరకు చైనా ప్రభుత్వాధీనం చేసింది.

## పంచసూత్రములు

1954 సం॥ ఒప్పందంలోని ఉపోద్ఘాతంలో పేర్కొనబడి వున్న పంచసూత్రములే, తరువాత పంచశీలగా వ్యవహరింపబడుతూవచ్చింది. అవి: పరస్పర దేశ సమగ్రతనూ సార్వభౌమాధికారాన్నీ గౌరవించడం; పరస్పర నిర్యుద్ధం, పరస్పర ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్గించుకోకపోవడం, సమానత్వం, పరస్పరం గౌరవించడం, శాంతియుత సహజీవనం. ఈ పంచసూత్రాలకు కట్టుబడి వుంటానని చైనా ప్రకటించడంతో ఉభయ దేశాలమధ్య అపరిష్కృతంగావున్న సమస్యలు ఏవీలేవని అర్థం.

చైనా ప్రధానమంత్రి శ్రీ చౌ-ఎన్-లై 1954 జూన్ నెలలో భారతదేశాన్ని సందర్శించారు. మన ప్రభుత్వమూ ప్రజలు ఆయనకు ఘనస్వాగతమిచ్చారు. శ్రీ నెహ్రూతో చేసిన సంయుక్త ప్రకటనలో తన ప్రభుత్వానికి పంచసూత్రాలలో విశ్వాసముందని ఆయన పునరుద్ఘాటించారు.

అయితే ఆ తరువాత వెంటనే పంచసూత్రములపట్ల గావించిన ప్రకటన వమ్ముఅయిపోయింది. చైనా ప్రభుత్వం 1954 జూలై 17 వ తేదీన ఉత్తర ప్రదేశ్‌లో బారాహోటీ (దానిని వాళ్ళు వూ-జె అన్నారు)లో భారత సైన్యాలు వుండడాన్ని నిరసించింది. చైనా ప్రభుత్వం భారతదేశ అంతర్భాగమైన ప్రాంతానికి తన హక్కును ఆపాదించడం ఇదే తొలిసారి. సాంప్రదాయ సిద్ధమైన భారత సరిహద్దులను గూర్చి ఏ కాలంలోను కూడా సందేహంలేదు. అధికారయుతంగా తయారైన భారతదేశ చిత్రపటాలలో దేశసరిహద్దులు స్పష్టంగా పేర్కొనబడివున్నాయి. శతాబ్దాలతరబడిగా భారతీయ అధికారులు సాంప్రదాయసిద్ధమైన సరి

హద్దుల ప్రాంతాలలో అధికారం చెలాయిస్తూ వచ్చారు కూడా. ఈ ప్రాంతాల్లో అనేకం భారతరాజ్యాంగంలో పేర్కొనబడి వున్నాయి. మనం చెలాయిస్తూ వచ్చిన అధికారాన్ని చైనాలోని ఏ ప్రభుత్వం కూడా ఎప్పుడూ నిరసించలేదు.

అయితే తడవతడవకూ ఎత్తులు మారుస్తూ, ముకీభావం వహిస్తూ చేసిన ఒప్పందాల్ని బహిరంగంగా త్రోసిపుచ్చుతూ, కల్లకపటాలతో, చైనా పీపుల్స్ రిపబ్లిక్, భారత దేశాధీనంలో వున్న విశాల ప్రాంతాలపై హక్కులు కోరుతూ వచ్చింది

## సువ్యవస్థితమైన సరిహద్దులు

ఈ విషయాలను తెలుసుకోవడానికి ముందు, భారత–చైనా దేశాల మధ్యగల సరిహద్దుల చరిత్ర, భౌగోళిక అంశాలను ముందు తెలుసుకుందాం

భారత–చైనా దేశాలమధ్య సరిహద్దు 2,200 మైళ్ల పొడవుకు విస్తరించి ఉంది భూటాన్–టిబెటుల మధ్య సరిహద్దు 300 మైళ్లకు మించి ఉంది. యీ మొత్తం సరిహద్దును ఒప్పందం ద్వారా గానీ, ఆచార వ్యవహారంవల్లగానీ, రెంటిద్వారాగానీ నిర్ణయించడం జరిగింది పెక్కు ప్రాంతాలలో హిమాలయ శిఖరాలపై భౌగోళికమైన నీటిధారల సూత్రాలను అనుసరించడం జరిగింది. తూర్పుభాగం, మధ్యభాగం, పశ్చిమభాగంగా యీ బృహత్తర సరిహద్దును మూడు విభాగాలుగా విభజించవచ్చు

1913–14 వ సం॥లో సిమ్లాలో జరిగిన భారత, టిబెటు, చైనా ప్రభుత్వాల ప్రతినిధుల సమావేశంలో తూర్పుభాగంలో సాంప్రదాయిక సరిహద్దును నిశ్చయించారు. భారత, టిబెటు ప్రతినిధులు ధ్రువీకరించిన నిర్ణీత సరిహద్దురేఖను మ్యాపులో కలిపి, చైనా ప్రతినిధి సంతకం చేసిన ఒప్పందానికి యీ మ్యాపును జత చేయడం కూడా జరిగింది. భూటాన్‌కు తూర్పున యీ రేఖను మెక్‌మహన్ (యీ సమావేశంలో బ్రిటిష్ అధికారిగా పాల్గొన్న మెక్‌మహన్ పేర)గా పిలువబడుతున్నది.

అయితే యీ మెక్‌మహన్‌రేఖ కేవలం సహజసిద్ధమైన సాంప్రదాయికమైన, పరిపాలనకు సంబంధించిన సరిహద్దును మాత్రమే ధ్రువీకరించింది

ఉత్తరాన టిబెట్ మైదానం, దక్షిణాన దిగువ పర్వతాలుగల హిమాలయ పర్వత శిఖరాలమధ్య సహజసిద్ధమైన సరిహద్దుల మార్గాననే యీ మెక్‌మహన్‌రేఖ ఉంది.

ఉత్తరప్రదేశ్, హిమాచల్‌ప్రదేశ్, పంజాబురాష్ట్రాల సరిహద్దులే భారత–టిబెటులమధ్య మధ్యభాగంలోని సరిహద్దులుగా ఉన్నాయి. యివికూడా నదుల నీటి సహజ పంపిణీలపై యేర్పడినట్టివి

ఈ ప్రాంతాలన్నీ మన అధీనంలోనే ఉన్నాయని రుజువు పరచే పురాతన రివెన్యూ రికార్డులు యెన్నో మనవద్ద ఉన్నాయి. యిక పశ్చిమభాగం విషయం–జమ్మూకాశ్మీరు, సిక్యాంగ్ టిబెటుల మధ్య 1100 మైళ్ల పొడవు సరిహద్దు ఉంది దీనిలో 2/3 వ వంతు భాగం లదక్ జిల్లాలో ఉంది ఇది సాంప్రదాయమైన, సువిదితమైన సరిహద్దు కాశ్మీరు ప్రతినిధులు, దలైలామా, చైనా చక్రవర్తులమధ్య 1842లో జరిగిన ఒప్పందంలో యీ సరిహద్దును ధ్రువీకరించారు కూడా ఆ తర్వాత భారత ప్రభుత్వ అధికారులు యీ ప్రాంతాన్ని సర్వేజరిపి భారతమ్యాపులలో యీ సరిహద్దును స్పష్టంగా చూపించారు 1893, 1917, 1919 సంవత్సరాలలో వెలువడిన చైనా అధికారిక మ్యాపులలో కూడా భారతిమ్యాపులు చూపిన సరిహద్దులనే చూపాయి

## సిక్కిం, భూటాన్

సిక్కిం, భూటాన్ సరిహద్దులు కూడా భారత–చైనాల మధ్యగల సరిహద్దు సమస్యలతో ముడిపడిఉన్నాయి టిబెటు–భూటాన్‌ల మధ్య సరిహద్దును 1890 లో యేర్పాటు చేశారు. అప్పుడు చైనా ప్రభుత్వంకూడా యీ సరిహద్దును ఆమోదించింది. భూటాన్ సరిహద్దులు వాడుకలో కూడా యిదేవిధంగా నిర్దేశించబడినాయి అయితే భూటాన్‌లోని కొంతభాగం టిబెటుకు చెందినదని చైనామ్యాపులలో చూపిస్తున్నారు. యీ తప్పులు సరిదిద్దే సమస్య భారత దేశానికి సంబంధించివుంది. దీనికి కారణం–బూటాన్‌తో భారత దేశానికి ఉన్న ఒప్పందం ప్రకారం బూటాన్ విదేశ వ్యవహారాలను భారతదేశం చూస్తుండడమే భారత చైనాల మధ్య వున్న సాంప్రదాయికమైన సరిహద్దు వున్న విషయం కూడా చైనా ప్రజా ప్రభుత్వానికి బాగా తెలుసు. యెక్కడా సందేహం లేకుండా ఉండే విధంగా ప్రధానమంత్రి 1950 నవంబరు 20 వ తేదీన లోక సభలో ప్రసంగిస్తూ "మెక్‌మహన్ రేఖ మా సరిహద్దు, ఆ సరిహద్దును చొచ్చుకొని యెవ్వరినీ రానివ్వం" అని అసందిగ్ధంగా ప్రకటించాడు.

ఖచ్చితంగా ప్రకటింపబడిన మన ఈ విధానాన్ని చైనా అధికారులెవ్వరూ ప్రశ్నించలేదు టిబెట్‌లో మన ప్రయోజనాలకు

సంబంధించిన విషయాలను 1951_52 లలో వివిధ సందర్భాలలో చర్చించారు. కాని చైనీస్ ప్రభుత్వం సరిహద్దు విషయం సంప్రదించాలని ఎట్టి సూచనకూడా చేయలేదు ఏది ఏమైనా భారత భూభాగంలో ఈశాన్య సరిహద్దులలో 36 వేల చదరపు మైళ్ళు, ఈశాన్య లధక్‌లో 12 వేల చదరపు మైళ్ళు చైనాకు చెందినట్లు చైనా మ్యాపులలో చూపించడం జరిగింది ఇండియా, చైనా మ్యాపులలో వున్న భేదాలను ఇండియా చైనాప్రభుత్వం దృష్టికి తేగా ఆ పటాలు కొమింటాంగ్ కాలంనాటి పాత మ్యాపుల ఆధారంగా అవి రూపొందించబడినాయని చైనా జవాబిచ్చింది తమ మ్యాపులనాధారంగా తీసుకొని ఫలాని భూభాగంపై చైనా తన ఆధిపత్యాన్ని నిర్ణయించలేదు.

1954 లో టిబెట్ విషయంలో ఇండియా, చైనా ఒప్పందంపై సంతకాలు జరిగినప్పుడైనా భారతదేశంతో టిబెట్ సరిహద్దుల విషయాన్ని చైనా ప్రస్తావించి వుండాల్సింది కాని ఆ సరిహద్దును తాము అంగీకరించనట్లు చైనా చెప్పలేదు.

1954 అక్టోబరులో మన ప్రధాన మంత్రి చైనా సందర్శించారు ఆయన చైనాలో వున్నప్పుడు తప్పుడు చైనా మ్యాపుల విషయాన్ని ఎత్తారు కాని ఆ మ్యాపులు పాత కొమింటాంగ్ మ్యాపుల ఆధారంగా తయారు చేయడం జరిగిందనీ, తమ ప్రజాప్రభుత్వానికి వాటిని సవరించే వ్యవధి లేదనీ చౌ_ఎన్_లై తిరిగి పాత పాటే పల్లించాడు.

అస్తవ్యస్తంగా వున్న ఈ చైనా గాధ అప్పటినుంచి త్వర త్వరగా సాగింది.

1955 ఒక చైనాబృందం ఉత్తరప్రదేశ్‌లోని బరాహోతీలో బైరాయించింది.

1956 వేసవిలో ఒక చైనా సర్వే బృందం పంజాబ్‌లోని స్పితి ప్రాంతంలోకి వచ్చి చైనా సాయుధ సైనికులతో సీలాంగ్_యుడాంగ్‌లలోకి అక్రమంగా ప్రవేశించి షిప్కి కనుమను దాటింది చైనా ప్రభుత్వంకూడా (ఈ సంగతి తర్వాత తెలిసింది) టిబెట్ నుంచి సింకియాంగ్‌కు ఒక రోడ్డును నిర్మించ నారంభించింది. ఈ రోడ్డు ఇండియాకు చెందిన అక్సాచిన్ ప్రాంతంమీదుగా వంద మైళ్ళు వుంటుంది.

1956 నవంబరు చౌ_ఎన్_లై భారత దేశానికి వచ్చాడు చౌ_ఎన్_లై మన ప్రధానితో జరిపిన సంభాషణలలో తాను మెక్‌మహన్ రేఖను చైనా, బర్మా సరిహద్దుగా అంగీకరించినట్లు, అలాగే ఇండియా_చైనా సరిహద్దుకు కూడా ఆ రేఖనే అంగీకరిస్తున్నట్లు చెప్పాడు.

1957 చైనా మన భూభాగంలోకి చొచ్చుకురావడం కొనసాగించింది అక్సాచిన్ మీదుగా రోడ్డు పూర్తయింది

1958 లధక్‌లోని ఖుర్నాక్‌కోటను చైనా ఆక్రమించుకొని అక్సాచిన్‌లోని భారతీయ గస్తీ దళాన్ని బంధించి ఉత్తర ప్రదేశ్‌లోవున్న సంగ్చామల్లా, లప్తాల్‌లలోకి చొచ్చుకు వచ్చింది. బంధించిన గస్తీ దళాన్ని దాదాపు ఐదు వారాలపాటు నానా హింసల పాలు చేసింది భారత గగన పరిధిని చైనా విమానాలు అతిక్రమించాయి.

1958 జూలై ఒక అధికార చైనా పత్రిక నేఫా ప్రాంతంలోని ఐదు డివిజన్లలో నాలుగు డివిజన్లు, ఉత్తర ప్రదేశ్‌లోని కొన్ని ప్రాంతాలు, లధక్‌లోని పెక్కు ప్రాంతాలు చైనాకు చెందినవని సూచించే ఒక మ్యాపును ప్రకటించింది ఈ విషయంపై ఇండియా మళ్ళీ ప్రస్తావించగా ఆ మ్యాపులను 1949కి ముందు ప్రచురించిన మ్యాపుల ఆధారంగా రూపొందించడం జరిగిందని మళ్ళీ పాత పాటే పల్లించింది. తాము సరిహద్దు సర్వేను చేపట్టలేదనీ, అందుకు సంబంధించిన దేశాలతో సంప్రదించలేదనీ ఇండియా_చైనా సరిహద్దు విషయాన్ని బహిరంగ సంప్రదింపులద్వారా నిర్ణయించు కోవాలనుకుంటున్నామని చైనా చెప్పింది

1959 జనవరి 23 సరిహద్దు విషయాన్ని పరస్పర చర్చల ద్వారా నిర్ణయించుకోవాలని చౌ_ఎన్_లై చెప్పాడు.

మార్చి 1959. టిబెటులో తిరుగుబాటు దలైలామా ఆయన పరివారం లాసాను విడిచిపెట్టారు అంతర్జాతీయ న్యాయ సూత్రాల ననుసరించి భారతదేశం వారికి ఆశ్రయ మిచ్చింది

జూలై 1959 చైనీయుల సాయుధ సైనిక దళమొకటి పశ్చిమ పాంగోంగ్ సరస్సు ప్రాంతంలోకి ప్రవేశించింది. స్పాంగుర్ వద్ద ఒక శిబిరాన్ని నెలకొల్పింది

1959 ఆగష్టు చైనీయుల దళాలు ఖింజెమానే లోనికి ప్రవేశించాయి. లాంగ్జూవద్దగల భారత గస్తీ కేంద్రాన్ని వశపర్చుకున్నాయి ఇవి రెండు నేఫాలోనివే

1959 సెప్టెంబరు 8 సరిహద్దుల విషయంలో ఒడంబడిక లేవీ జరుగలేదనీ భారత ప్రాంతంలోని 50,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం తమకు చెందుతుందనీ పేర్కొంటూ చౌ_ఎన్_లై లేఖ వ్రాశాడు.

1959 సెప్టెంబరు 26: భారత ఉత్తర సరిహద్దు విషయంలో చర్చలకు ఆస్కారమే లేదని మన ప్రధాన మంత్రి తమ సమాధానంలో స్పష్టీకరించారు. చరిత, భూగోళం, సంస్కృతీ సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలే ఈ ఎల్లలను ఏర్పరచాయని ఆయన సోదాహరణంగా వివరించారు. కొన్ని ప్రదేశాలలో స్వల్పమైన సరిహద్దు సర్దుబాట్ల విషయంలో చర్చలు జరపడానికి భారత దేశం సిద్ధంగానే వుందని ఆయన తెలియజేశారు. భారత దేశంలోని విశాల భూభాగాలు తమకు చెందుతాయన్న చైనీయుల వాదాన్ని ఆయన త్రోసిపుచ్చారు

1959 అక్టోబరు 20-21 చైనీయుల సైనిక దళాలు భారత భూభాగంలో 50 మైళ్లు లోపలికి ఖోంగ్‌కా కనుమ వద్దకు చొచ్చుకొని వచ్చాయి. వారు భారత గస్తీ పోలీసులపై కాల్పులు జరిపి తొమ్మిది మందిని వధించారు

గస్తీ దళానికి చెందిన మరో పది మందిని నిర్బంధించి తీసుకొనివెళ్ళి, అమానుషంగా చిత్రహింసలు పెట్టి వారిని విడుదల చేశారు

నవంబరు 7, 1959 ప్రధాన మంత్రుల సమావేశం జరగాలనీ, ఈశాన్య ప్రాంతంలో మెక్‌మహన్‌రేఖ నుంచి 20 కిలో మీటర్ల వరకు ఇరు దేశాలు తమ సైన్యాలను ఉపసంహరించుకోవాలని చౌ-ఎన్-లై ప్రతిపాదించారు.

నవంబరు 16, 1959 వివాదాల స్వస్తికి దోహదం చేయగల ఒక ప్రతిపాదన చేస్తూ ప్రధాన మంత్రి ప్రత్యుత్తరమిచ్చారు దీనిప్రకారం లధక్ ప్రాంతంలో పశ్చిమంలో చైనా తన సరిహద్దుగా చెప్పుతున్న రేఖ వరకూ భారత ప్రభుత్వం తన దళాలను ఉపసంహరించుకుంటుంది. అయితే చైనా ప్రభుత్వం భారతీయ పటాలలో చూపబడిన సంప్రదాయసిద్ధమైన సరిహద్దు నుండి తన సైనిక దళాలను ఉపసంహరించాలి. అలా చేసినప్పుడే ఇండియా తన మాట పాటిస్తుంది.

డిసెంబరు 17, 1959 చైనా ఈ ప్రతిపాదనను నిరాకరిస్తూ ఉభయ ప్రధానులు పది రోజులలోగా సమావేశం కావాలని సూచించింది

డిసెంబరు 21, 1959 తన ప్రతిపాదనను చౌ-ఎన్-లై నిరాకరించినందుకు ప్రధాని శ్రీ నెహ్రూ విచారం ప్రకటించారు.

ఫిబ్రవరి 5, 1960 శ్రీ చౌ-ఎన్-లైని శ్రీ నెహ్రూ న్యూఢిల్లీకి ఆహ్వానించారు.

ఏప్రిల్ 1960. ఉభయ దేశాల ప్రధానమంత్రులు న్యూఢిల్లీలో ఆరు రోజుల పాటు సంభాషణలు జరిపిన అనంతరం తమ విభేదాలను పరిష్కరించుకోవడంలో సఫలం కాలేక పోయినట్లు ప్రకటించారు.

ఉభయ ప్రభుత్వాల వాదనలను, నివేదికలను మొదలైన వాటిని బలపరచే పత్రాలన్నింటినీ పరిశీలించడానికి ఆయా ప్రభుత్వాధికార్లు సమావేశం జరపాలనే సూచనను వారు అంగీకరించారు

## సరిహద్దు అతిక్రమణల కొనసాగింపు

1960 జూన్ నుంచి సెప్టెంబరు ఉభయ ప్రభుత్వాల అధికార్లు చర్చలు సాగిస్తున్న సందర్భంలోనూ ఆ తరువాత కూడా చైనీయులు సరిహద్దు అతిక్రమణలను సాగిస్తూనే వచ్చారు.

అక్టోబరు, 1960 చైనీయులు లధక్‌లోని హాట్ స్ప్రింగ్ వరకూ వచ్చారు.

ఫిబ్రవరి 14, 1961 ఉభయ దేశాల అధికార్లు పెకింగ్, ఢిల్లీ, రంగూన్‌లలో జరిపిన సమావేశాల అనంతరం సమర్పించిన నివేదికను పూర్తిగా భారత ప్రభుత్వం ప్రకటించింది (దీనిని 15 నెలల తరువాత చైనావారు ప్రకటించారు) ఇండియా తెలిపిన సరిహద్దే ఈ ఉభయ దేశాల మధ్య సంప్రదాయ సిద్ధమైనట్టిదనీ స్పష్టంగా నిరూపించబడినట్టిదనీ వాస్తవానికి భిన్నంగా చైనీయులు భారత ప్రాంతానికి చెందిన సుమారు 50,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం తమదని అర్థరహితంగా వాదిస్తున్నారనీ అపారమైన సాక్ష్యాల ఆధారంగా ఈ నివేదిక స్పష్టం చేసింది. చైనీయులు చూపిన దాఖలాలు మొదలైనవి లోపభూయిష్టమైనవనీ నిరాధారమైనవనీ అంతే గాక పరస్పర విరుద్ధమైనవనీ, నిజానికి వారి పత్రాలు చాలా వరకు ఇండియా వాదాన్నే బుజువుపరిచేవిగా వున్నాయని కూడా నివేదిక తెలిపింది.

ఆగస్టు 1961. చైనీయులు లధక్‌లో న్యాగ్జూ సమీపంలో మూడు గస్తీ కేంద్రాలను తెరిచారు. ఈ గస్తీ కేంద్రాలను వాటికి వెనుక వున్న సైనిక స్థావరాలతో కలుపుతూ రోడ్లు నిర్మించారు.

ఏప్రిల్ 30, 1962 భారత భూభాగంలోని భారత దళాలు వున్నందుకు చైనీయులు నిరసన తెలిపారు. పశ్చిమ రంగం అంతటిలోనూ ,అంతేగాక సరిహద్దు అంతటా కూడా తాము గస్తీ చర్యలు ప్రారంభించగలమని వారు బెదిరించారు.

మే 1962 కారకోరం కనుమకు పశ్చిమాన భారత-

చైనా సరిహద్దు విషయంలో చైనా పాకిస్తాన్‌లో ఒడంబడిక కుదుర్చుకుంది. ప్రస్తుతం ఈ ప్రాంతం పాకిస్తాన్ ఆక్రమణలో వుంది.

జూలై 1962 చైనీయులు గాల్వాన్ లోయలోని ఒక భారత రక్షణ స్థావరాన్ని చుట్టుముట్టారు

సెప్టెంబరు 8, 1962 పశ్చిమరంగంలో స్పష్టంగా నిరూపించబడిన సరిహద్దును దాటి ఒక చైనా దళంలోనికి ప్రవేశించింది

అక్టోబరు 20, 1962 చైనీయులు నేఫా, లడక్ ప్రాంతాలలో విద్రోహకరంగా భారీ ఎత్తున దాడులు సాగించారు

ఇది సరిహద్దు సంఘటన కాదు, దండెత్తి రావడమే

## మన విజయం తథ్యం

భారతదేశం తన శాంతి కాముక విధానాన్నీ, సామరస్య మార్గాన్నీ అనుసరిస్తున్న తరుణంలో చైనీయులు ఈ విద్రోహకరమైన చర్యకు పూనుకున్నారు నిజానికి ఈ ఆగస్టు నెలలో భారతదేశం, యదాతథ పరిస్థితిని కొనసాగించడానికై మార్గాలను పరిశీలించటానికీ, విభేదాల పరిష్కారానికి అనువైన వాతావరణాన్ని కల్పించడానికీ చర్చలకై ఒక ప్రతినిధిని పంపవలసిందని చైనాను ఆహ్వానించింది. సెప్టెంబరులో ఇండియా తన ఈ ఉద్దేశాన్ని పునరుద్ఘాటించింది. అక్టోబరు 15 వ తేదీన పెకింగ్‌కు తన ప్రతినిధులను పంపదలిచినట్లు ప్రకటించింది

ఉభయ దేశాల ప్రతినిధులు సమావేశం కావడానికి అవకాశం వుండగా దాన్ని వదలి నేఫా, లడక్‌లలో చైనా ఒక పెట్టున భారీ ఎత్తున దాడులు జరపడం చాలా విడ్డూరంగా విచిత్రంగా వుంది

ఈ విధంగా మనం బలవంతంగా పోరాటంలోకి దిగవల్సి వచ్చింది ప్రధాన మంత్రి హెచ్చరించినట్లు ఈ సంఘర్షణ దీర్ఘకాలం సాగవచ్చు దీనిని ఎదుర్కొనడానికి మనం సర్వవిధాలా సంసిద్ధులమై వుండాలి ఎందుకంటే స్వాతంత్ర్యమే మనకు అన్నిటికంటే ప్రధానమైనది. ఎన్నో త్యాగాలు చేసి ఎన్నో శ్రమలకోర్చి 15 సంవత్సరాల క్రితమే మనం దానిని సాధించాము కష్టార్జితమైన మన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోడానికి మనం మరిన్ని త్యాగాలు చేయడానికి సిద్ధపడాలి మన సైనిక శక్తిని పెంపొందించుకోవాలి. అలాగే మన పారిశ్రామిక శక్తిని కూడా అభివృద్ధిపరచుకోవాలి వ్యవసాయ క్షేత్రాలలో, కర్మాగారాలలో ఉత్పత్తులను అధికం చేయాలి జాతీయ రక్షణ వ్యయాన్ని భరించడానికి మనం ఇతోధికంగా పొదుపు చేయాలి.

న్యాయబద్ధమైన మన లక్ష్యం మన సైనిక దళాల అపూర్వ ధైర్య సాహసాలు, మన ప్రజానీకపు సంకల్పబలం మనకు ముమ్మాటికీ విజయాన్ని చేకూరుస్తాయి మన విజయం తథ్యం.

---

# మీ ప్రేమోత్సుకత

దుర్గమమైన హిమాలయ ప్రాంత కదనభూమిలో ఎన్నో కష్ట పరిస్థితులలో దుష్టశత్రువులతో పోరాడుతున్న వీరులైన మన సైనికులు మీరు కానుకలుగా పంపే వెచ్చని బట్టలను ఎంతో గొప్పగా పరిగణిస్తారు.

ఈ క్రింది వస్తువులను పంపండి:

ఉన్ని బట్టలు, లోపల ధరించే బనీన్లు, డ్రాయర్లు, కేప్-కంఫర్టర్లు, స్కార్ఫ్స్, మేజోళ్ళు గ్లోవ్స్, పుల్లోవర్లు దుప్పట్లు, కాటన్ పిల్లో-స్లిప్పులు ($3' \times 1\frac{1}{2}'$) (తెలుపు), నూలు పక్క దుప్పట్లు (తెలుపు) 'పజమా' సూట్లు (తెలుపు).

శస్త్ర చికిత్స కుపయోగించే కాటన్ వూలు, బాండేజీలు (బూడిద, వైమానిక దళనీలం, ఖాకీ బీజ్, లేక ఇతర "న్యూట్రల్" రంగులలో వుంటే మంచిది).

ప్యాకెట్లలో వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలపాలి వాటిని ఈ క్రింది చిరునామాకు రవాణా చార్జీలు చెల్లించి పంపాలి

1 అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్ క్వార్టర్స్, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2 స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్

లేక

3. శ్రీ యం. హెచ్. కె ఘజ్నావీ, గవర్నర్ సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్

# ప్రధాని నెహ్రూ ఉద్ఘాటన

( 4వ పేజీ తరువాయి )

సైనికులను చేర్చుకోవడం, వారిని యుద్ధరంగానికి పంపడం మాత్రమే యుద్ధ సన్నాహం కాదు గాని అది అందులో ఒక ముఖ్య భాగం. సైనికుడు దేశంమీద, దేశప్రజల నైతిక స్థాయి మీద, దేశంలోని ఉత్పత్తుల మీద ఆధారపడి వుంటాడు. ప్రతి సైనికుడిని పోషించడానికి, అతనికి సరఫరాలనందచేయడానికి వందలాది మనుషులు అవసరమవుతారు. ఈ యుద్ధసన్నాహాల దృష్ట్యా అయినా దేశం అంతా వివిధ మార్గాలలో వ్యవసాయంలో, పరిశ్రమలలో ఇంకా ఇతర విధాలలో పరిశ్రమించవలసి వుండడమే గాక మనకవసరమైన భారతదేశాన్ని తీర్చిదిద్దుకోడానికి యుద్ధ సన్నాహాలు చేయాలి. మనం అలా చేయకపోతే యుద్ధ సన్నాహాలు వెనుకబడి తత్ఫలితంగా పూర్తిగా వెనుకబడి వుంటాం,

మనం చైనా జరిపిన దండయాత్ర నెదుర్కొనాలి గనక మన ప్రణాళికను రద్దు చేయాలనే దానికి అర్థం లేదు. అంటే అసలు పరిస్థితిని అర్థం చేసుకోలేదనిపిస్తుంది. యుద్ధ సన్నాహాలకు కూడా ప్రణాళిక అవసరం.

ప్రణాళికయొక్క ముఖ్యాశయం దేశాన్ని పటిష్ఠం చేయడం, ఉత్పత్తిని పెంపొందించడం. మనం అట్టి సమస్య నెదుర్కొనవలసినప్పుడు ఉత్పత్తికన్నా కావల్సిందేమీ లేదు. నేను మిలిటరీ విషయాలను మన నలుగురు నిపుణులకు, సైనికులకు వదులుతున్నాను. ఇటువంటి యుద్ధసన్నాహాల్లో సివిల్ విషయాలు అత్యవసరమైనవి. పౌర విషయాలు, ఉత్పత్తి, శిక్షణ, సాంకేతిక నిపుణులు ముఖ్యం.

మన సన్నాహాలలో ప్రణాళికను ఒక ముఖ్య భాగంగా చూడటం అవసరం. సంకుచిత దృష్టిగల ప్రజలు ప్రణాళిక అవసరం లేదనటం చాలా పొరపాటు. మనం ప్రణాళికను పరిశీలించి ఇప్పటికి అవసరంకాని వాటి విషయాన్ని నెమ్మదిగా చూడాలనడం సమంజసం. అది పరిశీలనార్హమైన విషయం. మనం ఈ సమావేశంలో వాటిలో కొన్నిటిని అంత తేలికగా పరిశీలించలేము. మనం ముఖ్య విషయాలను పరిశీలించవచ్చు.

నేను చెప్పినట్లు వ్యవసాయోత్పత్తులు, పారిశ్రామికోత్పత్తులు పెరగడం అవసరం. పారిశ్రామికోత్పత్తుల విషయంలో అనవసరమైన వస్తువుల ఉత్పత్తి పెరగనవసరం లేదు. అయినా వాటి ఉత్పత్తిని ఆపవచ్చు కాని అవసరమైన వస్తువుల ఉత్పత్తిని మన సన్నాహాలకవసరమైనంత వరకు మాత్రమే పెంపొందించాలి ప్రతి దాన్ని కూడా ఈ దృష్టితోనే చూడాలి

ఇక రక్షణ విషయం తీసుకోండి. మనం సాంకేతిక శిక్షణను పెంపొందించాలి. మొట్టమొదట ఎక్కువ ముఖ్యంగా కనిపించని మామూలు విద్యను తీసుకోండి. మన శిక్షణ విధానంలో మార్పులను ప్రవేశపెట్టడం అవసరం. పెద్ద పెద్ద భవనాలకు, నిర్మాణాలకు మనం ఎక్కువ ఖర్చు చేయకూడదు. మనకు పెద్ద తరగతులుండవచ్చు. ఇష్టమయితే ప్రతి పాఠశాలలలో డబుల్ షిప్టులను ప్రవేశ పెట్టవచ్చు. అంతే గాని మనం విద్యా ప్రవాహాన్ని ఆపలేము, తగ్గించలేము. ఎందుకంటే విద్య నేటి సన్నాహాలకే గాక రేపటి సన్నాహాలకు కూడా ఎంతో అవసరం. "యుద్ధాన్ని జయించండి, ఆ తర్వాత శాంతిని కోర్పొండి" అనడం మన సంకుచిత భావం కాదు. ఇట్టి క్లిష్ట పరిస్థితిలో అది తరచు జరుగుతుంటుంది. కనుక మన యుద్ధాన్ని జయించి, శాంతిని కూడా పొందడాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఇక విద్యుచ్ఛక్తి విషయం. ప్రతిఒక్కరికి శక్తి-విద్యుచ్ఛక్తిగాని, ధర్మల్‌శక్తి గాని మరేదైనా శక్తి గాని, దాని యొక్క-ప్రాముఖ్యత తెలుసు. ఎందుకంటే ఆ శక్తి పైనే పరిశ్రమల అభివృద్ధి ఆధారపడి వుంది. దాని మీదే వ్యవసాయాభివృద్ధి ఆధారపడి వుంది. వ్యవసాయాన్ని పరిశ్రమలను ఆధునికంగా రూపొందించడానికి కూడా విద్యుచ్ఛక్తి అవసరం. మనం ఆ శక్తిని తగ్గించలేము. నిజానికి దాన్ని మనం పెంపొందించాలి. ఈ సందర్భంలో తారాపూర్‌లో ఒక అణుశక్తి కర్మాగారాన్ని నెలకొల్పడానికంగీకరించాము. ఆ తర్వాత రాజస్థాన్‌లో ఒకటి, దక్షిణ భారతంలో మరొకదాన్ని నెలకొల్పే ఉద్దేశం కూడా వుంది. ఈ క్లిష్ట పరిస్థితిలో ఏవో కారణాలతో ఆ కార్యక్రమాన్ని ఆపడం తగదు. మన శక్తి పెంపొందడానికి, మన పరిశ్రమలు పెరగడానికి విద్యుచ్ఛక్తి అవసరం. అణుశక్తి కూడా బాగా అవసరమవుతుంది. కనుక విద్యుచ్ఛక్తి విషయంలో మనం ఏ సడలింపూ చేయలేము. మనం చేయవలసిన పనులను సడలించ

కూడదు. మనది నిర్ణయించిన ఒక ప్రణాళిక. మనం ఇంకా ఎంతో చేయాలనుకుంటున్నాం. మనం దీని ఏవిధంగా చేయాలి అనుకోకుండా మన కార్యసాధనలో యుద్ధ సన్నాహాలు. ప్రణాళికా సన్నాహాలే గాక ఎన్నో అవాంతరాలొచ్చి ఏడుతుంటాయి. ఇది యుద్ధ సన్నాహాల్లో ఒక భాగం మాత్రమే

ప్రణాళికలోనే గాక, ఇతరత్రా కూడా అనవసరమైన వాటిని మనం నిర్జించాలి. మనం ప్రతిదాన్ని ఆర్థిక దృక్పథంతో చూసి, మనం ఏం చేసినా వాటి భారాన్ని, ఫలితాలను భరించాలి. ప్రత్యక్షంగా యుద్ధానికికావలసిన ఆయుధాలు మొదలైనవాటి ఉత్పత్తినే గాక మన సైనికులకు కావలసిన ఇతర అవసర ఉత్పత్తులను కూడా యుద్ధకాలంలో పెంపొందించాలి.

అంటే కొనుగోలు శక్తి ప్రజల మీద పడుతుందన్నమాట. ధరలు మొదలైన వాటిపై ప్రభావాన్ని మనం పరిశీలించాలి. ప్రస్తుతం వీలైనంత వరకు ధరల పెరుగుదల నరికట్టడం ఎంతో అవసరం. మనలను బాధపెడుతున్న దరల విషయాన్ని మనం పరిశీలించాం. స్థూలంగా పరిశీలించి చూస్తే ధరలు అంతగా పెరగలేదు అది ఎంతో ముఖ్యమైన విషయం. ఎందుకంటే ధరల పెరుగుదల ప్రభావం ప్రజల మీదనే గాక, వారి ఆర్థిక స్థితి మీద కూడా పడుతుంది. పెక్కు వస్తువులను కొంత వరకు నిషేధించాలి మరి కొన్ని వస్తువుల ఉత్పత్తి విషయంలో దృష్టిని కేంద్రీకరించాలి. కొన్ని వస్తువుల యొక్క కొనుగోలు శక్తి పెరుగుతున్నందున వాటి కెక్కువ డిమాండు ఏర్పడుతుంది. ఈ విషయాలన్నిటినీ మనం, పౌరుల సరఫరాల సంస్థలు మొదలైనవి ఆలోచించాలి. అందువల్ల ఆ వస్తువులు ప్రజలకు కావలసినంతగా లభ్యం కావనే సమస్య వుండదు,

సహకారోద్యమం విషయానికి మనం ప్రాముఖ్యత నిస్తున్నాం. అది గత ఐదేళ్ళలో ఎంతో అభివృద్ధిచెందినట్లు నేను భావిస్తున్నాను. ఆ ఉద్యమం ఎంత అభివృద్ధిచెందిందో వాటి అంకెల వివరాలను ఈ క్షణాన నేను చెప్పలేను. ఈ విషయం నాకన్నా ఎక్కువగా మీకే తెలుసు నాణ్యత విషయంలో కూడా అది ఎంతో అభివృద్ధి చెందిందని నేను భావిస్తున్నాను. ఏమైనప్పటికీ ఈ ఉద్యమాన్ని ప్రస్తుత అత్యయిక పరిస్థితి దృష్ట్యా పరిశీలించేట్లయితే, ఇది చాలా ముఖ్యమైనది. కనుక మనం దీన్ని మరీ తీవ్రతరం చేయాలి. ధరల స్థిరీకరణ, సహకార స్టోర్సులు, సహకార ఉద్యమం మొత్తం మీద చాలా ముఖ్యమైనవి.

ఇప్పుడే నాకు తట్టిన ఒక విషయాన్ని మీ దృష్టికి తేదల్చాను. నా సహచరులతో కూడా సంప్రదింపదలచాను. వ్యవసాయంలో స్వల్పకాలిక పంటల్ని పండించడాన్ని వెంటనే ప్రోత్సహించవచ్చు. పంటలే కావచ్చు, కూరగాయలే కావచ్చు, కోడిగ్రుడ్లే కావచ్చు, వీటిని సత్వరంగా అధికంగా ఉత్పత్తి చేయాలి. మన సైనికులకూ, ఇతరులకూ ఇవి చాలా అవసరం.

వచ్చే మూడు మాసాల్ని మనం ఇందుకొరకు ఉపయోగించవచ్చు. వ్యవసాయమంత్రిత్వ శాఖ ఈ విషయాన్ని పరిశీలించాల్సి వుంటుంది. ముఖ్యంగా ఉత్తర హిందూ దేశంలో వీటి అధికోత్పత్తికై శ్రద్ధ వహించాలి.

ఇలాంటి పదార్థాల ఉత్పత్తిని ప్రోత్సహించడం ఒకందుకు మంచిదే. ఇందుకొరకై కొన్ని సందర్భాల్లో కొంత సబ్సిడీ కూడా ఇవ్వాల్సి వుంటుందేమో. దీనివల్ల కలిగే ఫలితం చాలా లాభదాయకంగా వుంటుంది. రైతులకూ, దేశానికీ గూడా మంచిదే.

కొన్ని జాతీయ సంఘాలు ఏర్పడుతున్న విషయం మీరు వినే వుంటారు, జాతీయ రక్షణనిధిని ఏర్పాటు చేశారు. ఇందుకై మీ సహకారం కూడా లభిస్తున్నది. రాష్ట్రాలనుంచి మీ ప్రతినిధులు కొంతమంది రక్షణ నిధి సంఘంలో వుండాలని మా ఆకాంక్ష. మీరు కోరినట్లయితే రాష్ట్రాల ముఖ్యమంత్రులందరూ ఇందులో సభ్యులుగా వుండవచ్చు. సభ్యుల సంఖ్య మరీ పెద్దగా వుంటుందని మీకు భావించేట్లయితే, ఈ సంఘంలో ఎంతమంది సభ్యులుగా వుండాల్సిందీ మీరే ఎన్నుకోవచ్చు

రాష్ట్రాలలో వచ్చే విరాళాలను స్టేటు బ్యాంకు స్వీకరిస్తున్నది. రిజర్వు బ్యాంకు గూడా స్వీకరిస్తుంది. ఈ విషయం మీకు విదితమే.

ఈ విషయమై మీకు వివరంగా తరువాత తెలుస్తుంది జాతీయ నిధిలో ఒక భాగంగా రాష్ట్ర నిధిని ఆరంభించాలని ఒక సూచన చేయబడింది ఈ విషయాన్ని పరిశీలించాలి అయితే ఇది అఖండమైన పెద్ద జాతీయ రక్షణ నిధిగా వుండాలి దీన్ని విడివిడి భాగాలుగా మాత్రం విభజించగూడదు

కొన్ని రోజుల క్రిందట, అంటే అక్టోబరు 20 వ తేదీన అత్యయిక పరిస్థితి ఏర్పడినపుడు, మంత్రివర్గంలో రక్షణ కమిటీ ఏర్పడిన విషయం మీకు తెలిసి వుండవచ్చు. పనిని చురుకుగా కొనసాగించడానికి కేంద్రప్రభుత్వంలో అనేక సర్దుబాట్లు చేయడం జరిగింది. మొత్తంమీద చూస్తే, పనులు త్వరగా నడిచే

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

23 అక్టోబరు:_ మలయా ప్రధానమంత్రి శ్రీ తుంకూ అబ్దుల్ రహమాన్, అధికార పర్యటనపై హైదరాబాదుకు వచ్చారు.

31 అక్టోబరు:_ నాగార్జునసాగర్ కంట్రోల్‌బోర్డు సమావేశం హైదరాబాదులో జరిగింది. ముఖ్యమంత్రి సమావేశానికి అధ్యక్షత వహించారు.

2 నవంబరు:_రాష్ట్రస్థాయిలో 63 మంది సభ్యులుగల ప్రజారక్షణ కమిటీని ప్రభుత్వం యేర్పాటు చేసింది.

8 నవం:_ప్రజారక్షణ కమిటీ ప్రథమ సమావేశం హైదరాబాదులో జరిగింది.

7 నవం:_కాజీపేటలోని ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాల భవనానికి కేంద్ర శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాలమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

12 నవం:_తుంగభద్రా ఎగువకాలువ పథకానికై కేంద్రప్రభుత్వం వర్తమాన సంవత్సరానికి అదనంగా రు. 100 లక్షలు కేటాయించింది.

13 నవం:_న్యాయ, సమాచార శాఖలమంత్రి, హైదరాబాదులో రెండవ గైడ్స్ శిక్షణ కోర్సుకు ప్రారంభోత్సవం చేశారు.

14 నవం:_న్యాయ, సమాచార శాఖలమంత్రి ఏలూరులో బాలల జూనియర్ స్టెనోగ్రాఫర్... 

## భారతదేశంలో

22 అక్టో:_ సరిహద్దులలో చైనీయులు పెద్దపెట్టున దాడిచేసిన సందర్భంగా ప్రధానమంత్రి రేడియోద్వారా ప్రసంగిస్తూ శత్రువులను తరిమికొట్టడానికి "నడుములు బిగించాల్సింది"గా జాతికి విజ్ఞప్తి చేశారు.

26 అక్టో:_దేశంలో అత్యయికపరిస్థితి యేర్పడినట్లు భారత అధ్యక్షులు ప్రకటించారు.

31 అక్టో:_శ్రీ వి. కె. కృష్ణమీనన్‌నుండి రక్షణశాఖను ప్రధానమంత్రి స్వీకరించారు.

4 నవం:_$6\frac{1}{2}$ శాతం బంగారం బాండ్లను భారతప్రభుత్వం జారీ చేసింది.

4 నవం:_రెండురోజులపాటు జరిగే జాతీయాభివృద్ధి మండలి సమావేశం న్యూఢిల్లీలో ప్రారంభమయింది.

5 నవం:_హోంమంత్రి, న్యూఢిల్లీలో పత్రికా సలహా సంఘానికి ప్రారంభోత్సవం చేశారు.

6 నవం:_న్యూఢిల్లీలో 31 మంది సభ్యులుగల జాతీయ రక్షణ మండలిని యేర్పాటు చేశారు.

7 నవం:_కేంద్రమంత్రి పదవికి శ్రీ మీనన్ ఇచ్చిన రాజీనామాను ప్రధానమంత్రి ఆమోదించారు.

9 నవం:_విద్యావేత్త డాక్టర్ డి కె. కార్వే పూనాలో మరణించారు.

11 నవం:_మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వై. బి చవాన్‌ను కేంద్ర రక్షణ మంత్రిగా నియమించారు.

12 నవం:_లధక్, నేఫాలలోని వీరోచితంగా పోరాడిన సైనికులకు కేంద్ర ప్రభుత్వం అవార్డులను ప్రకటించింది.

14 నవం:_శత్రువును పారద్రోలడానికి నిశ్చయించిన జాతినిర్ణయాన్ని అధికారిక తీర్మానంద్వారా లోక్‌సభ ఆమోదించింది.

దానికి ఈ చర్యలు దోహదమిచ్చాయి. ప్రభుత్వంలో సాధారణంగా వుండే మందకొడితనం చాలావరకు మాయమైంది. క్రమేణా పనులు చురుకుగా కొనసాగుతాయి.

త్వరలోనే జాతీయ రక్షణ సంఘాన్ని ఏర్పాటు చేయాలని ఒక ప్రతిపాదన వుంది జాతీయరక్షణ సంఘంలో (వ్యక్తుల పేర్లు వగైరా ఇంకా సిద్ధం కాలేదు) మంత్రివర్గ రక్షణ సంఘ సభ్యులు, ప్రస్తుత సైన్యాధిపతులు, రిటైరైన జనరల్స్ కొంత మంది, రక్షణశాఖలో పదవి విరమణ చేసిన సీనియర్ ఉద్యోగులు కొంత మంది, ప్రముఖ పౌరులు సభ్యులుగా వుంటారు ఈ సంఘంలో సభ్యత్వం చాలా పెద్దదిగా వుండకూడదని మా అభిలాష. అయితే, ఇందులో ప్రాతినిధ్యం సక్రమంగా వుండాలని కూడా మా కోరిక. రాష్ట్రాల ప్రతినిధులు ఇందులో పాల్గొనే విషయమై మీతో సంప్రదించాలనుకొంటున్నాను ప్రతి రాష్ట్ర ముఖ్యమంత్రి ఇందులో సభ్యుడుగా వుండడం సహాయకారిగా వుండకపోవచ్చు. కొంతమంది ముఖ్యమంత్రులు ఇందులో వుండవచ్చు. అందరూ వుండవచ్చు. వారి సలహాలు తీసు కొంటాం

ఇంతేగాక, వివిధ స్థలాల్లో అంటే ముఖ్యంగా బొంబాయి మున్నగు మహానగరాలలో పౌర సంఘాలు ఏర్పడిన విషయం మీకు తెలుసు. ఇలా ఏర్పడటం మంచిదే. అయితే వాటిల్లో ఏదో ఒక విధంగా సమన్వయం వుండడం వాంఛనీయం.

ఇంకా కొన్ని ప్రత్యేక సంఘాలు వుంటాయి అయితే వాటి కార్యకలాపాలను సమన్వయపరచడానికి కేంద్ర సంఘం అంటూ ఒకటి వుంటే మరీ మంచిది. పౌర సంఘాలంటే నూటికి నూరు పాళ్ళు అనధికార సంఘాలుగా వుండాలి. మన రాష్ట్రపతి పోషకులుగా వుండడానికి అంగీకరించారు. అయితే అధికార హోదాలో మాత్రం కాదు. వారికి మేము సలహానిస్తాం. అయితే అవి అనధికార సంఘాలుగానే ఉండాలి ఇందులో రాష్ట్రాలు ఏ విధంగా ప్రాతినిధ్యం వహించాలనే సమస్య యెదురవుతున్నది. ఆ తర్వాత ఆర్థిక మంత్రి, మేమందరమూ విరాళాలకై విజ్ఞప్తి చేసిన విషయం మీకు తెలిసిందే విరాళాలు ప్రతిరోజు వస్తూనే ఉన్నాయి. ప్రజలు తాము కూడబెట్టుకున్న మొత్తాలనన్నింటినీ విరాళంగా యిస్తున్నారు బీదలు, బాలలు ప్రతిరోజూ నా ఇంటికి వస్తున్నారు. ఉదయం కొంత సమయాన్ని నేను వారితో గడుపుతున్నాను పెక్కుమంది నా ఇంటికి వస్తున్న కారణంగా స్టేట్ బ్యాంకు బ్రాంచిని ఏర్పాటు చేయడం జరిగింది ప్రెసిడెంటు గృహం వద్ద కూడా ఈ విధంగానే జరుగుతున్నది. పిన్నలు, పెద్దలు, పెన్షన్ తీసుకున్నవారు అన్ని తరహాల ప్రజలు వచ్చి తాము పొదుపు చేసిన మొత్తాలను సమర్పించడంచూచి నేను ముగ్ధుడనయినాను ఇది సంతోషకరమైన దృశ్యం ఇప్పుడు దీనిని సరిఅయిన మార్గానికి మళ్ళించాల్సి ఉంది. గత రాత్రి ఆర్థికమంత్రి రేడియోలో ప్రసంగిస్తూ త్వరలో జారీచేయబడనున్న బంగారం బాండ్లను గురించి ప్రస్తావించారు. బహుశా ఆయన కొన్ని వివరాలను మీకు తెల్పవచ్చు. ప్రజలలో ధైర్య స్థైర్యాలను పెంపొందించడం, ధరలు పెరగకుండా జాగ్రత్త వహించడం, అసత్య ప్రచారాలను, పుకార్లను అరికట్టడం వంటి విషయాలను పౌర సంఘం నిర్వహిస్తుంది క్లిష్ట సమయాలలో జరిగే ప్రమాదకర విషయాలలో అపోహ, తప్పుడు వార్తలు ప్రధానమైనవి. ముఖ్యంగా మన భారతదేశంలో మనం యితర ప్రజలకన్నా యెక్కువ చేస్తామేమో నాకు తెలియదు. కాని మనం పుకార్లను వింటాం, వాటిని విస్తరింపజేస్తాం అయితే ఇటువంటి సమయాలలో ప్రతి ఒక్కరూ, మొత్తం ప్రపంచం కూడా ఇల్లాగేచేస్తుంది.

ఆ తర్వాత దురదృష్టవశాత్తు ఢిల్లీలో కొన్ని సంఘటనలు జరిగాయి. ప్రజలు ఆవేశంతో కొన్ని దౌత్య కార్యాలయాల ఎదుట, కొన్ని కార్యాలయాల ముందు ప్రదర్శనలు చేయడం, ఉద్రేకంలో కొన్ని నష్టాలు కలిగింప జేయడం వంటి సంఘటనలు జరిగాయి. ఇటువంటివి పాఠశాలల విద్యార్థులకు వదలడం అది పదుద్దేశంతోనే అయినా చాలా తీవ్రమైన విషయం. అది వారికి హాస్యంగానే కనిపించవచ్చు కాని వాటి పరిణామాలు వేరుగా ఉంటాయి. ఇంతకుముందు ఇటువంటి విషయాలు జరిగినా ఇకముందుమాత్రం అటువంటివి జరగకుండా జాగత్తపడాలి వాటిని మనం విడనాడాలి. ఈ విషయాలన్ని పౌర సంఘం చూస్తుండాలి దేశంలో శాంతి భద్రతలు, సౌహార్ద్ర వాతావరణం ఏర్పడేటట్లుగా ఈ సంఘం సహాయపడాలి. మన శక్తిని ఇతర విషయాలకు వినియోగిస్తూ వుంటే ప్రధానమైన సమస్యలను ఎదుర్కొలేకుండాపోయే ప్రమాదం కూడా ఉంది. పొదుపు ఉద్యమం మరి యితర పనుల నెన్నింటినో పౌర సంఘం నిర్వహించవచ్చు



# యుద్ధ విరమణ పన్నాగం

(8వ పేజీ తరువాయి)

దేశం తన భూభాగంలోనే చైనీయులు తిరిగి దాడులు ప్రారంభించ గలరనే బెదిరింపుకులోనై సైన్యాలను 20 కిలోమీటర్లు లోపలికి ఉపసంహరించుకోవాలని కూడా ఇవి కోరుతున్నాయి చైనీయులు పేర్కొన్న "1959 నవంబరు 7వ తేదీనాటికి వాస్తవంగా అధీనం వున్న ప్రాంతాల హద్దు" అంటే ఇప్పుడు వారు పశ్చిమ రంగంలో అనగా లడక్‌లో వారు ఆక్రమించుకున్న ప్రాంతాల హద్దు అని అర్థం. తమ దళాలను ఉపసంహరించుకున్న తరువాత తూర్పు రంగంలో ఖింజెమానే, లాంగ్జూలతో సహా మక్‌మహన్ రేఖ పొడవునా, మధ్యరంగంలో బారాహోతితో సహా భారత-చైనా సరిహద్దు పొడవునా, పశ్చిమ రంగంలో ప్రస్తుతం తమ దురాక్రమణలో వున్న హద్దు పొడవునా చైనా సివిల్ పోలీసు గస్తీ కేంద్రాలను నెలకొల్పుతుందని వారి వివరణ తెలియజేసింది. అంటే పెకింగ్ కొత్తగా తెలిపిన వివరణను బట్టి కూడా చైనా పేర్కొన్న "1959 నవంబరు 7వ తేదీనాటికి ఆక్రమణలో వున్న ప్రాంతాల హద్దూ", వారు ఇటీవల జరిపిన దాడుల తరువాత లడక్‌లో ప్రస్తుతం వారి అధీనంలో వున్న ప్రాంతం హద్దూ ఒకటేనన్నమాట.

ప్రస్తుతం తమ క్రిందవున్న ప్రాంతాన్ని 1958 లో లేని సరిహద్దు రేఖగా మార్చడానికి చైనా ప్రయత్నిస్తున్నది. శాంతి ప్రతిపాదన ముసుగుక్రింద దురాక్రమణ ద్వారా ఆక్రమించుకున్న విశాల భారత భూభాగాన్ని తమదిగా స్వాధీనం చేసుకొని తమ ఆధిపత్యాన్ని ధ్రువీకరించడానికి చైనా వేసిన ఎత్తు మాత్రమే ఇది.

చైనా ప్రధాని చౌ-ఎన్-లై ఆఫ్రికా-ఆసియా ప్రభుత్వాలకు ఒక విజ్ఞప్తిని చేశారు అందులో ఆయన ఇలా అన్నారు — "సరిహద్దు సమస్యను పరిశీలించేటప్పుడు ఈ సమస్య ఆఫ్రికా-ఆసియా దేశాలకూ, సామ్రాజ్యవాద దేశాలకూ మధ్య ఈ సమస్య ఏర్పడినట్లు మనం గమనించాలి మనం ప్రమత్తులమై వుండాలి. లేకపోతే సామ్రాజ్యవాద రాజ్యాలు మనలో కలహాలు రేకెత్తించే కుట్రకు లోనుకావాల్సి వుంటుంది." దీనినే మామూలు భాషలో చెప్పాలంటే చైనా సామ్రాజ్య విస్తరణ కాంక్షకు గురియైన ఏ దేశానికైనా ప్రపంచంలో ఆఫ్రికా-ఆసియాలకు చెందని రాజ్యాలు సానుభూతి, సహకారాలందజేయకుండా చేయడానికై ఆఫ్రికా-ఆసియా ఐక్యత పేరిట ఆఫ్రికా-ఆసియా రాజ్యాలు చైనాతో సహకరించాలని అర్థం అన్నమాట.

అయినా అప్పటికీ కూడా చైనా సామ్రాజ్య విస్తరణ కాంక్షకు గురియైన దేశానికి ఆఫ్రికా-ఆసియా రాజ్యాలు సానుభూతి తెలిపి, నైతిక సహకారమిచ్చే అవకాశం వుంది. ఈ అవకాశం లేకుండా చేయడానికి టాంగన్యీకా ప్రధాన మంత్రికి 1962 నవంబరు 13 వ తేదీన చౌ-ఎన్-లై ఒక లేఖ వ్రాశారు ఇండియా చైనా సరిహద్దు వివాదాన్ని ఇండియా చైనాల మధ్య ప్రత్యక్ష సంప్రదింపుల ద్వారా మాత్రమే పరిష్కరించుకోవాలని ఆయన అన్నారు ఇరుపక్షాలకు స్నేహాస్పదమైన మూడవ పక్షం ఇండియా చైనాల మధ్య ప్రత్యక్ష సంప్రదింపులను ప్రోత్సహించాలి గాని ఈ ఇరుపక్షాల మధ్య చర్చలలో ప్రత్యక్షంగా పాల్గొన గూడదనే తన ఉద్దేశంతో ప్రధాన మంత్రి కవావా ఏకీభవించ గలరని చౌ-ఎన్-లై ఆశించారు అంటే చైనా దురాక్రమణకు గురియైన ఇండియా చైనాతో పరస్పర సంప్రదింపుల కంగీకరించేట్లు ఆఫ్రికా-ఆసియా దేశాలు ఇండియాను ఒత్తిడి చేయాలన్నమాట. దీన్నే మరొకవిధంగా చెప్పాలంటే ఒకవైపు ఆఫ్రికా-ఆసియేతర రాజ్యాలవర్గం నుంచీ, మరొకవైపు ఆఫ్రికా-ఆసియా రాజ్యాల నుంచీ కూడా భారతదేశాన్ని ఏకాకిని చేసి తన పనిని తాను నెరవేర్చుకోవడమే చైనా సామ్రాజ్య విస్తరణ విధానం. ఇదంతా

18 నవం _రు. 155 మిలియనుల ఆర్థిక కార్పోరేషనుకు సంబంధించిన ఒప్పందంపై వార్సాలో భారత-పోలెండు దేశాలు సంతకం చేశాయి.

19 నవం: నేఫాలోని కామెంగ్ సరిహద్దు డివిజన్ హెడ్‌క్వార్టరయిన బోండిలా శత్రువుల వశమయింది

20 నవం:_జనరల్ జె. యన్. చౌదరి, సర్వసైన్యాధిపతి పదవిని స్వీకరించారు.

విదేశాల్లో

30 అక్టో:_యు కె. పార్లమెంటులో బ్రిటిష్‌రాణి ప్రసంగిస్తూ భారతదేశం తమసరిహద్దులను రక్షించుకోడానికి చేసిన నిర్ణయాన్ని సమర్థించింది

6 నవం._ఈక్వెడార్ రాష్ట్రంలోని తూర్పు ప్రాంతంలో అత్యయిక పరిస్థితి యేర్పడినట్టు కాంగో ప్రెసిడెంటు కసావుబు ప్రకటించారు.

8 నవం _శ్రీమతి యెలినార్ రూజ్‌వెల్టు న్యూయార్కులో మరణించారు.

11 నవం _కాంగోనుండి విడివడి ఉండే తత్వాన్ని కటాంగా విడనాడాలనీ, లేకుంటే ప్రపంచసంస్థ గైకొనే చర్యలకు లోనుకావలసివస్తుందని యు. యన్. తెల్పింది.

18 నవం:_ప్రపంచ విఖ్యాత అణు శాస్త్రజ్ఞుడు శ్రీ నీల్స్ బోహర్, కోపెన్ హగెన్‌లో మరణించారు

19 నవం _పశ్చిమ జర్మనీ మిశ్రమ మంత్రివర్గంలోని స్వతంత్ర డెమాక్రాటిక్ పార్టీకి చెందిన ఐదుగురు మంత్రులు రాజీనామా యిచ్చారు

# యుద్ధ విరమణ పన్నాగం

(8వ పేజీ తరువాయి)

దేశం తన భూభాగంలోనే చైనీయులు తిరిగి దాడులు ప్రారంభించ గలరనే బెదిరింపుకులోనై సైన్యాలను 20 కిలోమీటర్లు లోపలికి ఉపసంహరించుకోవాలని కూడా ఇవి కోరుతున్నాయి. చైనీయులు పేర్కొన్న "1959 నవంబరు 7వ తేదీనాటికి వాస్తవంగా అధీనం వున్న ప్రాంతాల హద్దు" అంటే ఇప్పుడు వారు పశ్చిమ రంగంలో అనగా లడక్‌లో వారు ఆక్రమించుకున్న ప్రాంతాల హద్దు అని అర్థం తమ దళాలను ఉపసంహరించుకున్న తరువాత తూర్పు రంగంలో థింజెమానే, లాంగ్జూలతో సహా మక్‌మహన్ రేఖ పొడవునా, మధ్యరంగంలో బారాహోతితో సహా భారత–చైనా సరిహద్దు పొడవునా, పశ్చిమ రంగంలో ప్రస్తుతం తమ దురాక్రమణలో వున్న హద్దు పొడవునా చైనా సివిల్ పోలీసు గస్తీ కేంద్రాలను నెలకొల్పుతుందని వారి వివరణ తెలయజేసింది. అంటే పెకింగ్ కొత్తగా తెలిపిన వివరణను బట్టి కూడా చైనా పేర్కొన్న "1959 నవంబరు 7వ తేదీనాటికి ఆక్రమణలో వున్న ప్రాంతాల హద్దూ", వారు ఇటీవల జరిపిన దాడుల తరువాత లడక్‌లో ప్రస్తుతం వారి అధీనంలో వున్న ప్రాంతం హద్దూ ఒకటేనన్నమాట.

ప్రస్తుతం తమ క్రిందవున్న ప్రాంతాన్ని 1958 లో లేని సరిహద్దు రేఖగా మార్చడానికి చైనా ప్రయత్నిస్తున్నది. శాంతి ప్రతిపాదన ముసుగుక్రింద దురాక్రమణ ద్వారా ఆక్రమించుకున్న విశాల భారత భూభాగాన్ని తమదిగా స్వాధీనం చేసుకొని తమ ఆధిపత్యాన్ని ధ్రువీకరించడానికి చైనా వేసిన ఎత్తు మాత్రమే ఇది.

చైనా ప్రధాని చౌ-ఎన్-లై ఆఫ్రికా–ఆసియా ప్రభుత్వాలకు ఒక విజ్ఞప్తిని చేశారు అందులో ఆయన ఇలా అన్నారు.— "సరిహద్దు సమస్యను పరిశీలించేటప్పుడు ఈ సమస్య ఆఫ్రికా–ఆసియా దేశాలకూ, సామ్రాజ్యవాద దేశాలకూ మధ్య ఈ సమస్య ఏర్పడినట్లు మనం గమనించాలి మనం ప్రమత్తులమై వుండాలి. లేకపోతే సామ్రాజ్యవాద రాజ్యాలు మనలో కలహాలు రేకెత్తించే కుట్రకు లోనుకావాల్సి వుంటుంది." దీనినే మామూలు భాషలో చెప్పాలంటే చైనా సామ్రాజ్య విస్తరణ కాంక్షకు గురియైన ఏ దేశానికైనా ప్రపంచంలో ఆఫ్రికా–ఆసియాలకు చెందని రాజ్యాలు సానుభూతి, సహకారాలందజేయకుండా చేయడానికై ఆఫ్రికా–ఆసియా ఐక్యత పేరిట ఆఫ్రికా–ఆసియా రాజ్యాలు చైనాతో సహకరించాలని అర్థం అన్నమాట.

అయినా అప్పటికీ కూడా చైనా సామ్రాజ్య విస్తరణ కాంక్షకు గురియైన దేశానికి ఆఫ్రికా–ఆసియా రాజ్యాలు సానుభూతి తెలిపి, నైతిక సహకారమిచ్చే అవకాశం వుంది. ఈ అవకాశం లేకుండా చేయడానికి టాంగన్యీకా ప్రధాన మంత్రికి 1962 నవంబరు 13 వ తేదీన చౌ–ఎన్–లై ఒక లేఖ వ్రాశారు ఇండియా చైనా సరిహద్దు వివాదాన్ని ఇండియా చైనాల మధ్య ప్రత్యక్ష సంప్రదింపుల ద్వారా మాత్రమే పరిష్కరించుకోవాలని ఆయన అన్నారు. ఇరుపక్షాలకు స్నేహాస్పదమైన మూడవ పక్షం ఇండియా చైనాల మధ్య ప్రత్యక్ష సంప్రదింపులను ప్రోత్సహించాలి గాని ఈ ఇరుపక్షాల మధ్య చర్చలలో ప్రత్యక్షంగా పాల్గొన గూడదనే తన ఉద్దేశంతో ప్రధాన మంత్రి కవావా ఏకీభవించ గలరని చౌ–ఎన్–లై ఆశించారు. అంటే చైనా దురాక్రమణకు గురియైన ఇండియా చైనాతో పరస్పర సంప్రదింపుల కంగీకరించేట్లు ఆఫ్రికా–ఆసియా దేశాలు ఇండియాను ఒత్తిడి చేయాలన్నమాట. దీన్నే మరొకవిధంగా చెప్పాలంటే ఒకవైపు ఆఫ్రికా–ఆసియేతర రాజ్యాలవర్గం నుంచీ, మరొకవైపు ఆఫ్రికా–ఆసియా రాజ్యాల నుంచీ కూడా భారతదేశాన్ని ఏకాకిని చేసి తన పనిని తాను నెరవేర్చుకోవడమే చైనా సామ్రాజ్య విస్తరణ విధానం ఇదంతా

కూడా ఆఫ్రికా—ఆసియా దేశాల ఐకమత్యల పేరిట జరుగుతున్న దన్నమాట.

తన అసంబద్ధపు శాంతి ప్రవచనాలను గురించి ఇంత ప్రచారం చేసిన తర్వాత కూడా, భారతదేశంపై చైనా ఇంకా దురాక్రమణ జరపడం ఇక్కడ గమనించదగ్గవిషయం: అంతేగాక తాను యుద్ధవిరమణ చేసిన తర్వాత కూడా భారత సైనిక దళాలు ఇంకా ముందుకు తోసుకువస్తున్నాయని ఆరోపించ డానికి కూడా చైనా బహుశా సిద్ధం కావచ్చు. ఈ విషయంలో చైనా ఉద్దేశాలు ఇవి అని ఎవరూ కూడా తెలుసుకోవడం కష్టం. "భారత దేశంతో సరిహద్దు యుదానికి కాలుదువ్విన చైనా చర్యను బట్టి చూస్తే సరిహద్దులవరకే గాక అంతకుమించిన ప్రాంతాన్ని కూడా ఆక్రమించుకోడానికి చైనా ఉద్దేశిస్తున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది" అనే భావాన్ని అమెరికా విదేశాంగ శాఖ కార్యదర్శి శ్రీ డీన్‌రస్క్ వెలిబుచ్చారు ఏది ఏమైనా ముందు జరగబోయే దాన్ని వేచి చూడాలి చైనా ఇంకా ఎంతకి పాల్పడినా కూడా ఇక ఏ మాత్రం వెనుకంజ వేయకుండా వుండడానికి భారత దేశం కృతనిశ్చయమైంది. ముందు ఏం జరిగినప్పటికీ కూడా అన్నిటినీ శాయశక్తులా ఎదుర్కొనడానికే భారత దేశం సర్వసిద్ధమవు తున్నది.



# రచయితలు

శ్రీ యస్. రాజన్న-కవిసుధాకర, ప్రొద్దుటూరు, కడపజిల్లా

"చదువుల" హైద్రాబాద్.

విద్యారత్న శ్రీ ఈయుణ్ణి వెంకట వీర రాఘవాచార్యులు, యం. ఎ, ఎ. ఐ. యస్. (రిజిస్ట్రర్డ్) ఎడిటర్: సంస్కృత ఎకాడమీఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాద్.

శ్రీ జొన్నలగడ్డ వీరవెంకటేశ్వరరావు-బందరు, కృష్ణాజిల్లా

శ్రీ దుర్గానంద్. హిందీప్రచారసభ, హైద్రాబాద్.

శ్రీ జి బాలకృష్ణమూర్తి, డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్ కూచిపూడి, రేపల్లెతాలూకా, గుంటూరుజిల్లా

శ్రీ రావూరి భరద్వాజ ఆలిండియా రేడియో, హైద్రాబాద్

శ్రీ వింజమూరి శివరామారావు, స్క్రిప్ట్‌రైటర్, ఆకాశవాణి, విజయవాడ

శ్రీ యం ఆర్. అప్పారావు, ఎం ఏ ఆబ్కారీ మద్యనిషేధ శాఖలమంత్రి, హైద్రాబాద్

శ్రీ మానాప్రగడ శేషశాయి, ప్రభుత్వ కళాశాల, రాజమండ్రి

శ్రీ కృత్తివెంటి వెంకటసుబ్బారావు, విజయవాడ, కృష్ణా జిల్లా

గ్రంథసమీక్ష

శ్రీ జి.యస్. రావు, సాహిత్యరత్న-కశింకోట, అనకాపల్లి, విశాఖ జిల్లా.

శ్రీ వి బి రెడ్డి-రాంకోఠి, హైద్రాబాదు

శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, చిక్కడపల్లి, హైదరాబాదు

## గ్రంథ సమీక్ష

# వెలుగుదారుల "వెలుగుదారులు"

విశాల భారతావనిలో అనేక భాషలున్నాయి ప్రతిభాష లోనూ చెప్పుకోదగిన ఉత్తమగ్రంథాలు కొన్ని వుంటాయి పొగడదగిన రచయితలు కొంతమంది వుంటారు ఒక భాషలో లభించే కొన్ని వుత్తమగ్రంధాలు, అందులో చర్చించబడిన విభిన్నమైన విషయాలు మరొక భాషలో లేకపోవచ్చు ఒకానొక సాహిత్యంలోని ప్రఖ్యాతిగాంచిన రచయితలగురించి మరొక భాషలో వ్రాసి ఆధునిక రచయితలెంతోమంది ఒక నూతన మార్గాన్ని సృష్టిస్తున్నారు. కొందరు దీన్ని సాహిత్య వినిమయ మంటున్నారు. మరికొందరు "ఆదానప్రదాన" మంటున్నారు. శ్రీ జి. సుందరరెడ్డిగారి ప్రస్తుత రచన "వెలుగుదారులు" ఈకోవకు చెందిందే (వెలుగుదారులు రచన—శ్రీ జి. సుందరరెడ్డి, ప్రాప్తిస్థానం మారుతి బుక్‌డిపో, 55 మెయిన్‌రోడ్డు, గుంటూరు— వెల: రెండున్నర రూపాయలు భారత జాతీయ భాష అయిన హిందీలోని అనేక విషయాలు యిందులో చర్చించబడ్డాయి)

"ఆదానప్రదాన" మని హడావుడిగా ఎన్నో రచనలు ముద్రితమవుతున్నాయి కాని స్ఫూర్తిప్రదమైన రచనలు అరుదుగా కన్పిస్తున్నాయి. కారణం రెండు భాషలలోను, ఆయా సాహిత్యాల లోను, ప్రావీణ్యతలేకపోవడమే. శ్రీ సుందరరెడ్డిగారు "వెలుగుదారులు" అనే ఈ పుస్తకంద్వారా ఈ కోవకు చెందిన యువరచయితలకు వెలుగుదారులు చూపించారు

ఈ పుస్తకంలో హిందీతెలుగు భాషలకు సంబంధించినకొన్ని అంశాలను తారతమ్య పరిశీలనా దృష్టితో ఆలోచించి వ్రాయడం జరిగింది మొదట సాహిత్యంయొక్క రూపురేఖలు, దాని ప్రయోజనాన్నిగూర్చి చర్చించి, రెండవ వ్యాసంలో హిందీ తెలుగు సాహిత్యాలను సన్నిహితం చేస్తున్న రససిద్ధులను గురించివ్రాయటం జరిగింది సూర్‌తులసీ, నన్నయ్య, సూరన మొదలగు తెలుగు హిందీ కవులకు గల సాన్నిహిత్యాన్ని చక్కగా స్పష్టపరిచారు భారతేందు—వీరేశలింగం వీరిరువురికి వున్న సామ్యాన్ని చూపారు. మూడవది ఆంధ్ర హిందీ సాహిత్యాలు అనేవ్యాసం. ఇందులో రచయితకున్న తులనాత్మకమైన పరిశీలనాశక్తి స్పష్టపడుతుంది "హిందీ సాహిత్యానికి శ్రీ భారతేందు హరిశ్చంద్ర్ ఆచార్య మహావీరప్రసాదులు చేసిన సేవనంతా వీరేశలింగంగారు యేకాకిగానే తెలుగు సాహిత్యానికి చేశారని చెప్పారు గురజాడ అప్పారావు హిందీకవి రామనరేశ్ త్రిపాఠీ వీరిరువురూ ఒకే కోవకు చెందిన వారన్నారు. శ్రీ తిరుపతి వెంకటకవులను అయోధ్యాసింహ్ వుపాధ్యాయ్ "హరిఔధ్", మైథిలీశరణ్‌గుప్తతో పోల్చారు. తుమ్మలవారి రాష్ట్రగానం గుప్తజీ వ్రాసిన "భారత్—భారతీ"తో తులతూగుతుంది అన్నారు హరివంశ్‌రాయ్ బచ్చన్‌ను దువ్వూరి రామరెడ్డిగారితో పోల్చారు.

నాల్గవది "హిందీ సాహిత్యంలో వీరగాధలు" అనేవ్యాసం ఇందులో రాసోగాధలు, ఆనాటి డింగల్ కవితను తెలుగు పాఠకులకు చక్కగా పరిచయం చేసి హిందీ తెలుగులలోని వైవిధ్యాన్ని సూచించారు "హిందీ సాహిత్యంలో భక్తిస్రవంతి" అనే వ్యాసం భక్తి కవితా సారస్వతాన్ని నాల్గు శాఖలుగా విభజించి విడమర్చి చూపింది సూర్, కబీరు, తులసీ, జాయసీల ప్రాశస్త్యాన్ని కొనియాడింది

మహాకవి తులసీదాసు భారత చరిత్రలో ఒక మహాపురుషుడు ఆయన బహువిధమైన ప్రతిభావ్యుత్పత్తులు ఆయనకు హిందీలోవున్న అద్వితీయస్థానం ఈ వ్యాసమూలంగా చక్కగా తెలుస్తుంది హిందీలోని ప్రముఖ రచయితలగూర్చి మరొక వ్యాసం వుంది

ప్రేమచంద్ నేటి నవలా సాహిత్యంలో మహోన్నతమైన స్థానాన్ని అందుకొన్నాడు ఈ గ్రంధ రచయిత ప్రేమచంద్‌ని

తరిచి తరిచి చదివారు. చక్కగా అతన్ని జీర్ణించుకొని ఈ వ్యాసాన్ని వ్రాసినట్లున్నారు ప్రేమచంద్ గురించి ఈయన వ్రాసిన వాక్యాలు అమూల్యములు "ప్రేమచంద్ పాత్రలు సజీవంగా మనముందు నిల్చొని గాఢ సుషుప్తిలో వున్న అంతరంగాన్ని రెచ్చగొట్టి జాగ్రదవస్థకు తీసుకొస్తాయి పేదరికం కారణంగా ఆత్మ అనేది చచ్చిపోయిందనీ మనజీవితాలు నాశనమయ్యాయనీ అవి మనకు తెలియజెబుతాయి మానవులుగా జన్మించినా, పేదరికం అనే శృంఖలాలలో మనం జంతువులుగా జీవిస్తున్నామని అవి నిరూపిస్తాయి" ప్రేమచంద్ సృష్టించిన సజీవ, సచైతన్య పాత్రలు అనే ఈ వ్యాసం అత్యుత్తమమైంది

జాతీయభాష, జాతీయలిపి, విజ్ఞానము—మానవుడు అనే వ్యాసాలు రచయితకున్న జాతీయ దృక్పథాన్ని తెలియజేస్తాయి హిందూ సంస్కృతిపై ఇస్లాం మత ప్రభావం పరిశోధనా వ్యాసం వంటిది. బాపూజీ—లెనిన్ వీరిద్దరూ ఈనాటి యుగపురుషులని రచయిత అభిప్రాయపడ్డారు. చివరకు వసుధైక కుటుంబాదర్శ జ్యోతిని వివరించి వెలుగుదారులు చూపించారు భారతీయ జీవిత విధానాన్ని, దృక్పథాన్ని పాఠకులకు మరొక్కసారి గుర్తుచేశారు.

ఇరుగు పొరుగు సాహిత్యాలకు సంబంధించిన యిటువంటి పుస్తకాలు తెలుగులో యింకా ఎన్నైనా వ్రాయబడాలి ఈ రచయిత తెలుగును గురించిన అనేక సాహితీవిషయాలు విపులంగా హిందీలో వ్రాస్తే మరీ బాగుంటుందనుకొంటాను.

ఇది ప్రతి విద్యార్థి చదువతగిన పుస్తకం అంటే అతిశయోక్తి కానేరదు

జి. యస్. రావు

## గులాబీ తోట

రచయిత: యగళ్ళ రామకృష్ణ. పుటలు. 128, వెల రు. 1—75

ప్రతులకు. యస్ యల్. ప్రచురణలు, సుశీలాసదన్ న్యూకాలనీ, శ్రీకాకుళం (ఆం. ప్ర.)

ఇదొక చిన్న కథానికల సంపుటి. జలసీ, విరహగీతి, కనకారావు, కల్యాణము, గగనకుసుమం, నందనవనం, నివేదన, దొంగ, క్షీరసాగర జనిత, గులాబీతోట అను తొమ్మిది కథానికలు యిందు కూర్చబడినవి చివరి కథానిక గులాబీతోట అను పేరునే రచయిత పుస్తకము పేరుగా గ్రహించాడు.

రచనలందు కథా సంవిధానం, ఉదాత్తమైనా శైలిలేక పోయినా హృదయంలో జనించిన ఊహలను వ్యక్తం చేయుటకు రచయిత యత్నించుట ప్రశంసనీయమే ఊహాపథంలో అపుడపుడు కలిగిన అనుభూతులకు అక్షరరూపమిచ్చి పాఠకులకు యీ చిన్న పుస్తకమునందించిన శ్రీరామకృష్ణ ముందుముందు ఉత్తమ రచనలు సాగిస్తారనడంలో సందేహంలేదు.

వి. వి. రెడ్డి

## ప్రజాస్వామిక ప్రణాళికలు

రచన అశోకమెహతా (ఎం. పి.), అనువాదం యర్రమిల్లి నరసింహారావు, ప్రచురణ: రవీంద్ర పబ్లిషింగ్‌హౌస్, తెణుకు వెల రు. 1 25

ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త, రాజకీయ నాయకుడు అగు శ్రీ అశోక్ మెహతా భారతదేశ ప్రణాళికా విజయావసరాన్ని నొక్కివక్కాణిస్తూ అందుకు ఎదురవుతున్న సమస్యలను వాటిని అతిక్రమించడానికి అలవరచుకోవలసిన దృక్పథాన్ని చాలా ఈపుస్తకంలో సునిశితంగా సమీక్షించారు. భారతదేశ ఆర్థికాభ్యున్నతికి ప్రణాళికా విజయం ప్రథమ సోపానమని అందరూ అంగీకరిస్తున్నదే. అయితే వ్యక్తిగత ప్రయోజనాలు, పార్టీ ప్రయోజనాలు, పన్నుల విధానాలు, ప్రణాళికావశ్యకపరిస్థితుల్ని అవగాహన చేసుకోవడంలోఉంటున్న వైవిధ్యాలూ ఇవన్నీ సామ్యవాద వ్యవస్థా నిర్మాణ వేగాన్ని తగ్గిస్తున్నాయి. ప్రజాస్వామ్య పద్ధతుల్లో ప్రణాళికల్ని విజయవంతం కావించడానికి పడవలసిన ఇబ్బందులు మిక్కుటమైనవి. టోటలిటేరియన్ వ్యవస్థలో ప్రణాళికలు వేగంగా అమలు జరిగినట్లు ప్రజాస్వామ్య వ్యవస్థలో అమలు కాజాలని విభిన్న పరిస్థితుల్ని ప్రతిపకాంతావరణాన్నీ శ్రీ అశోకమెహతా యీ పుస్తకంలో చర్చించారు ప్రపంచార్థిక వేత్తలనేకులు తమ గ్రంథాల్లో వ్రాసిన విశేషాలనాయన యెడనెడ ఉటంకిస్తూ తన అభిప్రాయాలను జోడించారు. 1954 లోనే వ్రాయబడిన యీ పుస్తకం 1961 లో ద్వితీయ ముద్రణపొందింది అప్పట్లోనే శ్రీ అశోకమెహతా ప్రణాళికా విజయానికి సూచించిన యీ దిగువ అంశాలను గమనించడం దేశాభ్యున్నతి నాశించే ప్రతి ప్రజాస్వామ్యవాదికీ అవసరం.

"మన సమాజంలో పెంపొందుచున్న నూతన నాగరికత, పార్టీ అహంకారములను తగ్గించి తీరవలసిన పరిస్థితిని ఏర్పరుస్తోంది...ప్రజాస్వామిక పద్ధతులలో సోషలిస్టు సమాజం పెంపొం

దవలెనంటే క్రమానుగతమైన తన స్వాతంత్ర్యములను గురించి కలలుకంటే చాలదు. సహకారం ప్రతిఘటనలు ఒకవిధమైన విరుద్ధశక్తులుగాకాక కలిసి పనిచేసే రెండు ఏకశక్తులు కాగలగాలి.. పౌరులుగానేకాక వినియోగదారులుగా కూడా ప్రజలు ఆత్మనిగ్రహం, పరిస్థితుల అవగాహన అలవరచుకోవాలి.... ప్రణాళికలు విజయవంతమగుటకు క్రమశిక్షణ కూడా చూపించాలి...ఏ ఒక రాజకీయ పార్టీలోను అభివృద్ధిని కోరువారు అగ్రగాములుగా నడచుటలేదు...కొన్ని రంగములలోని కార్యకలాపములను రాజకీయములనుండి దూరముచేయుటయే ప్రజాస్వామిక ప్లానింగ్‌లోని ప్రథమ చర్య..."

ఆర్థిక ప్రణాళిక సాఫల్యానికి రాజకీయంగా సాంఘికంగా ప్రజలు, నాయకుల మనస్తత్వాల్లో రావలసిన మార్పునుగురించి ఒక ప్రతిపక్షనాయకుడు వ్రాసిన యీ పుస్తకం నిజంగా యీనాడు మన దేశాభివృద్ధికి కావలసిన దృక్పథ సమైక్యతను సమగ్రంగా ఉద్బోధిస్తున్నది.

## కథల భగవద్గీత

భగవద్గీతలోని ప్రధాన ధార్మిక శ్లోకాలను ఆధారపరుచుకొని వాటికి కథలను జోడిస్తూ చేసిన సరికొత్త వ్యాఖ్యాన గ్రంథం–రచయిత శ్రీ రాయ్‌వ్యాస్, ప్రచురణ: సారథీ పబ్లికేషన్స్, గాంధీ చౌక్, తెనాలి. వెల: రు. 3. యావత్ప్రపంచము సమగ్రలౌకికాధ్యాత్మిక మిశ్రమ వేదాంతబోధగా శిరోధార్యమని ఆమోదిస్తున్న విశిష్ట భారతీయ జీవనగీత భగవద్గీత. దీన్ని పలువురు వ్యాఖ్యానించారు. ఎందరెక్కినా మరొక్కరికి చోటుఉండే "పుష్పకం" వలె ఎందరు వ్యాఖ్యానించినా మరోవ్యాఖ్యానానికి అవకాశం ఉన్నదని పించగలది "గీత". శ్రీ రాయ్‌వ్యాస్ గీతను కథారూపంగా వ్యాఖానించారు. పురాణాలనుండి ఇతిహాసాలనుండి గత–సమకాలిక చరిత్రమండి అనేకఘట్టాలను వాటి కథారూపాలను పొందుపరచి దానికి అంతర్లీనంగా ఉన్న గీతాశ్లోకాన్ని వ్యాఖ్యానించిన యీ ప్రయత్నం సరికొత్తది. అంతేకాదు–గీతను అవగాహన కావించుకోడానికి ఆధునిక వ్యక్తికి అందుబాటైనది. కథలను ఏరుకోడంలో అన్నిమతాల కథలకూ ప్రాతినిధ్యం ఇవ్వడంవల్ల భారత జాతీయైక్యతాధోరణికి కూడా యీ పుస్తకం దోహదకారిగా ఉంది. భక్తి, జ్ఞాన, కర్మయోగాలను రచయిత 200 కథలతో సువ్యక్తంచేశారు. భగవద్గీతకిది రచన కథాదీపిక. కాని ఒక్క చే–ముద్రణపట్ల కూడా శ్రద్ధవహించిఉంటే రచన మరింత రమ్యంగా ఉండేది.

## సౌందరనందము

గీత రూపకము–రచయిత: దామెర రాజగోపాలరావు. వెల: రూపాయి. నటీ సూత్రధారుల ప్రస్తావికతోసహా రచింపబడిన యీ గీత రూపకంలో బుద్ధుడు, నందుడు, ఆనందుడు (బుద్ధశిష్యుడు) సుందరి, బృంద (చెలికత్తె), మాలతి, మాధవి (పరిచారికలు) పాత్రలు. ఇది ఆరు దృశ్యాలుగా విభజింపబడింది. ఒక్కొక్క దృశ్యాన్ని ఒక్కొక్క అంకంగా రచయిత పేర్కొన్నారు. ఇందులో పాత్రోన్మీలంగాని, కథ పుష్టిగాని, సంఘటనల హేతుబద్ధ పరిణామస్ఫురణగాని, నాటకీయతగాని–ఏమీలేవు ఉన్న దొక్క చే–గణయతి నియతమైన పేలవపునడక. పద్యరచనలో కూడా మనస్సును ఆహ్లాదపరిచే ఒక్క చక్కని భావ ప్రకటనమైనా లేదు.

"మారుతము వోలె నలశాక్యమౌని వచ్చి
నావలపు జోతి గొనిపోయినారు; మిగిలి
తి నిక నద్దానిరిత్తవత్తి నిదె నేను
దుర్భర విషాద ధూమవన్మూర్తి నగుచు"
అను సుందరి భాషనలోను

సిచిరునవ్వు వెన్నెలలో విండిన నాయెద కల్వపువ్వు నే
దోచెలి! యీ దురంతవిరహాగ్రనిదాఘపుటెండ చిచ్చులన్
సైచునె? వాడి మాడినది; చావగలేక యొకండ నేనిటన్
తోచెదు పుష్పశూన్యమగు తూడటులక్కట! యేమి
చెప్పుదున్"

అనునందుని విరహవాక్యంలోను కాస్త కవితాశిల్పం కనిపిస్తుంది. ఇంతే.

--పి. ఎస్. ఆర్.



# కాకినాడ, మచిలీపట్నం రేవులు

గత సెప్టెంబరు నెలలో కాకినాడరేవుకు 19 స్టీమర్లు వచ్చాయి ఎగుమతి అయిన కార్గొ 25,452 మెట్రిక్ టన్నులు. దిగుమతి అయిన కార్గొ 7,128 మెట్రిక్ టన్నులు.

ఎగుమతులు

| సరుకు వివరం: | మె. ట. | | కి గ్రా. |
|---|---|---|---|
| ఇండియన్ ముడిఇనుము. | 16,250 | — | 704 |
| పొగాకు | 5,681 | — | 421 |
| తాటిపీచు | 380 | — | 397 |
| తాటి బోదెలు | 32 | — | 600 |
| ఎముకల ముక్కలు (ఇండియన్) | 277 | — | 381 |

| సరుకు వివరం: | మె. ట. | | కి. గ్రా. |
|---|---|---|---|
| వేరుసెనగపొట్టు. | 441 | — | 221 |
| బియ్యపు తవుడు | 1,469 | — | 168 |
| పొగాకు సీడ్ ఆయిల్ | 29 | — | 275 |
| దున్నపోతుకొమ్ములు | 16 | — | 367 |
| చక్కెర | 809 | — | 550 |
| డినేచర్డ్ స్పిరిట్ | 68 | — | 752 |

7,128_000 టన్నుల రాక్ ఫాస్ఫేట్లు దిగుమతి అయ్యాయి.

మచిలీపట్నం రేవుకు 1962 సెప్టెంబరులో 4 స్టీమర్లు వచ్చాయి. 8991 మెట్రిక్ టన్నుల ముడి ఇనుము కార్గొ ఎగుమతి చేయబడింది.

---

మన స్వాతంత్ర్య పరిరక్షణకై
ముష్కర చైనీయులతో ముఖాముఖిగా
హోరాహోరీగా పోరాడుతున్న
మన సైనిక వీరుల సహాయార్థం
అమూల్యమైన
మీ రక్తాన్ని దానంచేసి
వెంటనే
మీ విధిని మీరు నిర్వర్తించండి!!!

స్వాతంత్ర్య
పరిరక్షణలో
జాతీయ రక్షణ
నిధికై
ధన, కనక, వస్తు
రూపంలో విరాళాలిచ్చి
మీ విధిని మీరు
నిర్వర్తించారా?

ited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్ డివిజన్లు
(1961 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | | 223 |
| జనసాంద్రత (చదరపు మైలుకు) | | 340 మంది |

## పంచవార్షిక పశుగణన – 1961

(వేలలో)

| | | |
|---|---|---|
| పశువులు | ... | 123,45 |
| గేదెలు | ... | 69,49 |
| గొర్రెలు | ... | 83,63 |
| మేకలు | ... | 42,47 |
| గుర్రాలు | ... | 71 |
| ఇతర జంతువులు | ... | 6,76 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| వివరాలు — | 1959–60 | 1960–61 | 1961–62 |
|---|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 | 378 |
| సగటున వేయి గ్రామాలకుగల బ్లాకులు ... | 10.66 | 16 | 17 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 16 | 16 |
| బ్లాకులక్రింద వున్న గ్రామాలు ... | 178,87 | 20,901 | 245 02 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 187,31 | 205,73 | 235,65 |

## ఖనిజోత్పత్తి

| | 1959–60 | 1960–61 |
|---|---|---|
| | టన్నులు | టన్నులు |
| బొగు .. | 2296,000 | 2596,000 |
| ముడిఇనుము ... | 203.000 | 233,000 |
| మాంగనీస్ ... | 16,000 | 24,000 |
| అభ్రకం ... | 3,000 | 3,000 |
| సున్నపురాయి .. | 776,000 | 1,036,000 |

